

ఖర
చైత్రము

# భారతి

సంపుటము 28
సంచిక 4

# సుదర్శనుడు

శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి

[రఘువంశ మహారాజులలో, సుదర్శనుడు సుప్రసిద్ధుడు ఇతని తండ్రి ధ్రువసంధి. తాత పుష్యమహారాజు. ధ్రువసంధి అమిత పరాక్రమశాలి. ఒకనాడు వేటాడుచుండగా ఒక సింహము ధ్రువసంధిపై బడి చంపివేసెను. అప్పటి కాతని కుమారుడు సుదర్శనుడు పాలబుగ్గల పసివాడు. సింహాసనమును శూన్యముగా నుండనీక, వృద్ధమంత్రులు, వెంటనే సుదర్శన బాలకుని రాజుజేసిరి. సింహాసనముపై కొలువు దీరించి, ఆ బాలసుదర్శన మహారాజునకే వంగి నమస్కరించి, నిలబడి రాజకార్యములు నివేదించుచు, వారు, యథావిధి తత్ప్రతినిధులుగ రాజ్యశాసనమును నడిపిరి. సుదర్శన మహారాజు, సింహాసనమున నుండియే అన్ని కళల కౌశలము గడించి, పెరిగి, శత్రువుల కజయ్యుడై, రఘువంశయశోభూషణు డయ్యెను.

శ్రీ దేవీభాగవతోక్త వర్ణితుడైన ధ్రువసంధి కుమారుడు సుదర్శనుడు ఇంకొకడు కలడు, ఆతడే ఈతడని కొందరు అందరు. కాని, అది అసంగతము.

సుదర్శనుని యుదంతము, మహాకవి కాళిదాసుచే నిట్లు వర్ణింపబడినది.]

*　　　*　　　*

పుత్రుని ధర్మపత్ని కనెఁ బుష్యయుతంబగు పూర్ణిమాతిథిన్,
వృత్రరిపూపమున్, ధృతి గభీరుఁ, బ్రభాజిత పుష్పరాగునిం,

పుత్రునిఁ బుష్యనామకునిఁ; బుట్టుడు రెండవ పుష్యమట్లుగా
ధాత్రి నతండు, పొంగుచు నితాంతముఁ బుష్టినిఁ గాంచె లోకముల్.

పొనరి, మహామహుండయిన పుత్రమహీపతి, జన్మభీరువై
తనయుని భూమియేలుబడిఁ దాఁచి, బ్రహ్మవిదగ్రగణ్యుఁడై
మునిమునిఁ జేరి, శిష్యుఁడయి, మేల్మి నెఱింగి సమగ్రయోగముల్,
గొనియె నజన్మయోగమును, గూరిన సాధనలన్ సుసిద్ధుఁడై.

అతని యనంతరం బతని యాత్మభవుండు ధ్రువోపమేయుఁడై,
ధృతి ధ్రువసంధినాఁబరఁగు ధీరుఁడు ధారుణి నేలె; సత్యసం
యతియును సత్యసంధుఁడును నౌ ధ్రువసంధియెడన్ ధృతాంజలిన్
జతపడి నమ్రులౌ నరుల సంధి ధ్రువంబయిపోయె నేయెడన్.

చెలఁగి మృగాయతాక్షుఁడు నృసింహుఁడు నౌ ధ్రువసంధి, వేడ్కసం
ధిల, మృగయార్థియై చని, వనిం, బడి సింహమువాతఁ గూలె; ను
ద్దులకొడుకౌ సుదర్శనుఁడు తోఁటలలోఁ బ్రతిపత్సుధాంశుఁడ
ట్టులు ప్రియదర్శనుండయి కడుం బసిపాఁడు నయ్యు నుండఁగన్.

అమరపురమ్ముఁ జేరఁ జని నాతని కూర్చు నమాత్యులైకమ
త్యమునఁ జెలంగి, యేకకులతంతువు బాలు సుదర్శనాఖ్యు, వా
సిమెయి నయోధ్య కేలుగడఁ జేసిరి, నాథుఁడు లేమిచే నజ
స్రము నతిదీనదీనవివశస్థితి క్రుంగు ప్రజం గనంగనై.

బాల సుదర్శనాఖ్య జనపాలునితో రఘువంశ మొంతయుం
బోలిన పోలికిం బడసి పొంగె, నవేందునితోడి మింటితోఁ,
గ్రాలెడి శావకైక మృగరాజముతోడి వనమ్ముతో, రుచిం
దాలిచి లేఁత మొగ్గయగు తామరపూపిరితోడి సీటితో.

పాలిఁ గిరీట మూను మఱుమాటన తండ్రికిఁ బోలువాఁడ యీ
బాలసుదర్శనుం డనుచు భావములం దలపోసి రయ్యెడం
బాలితు లెల్లరుం; గలభమాత్రము తోఁచియు, గాలివాలునం
జాల ప్రవృద్ధమై, మొయిలు చయ్యనఁ గ్రమ్మదె యెల్లదిక్కులన్?

వారణ మెక్కి రాచపురిబాటలలోనఁ గుమారుఁ డట్టు, లా
ధోరణుఁ డగ్ర్యవేశమును దోరముగాఁ గొని యూఁత యీయ నే

తేరు సుదర్శనుం, బ్రకృతిధీరు, షడబ్దవయస్కు, భూధవున్,
వారక తండ్రి గారవమునం దిలకించిరి పౌరు లందఱున్.

ప్రాఁకి యధిష్ఠితుండయిన బాలసుదర్శనరాజు, పైతృకం
బౌ కనకాసనంబును సమగ్రముఁ గ్రమ్మఁగ దేరఁ డయ్యెఁ, జా
మీకరపింజరంబయిన మేలిమెఱుంగుల పొంగుతోడ న
స్తోకసమావృతంబయిన తోరపు నెమ్మెయితోడ నింపెఁ దాన్.

సింగపుగద్దెనుండి యొక చిన్నము క్రిందికి డిగ్గి మేలిమిం
బంగరుపాదపీఠి నొకవంక స్పృశింపక, వేయివుళ్ళ సొం
పుం గొని కెంపులక్కజిగి పొంగులు వాఱెడు వాని యడ్గులన్
బంగరు తమ్మిపూవులకు హాలుల మ్రొక్కిరి రాజపుంగవుల్.

అమితాల్పంపు ప్రమాణ మొప్ప మణియం దర్థిన్ మహానీలశ
బ్దము, పెంపొందు నిజప్రభావవిభవప్రాచుర్యముం జేసి, వ్య
ర్థము గాకుండ వెలుంగునట్టులు, మహారాజన్న శబ్దంబు సా
ర్థమ్మై తోఁచెను బాలరాజునెడ రారాజత్ప్రకారంబునన్.

ఇరుగ్రేవం గొని చామరమ్ములను సేవింపం, గపోలస్థలీ
దరలోలోభయకాకపక్షముల యందం బొప్ప నవ్వాని తా
మరపూమొగ్గమొగంబునన్ వెలలి క్రమంబైన లేఁబల్కు, సా
గర వేలాస్థలులందునన్ స్ఖలన మెక్కంబోని దయ్యెం బోరిన్.

అనుపమ హేమపట్ట సుషమాంచితమైన నొసంటఁ దీర్చిది
ద్దిన తిలకమ్ముతో మెఱయు తీయని జాబిలి నెమ్మొగమ్మునన్
నునుచిఱునవ్వువెన్నెలలు నూల్కొని కుల్కు- నతండు, శాత్రవాం
గనల మొగమ్ములం దిలకకాంతివిహీనములం బొనర్చె, దాన్.

దిరిసెనపూవుకన్న సొరిదిన్ సుకుమారుఁడు సాగరాంబరా
వరుని కుమారుఁ డాతఁడును బంగరు సొమ్ములు దాల్ప, నస్సురు
స్సురు వడువాఁడ యయ్యు, శుభశోభనలీల ధరింపనేర్చె దు
ర్భరమగు భూభరమ్ము, నతిపారతరానుభవమ్ము పెంపునన్.

పలకపయిన్ గురూత్తములు వ్రాసి యొసంగిన యక్షరమ్ములం
దెలివిడి నాకళించుకొన నేరనినాఁడె, సుదర్శనుండు, న
ర్మిలి శ్రుతవృద్ధయోగ సుసమృద్ధిమెయిం గొనె, దండనీతిలోఁ
గల ఫలముల్ సమస్తములుఁ గన్నఁ గరామలకమ్ములై తగన్.

ఉరమున నిల్వారమ్ముఁ గొన నొక్క రవంతయుఁ జోటు చాలమిం,
బరగి పసందు జవ్వనపువాఁ డవుదాఁకఁ బ్రతీక్షమాణయే
సిరి, నెరి సిగ్గరిల్లి కలెఁ జిక్కని కౌఁగిటఁ జేర్చె బాలభూ
వరుని, సితాతపత్రముల పాయని నీడలపేరఁ జెచ్చెరన్.

వీఁక యశోపమానమును వీసము నొందకమున్నె బద్ధ మౌ
ర్వీకిణలాంఛనమ్ములు స్ఫురింపకమున్నె, నిశాతఖడ్గముం
జేకొని ముష్టి నంటుకొనఁ జిత్తము వాఱకమున్నె, యాధృత
శ్రీకు భుజమ్ము వల్లిఁ గొనె సింధువరాంబర లెన్స రక్షఁ దాన్.

కాలము సాఁగునక్కొలఁదిఁ గ్రాలెడు బాలసుదర్శనావనీ
పాలుని మేనివౌ నవయవమ్ములె కాదు, జనప్రియమ్ములై,
శ్రీలసితమ్ములై, తొలుతఁ జిన్నవియై, యసమంబులై, యశో
మూలములైన వంశ్యగుణముల్ సయితంబు కటంబు వర్ధిలెన్.

వారక పూర్వజన్మమునఁ బారముఁ గాంచియయున్న వానివిన్
సారె స్మరించు ప్రోడవరుసన్, శ్రమపెట్టక యొజ్జలన్, మహో
దారధృతిన్ గ్రహించె నృపదారకుఁ, డోలిఁ, ద్రివర్గముం గొనం
గారణమౌ త్రివిద్యలను, గాంచిన తండ్రి ప్రజన్, సమంబుగన్.

నించిన యస్త్రశాస్త్రమును నేరుచువేళఁ దనూత్తరార్ధ మొ
క్కించుక చాచి, యెత్తి పయి కింపుగఁ గట్టిన జుత్తుతోడ, నా
కుంచిత సవ్యజానువున, గొబ్బున వీనులనంట లాఁగి, సం
ధించిన పూన్కితోడి విలు, నిల్చు నరేంద్రసుతుండు శోభిలెన్.

లలనాలోక మదాళిపేయము, మధూల్లాసంబు, రాగానుబం
ధలసత్పల్లవ, మిక్షుచాపతరుసూనం, బద్భుతామోదదో
హల,మవ్యాజవిధాన, ముజ్జ్వలము, సర్వాంగీణ, మాకల్పజా
తలలామంబగు క్రొత్తజవ్వనము నాతం డొందె శ్రీచిందఁగన్.

తొలఁకన్ నేర్మి, లిఖించి చిత్తరుపులందున్, దూతిసంపర్కితో
త్పలపత్రాక్షులకన్న మిన్నలయి కందర్పాస్త్రముల్ రాజక
న్యల, సత్సంతతిఁ గోరి తెచ్చి, ప్రియురాండ్రం జేసి, యవ్వాని, కా
నలిఁ గల్పించిరి పూర్వభూరమణులన్ సాపత్న్యముం బ్రెగ్గడల్.

# శ్రీ అరవిందులు



**శ్రీ వేలూరి శివరామశాస్త్రి**

## 4

'అసద్రూపమును అచిద్రూపమును దుఃఖరూపమునగు నీజగత్తు సచ్చిదానంద బ్రహ్మస్వరూపమును ప్రకటించుచున్నదని చెప్పు టేమి యుక్తి?' అను ప్రశ్నకు మాయావాదమువల్ల సందేహము పోలేదని తెలిసికొంటిమి.

చిచ్ఛక్తి విభిన్న భూమికలగుండ జడముగా అవతరించుటకు తన్ను సంకోచము చేసికొనినందువలన ద్వంద్వజుష్టమగు సృష్టి యేర్పడెను. జగత్కారణమునకు సంకోచము వ్యాకోచము అను రెండు ధర్మములు కలవు. చేతన మెట్టొక మెట్టే అవతరించుచు వచ్చినకొలది సంకోచము చెంది చెంది తుదకు జడములో తన్ను దా మరచిపోయెను. ఆ చేతనము జడమునందది దాగుకొనెను. ఇట్టి సంకోచ పరమసీమయందే జడోత్పత్తి. ఇచట సత్తు బొత్తిగా అసత్తాయెను. వెలుగు చీకటిగా గడ్డకట్టెను. ఆనంద మనానందముగా మారిపోయెను. దాని యేకత్వ మసంఖ్యేయములగు పరమాణువులుగా తునిసెను. చిన్మయమగు ఇచ్ఛాశక్తి కఠోరమగు యంత్రశాసనములో చెరపడెను. ఈ సంకోచము ముగియుడు అచేతనము జడమునందంతర్నిహితమగు చేతన శక్తివలన వికాసము లేక వివర్తము ఆరంభమాయెను. మొదట అవతరణము అవరోహము అనులోమము లేక స్వాపము. పిదప ఉత్తరణము ఆరోహము, విలోమము లేక జాగరణము. చేతన ఏ మార్గమున అవతరించి అచేతనమాయెనో ఆ మార్గముననే తాపలు తాపలుగా ఏర్పడిన వివర్త ప్రణాళికగుండ వికసించుటయే సృష్టి ఉద్దేశము. ఇది తప్పనిసరిగా జరగవలసిన పరిణామము. కావుననే ఈ సృష్టికి రెండు ప్రవాహములు. ఒకటి ఎరుకకు మరపు. రెండు దాని మెరుపు. నిదిరించు నీ చేతనకు మెలమెలగా మెలకువ కలుగుటయే వివర్తమునకు సార్థకత. ఈ సృష్టికొరకు ఏక మనేకము, అసీమము ససీమము, నిర్గుణము సగుణమును ఆయెను. విచిత్రమగు నీ సృష్టియంతయు తరుగని పరమేశ్వరుని ఐశ్వర్యములలో నొక ఐశ్వర్యమున కాంశిక సత్యమని చెప్పక చెప్పుచున్నది.

అద్వితీయమును అనంతమును అఖండమునగు ఈ భూమ తన స్వరూపములో నిసుమంతయు మార్పు లేకుండనే సోపానక్రమమున బహుళత్వమును ఖండత్వమును చెందుచు సాంతమగు జడమువరకు దిగుచు వచ్చెను. ఈ దిగుటలో మొదటి సోపానము అతి మానస లోకము—*Super Mind*. ఇచట ఏకాత్మ్యజ్ఞానమే కాని బహుత్వసంఘర్షము లేదు.

దీనికి పిమ్మట అధిమానసలోకము—*Over Mind* ఇచట గూడ ఏకాత్మ్యజ్ఞాన మావరింపబడి పోలేదు గాని అద్వితీయుడగు నా యొకడు బహుకేంద్రగతు డాయెను. ఇచట బహుత్వమును స్వాతంత్ర్యమును ప్రకటమయినను ఏకత్వము లోపింపలేదు.

దీనికి దిగువ మానసలోకము. ఇచట ఏకాత్మ్యజ్ఞాన మించుమించుగా లోపించెను. కాని అది క్షీణవాసనవలె ఇచట మినుకు మినుకు మనుచుండును. ఏకాత్మ్యజ్ఞానమునకు మారుగా భేదాభేదజ్ఞానముపై దీని ప్రతిష్ఠ. ఇదియే మానసలోకమునందు గల విశేషము.

దీనికి దిగువ ప్రాణలోకము. ఇది కామనలకును కర్మమునకును కర్మశక్తికిని వాసనలకును వీనికి తోబుట్టువులగు ఇతర వృత్తులకును క్రీడారంగము. ఇచట చేతన మరియు నెక్కుడు చీకటిచే పొదువబడెను.

చిట్టచివర జడము. ఇచట చేతన జడావరణముచే పరిపూర్ణముగా ఆచ్ఛాదింపబడెను.

ఇట్టి అవతరణము సృష్టిప్రవాహమునం దొకపాయ.

జడములో సంపూర్ణముగా మరుగుపడిపోయియు అనుస్యూతమైయున్న ఆ చేతన మరల పరావర్తనము చెందుటయే వివర్త మూలరహస్యము. జడాశ్రయమున బహు కేంద్రములందు దివ్యచైతన్యక్రమవికాస మీ వివర్తధారకు పరిణతి. తదభిముఖముగనే యీ వివర్తము ప్రవహించుచున్నది. అవతరణ చరమసోపానము జడము, మరల ఉత్తరణ ప్రయత్నములో ప్రథమసోపానము. తన ప్రవాహములో లోపల అతిమానసవిజ్ఞానము సక్రియమగుటయు అనేకములును సాంతములునగు కేంద్రములందు ఏకత్వానంతత్వములు అభివ్యక్తమగుటయు వివర్తమునకు ఫలము. ఏది ఆవరింపబడెనో అదియే వికసితమాయెను. ఏది నిద్రించెనో అదియే మేలుకనెను. మరియు నేటికిని ఏది అనుస్యూతమయియున్నదో అది పూర్తిగా ప్రస్ఫుటము కావలయును. ఈ బ్రహ్మాండమునం దింతవరకు పరిపూర్ణముగా సచ్చిదానంద మభివ్యక్తము కాలేదు. ఈ వివర్తప్రవాహము అట్టి చరమపరిణామములక్ష్యముగా గొనియే ముందుకు నడచుచున్నది.

మన స్థూలదృష్టి కీ ప్రపంచమున ఈ దిగువ సంగతులు కనబడును. చెట్లు చేమలుగాని కీట పతంగాదులుగాని ఉద్భవింపకమున్ను ఈ భూమి కళపెళలాడు బాష్పకటాహము. ఆ స్థితిలో జీవకణ మేదియు నిందుండుటకు వీలులేదు. ఏలనగా జీవకణము బ్రతికి బట్టకట్టుటకు కిందు చక్కని గాలిగాని పేయమగు నీరుగాని ఉనికి గొనదగిన ఉర్వరగాని ఉండదు గదా. క్రమక్రమముగా ఆ ఆవిరిముద్ద చల్లనగుచు రూపాంతరమొందెను. మెత్తనిమన్ను నిర్మలమగు గాలి తీయని నీరు మొదలగున వన్నియు క్రమముగా ఆవిర్భవించెను. పిదప భూమిమీద ఉద్భిద్రూపముగా ప్రథమ ప్రాణస్పంద మేర్పడెను. అది- కాలము కడచిన కొలది బహుళమగు అడవిగా మెండుకొనెను. జడమిటులు ప్రాణమయమాయెను. ఇది యెటులు సంభవించెను? ప్రాణశక్తి జడములో అర్ధసుప్తమయి ఉండవలయునుగదా! కానినా డిది యెటులు సంభవించును?

ఈ వివర్తప్రవాహము మరికొంత ముందులకు సాగెను. ఈ భూమి జీవధారణ మొనరించుటకును నివసించుటకును అనువయినకొలది నిదిరించుచున్న యీ చేతన మెలమెల్లగా మేలుకొనదొడగెను. పలుతెగలగు కీటములు పక్షులు పశువులును పుట్టుకొనివచ్చెను. అచేతనమునం దిటులు చేతన సంచారము మొదలై సోపానక్రమముగా ఊర్ధ్వాభిముఖముగ సాగుచుండుట మనకు విశదమగుచున్నది.

జీవజాలములో చేతనాసంచారము కలిగెనను మాటయే కాని మనోవికాసముమాత్రము కలుగలేదు. మనుజుని ఆవిర్భావముతోపాటు మనస్సు జాగరిల్లెను.

ఈ ప్రవాహములో ఒక విశేష మున్నది. జడమునం దింకను సంచారము కనబడకముందే ప్రాణుల యునికికి జడ ముపయుక్తమాయెను. మొదట ఆధార మేర్పడెను. పిదప ప్రాణము స్పందించెను. అటు పిమ్మట అభివ్యక్తమాయెను. ప్రాణము జడమును ఆధారముగానో రూపాంతరముగానో చేసికొనెనే కాని దానిని తిరస్కరించి తాను మిగులలేదు. ఇట్టి ప్రాణముచే జడము ప్రాణిత మాయెను లేక ప్రాణమయమాయెను. ఇటులే ఆ వివర్తము మనస్సోపానమున గూడ ప్రాణమునుగాని జడమునుగాని లోపింపజేయలేదు. మనోమయుడగు మనుష్యునిలో జడమునకును ప్రాణమునకును అద్భుతమగు రూపాంతరము, ఆశ్చర్యమగు సమన్వయము కలిగెను. అదృశ్యములగు రెండు శక్తుల ప్రభావమువల్ల మనోమయుడును సంవిద్వ్యక్తుడునగు మానవు డావిర్భవించుచున్నాడు. దిగువ నుండి పైకెగయ నెంచు చేతన—స్ఫోటప్రభావ మొకటి. పైనుండి కిందికి దిగు ప్రాణాది శక్తిప్రభావ మొకటి. ఈ రెంటివలనను వివర్తము క్రమక్రమముగా ముందుకు సాగుచున్నది. జడమీ రెంటియు ప్రభావము చేతనే ప్రాణమయమగుచున్నది. నిద్రించుచున్న ప్రాణము మేలుకొనగనే జడము ప్రాణమయమయినపుడు జడమునం దున్న చేతనాశక్తి పైకి ఉత్తరించు శక్తి యొకటియు, ప్రాణము క్రిందికి అవతరించు శక్తి యొకటియు కనబడును. ఇటులే ప్రాణమునందును మనస్సు మెలగినపుడు మనోలోకమునుండి మనస్సవతరించు ప్రయత్నము కనబడును. ఈ రెండుశక్తుల సమవాయము వినా జడము రూపాంతర మొనయజాలదు. అనగా జడమునందు ప్రాణరూపమను నొక క్రొత్త ధర్మము వికాస మొందజాలదు. ఈరీతి ఉత్తరణావ

తరణములకు ఫలముగా జడాధారమున ప్రాణప్రకాశమును మనఃప్రకాశమును కలిగెను. మరియు వీనియే ప్రభావమువలన వివర్తలీల అతిమానవత్వమున ముగియగలదు. మనఃప్రాణములు రెండును సుప్తమయి యున్నవిగనుకనే వానికి క్రమజాగరణము సంభవించెను. కానినాడు అచేతనమగు జడమునం దెటు లీ రెండును ఆవిర్భవించెను? స్థితిశీలమగు జడమున క్రియాశీలమగు ప్రాణ మెటులు వికసించును? ప్రాణము జడమును గూడ తనతోపాటు ఎటులు తీసికొనిపోవును? కావున ఈ వివర్తద్వారమున క్రమాభివ్యక్తి కాక తప్పదు.

ఈ మనోమయమానవుని నిమ్న ప్రకృతి యెటులు రూపాంతరము నొందునో పరికింతము.

జీవుడు పరమేశ్వరునియే అంశము—'మమైవాంశః'. మరియు నిత్యుడు—'సనాతనః'. కావున జీవుడు వివర్తమునకు వెలుపల.

జీవునకు ప్రతిభువై అన్నప్రాణ మనఃకంచుకాంతరితుడై హృదయమణికోష్ఠమున చైత్యపురుషుడు *Psychic Being* వెలుగొందుచున్నాడు. అంతర్నిగూఢుడగు నీ చైత్త్యపురుషుడే మనలో బ్రహ్మజ్యోతిచే నిత్యదీప్తమును అధూమకమును అగు చేతనాదీపశిఖ. మన బాహ్యప్రకృతి నావరించు దట్టమగు అజ్ఞానమునందును గూడ గంటవలె నది వెలుగుచునే యుండును. బ్రహ్మజాతుడగు నీ జాతవేదుడు అవిద్యాకుహరమును ప్రకాశింపజేయుచు తనయింట వృద్ధి బొందుచు—'వర్ధమానః స్వే దమే' తన శక్తిచే అవిద్యను విద్యగా మార్చివేయుచున్నాడు. మరియు నితడు గుహాహితుడగు సాక్షి, శాస్త, మన అంతర్యామి సోక్రటిస్ *Damon*, భావుకుల అంతర్జ్యోతి లేక అంతర్వాణి. బ్రహ్మమునుండి ఆరని చిత్కణముగా పొడమిన యితడు జన్మమృత్యుక్షయాది వికారములచే అపరామృష్టుడు. ఇతడు జీవుడు కాడుగాని అతనికి ప్రతిభువు. ఇతడు సూక్ష్మమగు అన్నమయ ప్రాణమయ మనోమయ పురుషులకు భర్త, మరియు సాక్షి. వారి పుష్టిని అనుభవమును ఇతడు భుజించును. ఈ మూవురు పురుషులయు స్వరూపమాధారము నడుమ ఆవృతమయియున్నను సమయవిశేషములందు వారి ప్రతిభాసము బయటికి ప్రక్షిప్తమై మన ప్రాకృత జీవభావమును నిర్మించును. వారి సమష్టి బాహ్యవ్యాపారము, స్థితిస్వరూపము మన స్వరూపమని మన మెరుగుదుము. కాని గుహాశయమును అధూమకము నగు జ్యోతియే చైత్త్యపురుషాధారమునం దావిర్భవించి మన జీవసత్త్వమును జన్మమునుండి జన్మాంతరమునకు తీసికొనిపోవును. ఇతడు మరల మరల చినుగుపాతల మార్చి క్రొత్తవలువల దాల్చుచు జన్మమునుండి మృతికి మృతినుండి జన్మమునకు వచ్చుచు బోవుచునుండు పథికుడు. ఈ చైత్త్యపురుషుడు తొలుదొలుత అన్న ప్రాణమనస్సులలో ఆంశికముగ అపరోక్షముగనే పని చేయగలడు. ఏలన ఆత్మస్ఫురణమున కివియే ఉపకరణములు. వీని ఉపచయము తన కావశ్యకము. అన్న ప్రాణ మనస్సుల పూర్ణపరిణామము నపేక్షించి యితడు వాని చెరలో చాలకాల ముండవలసియున్నాడు. ఇంత ఇతని ప్రతీక్ష వ్యర్థము కాదు. ఏలన అవిద్యాగ్రస్తుడగు మానవుని జ్యోతిర్లోకమున కెత్తుటయే అతని వ్రతము. కావున నే అవిద్యాభూమిలోని అనుభవముల అన్నిటియు సారము గొని దానిచే నతడు ప్రకృతిలో నే జ్యోతిఃకంద మొకటి నిర్మించును. పరమపురుషుని దివ్యనిమిత్తములుగా ఎంతవరకు అన్న ప్రాణ మానసముల సకల సాధనములును భాస్వరములు కావో అంతవరకును అనుభవశేష మతని భవిష్యత్ సాధన సంపత్తి కుపాదనమగును. నిగూఢముగా నున్న యీ చైత్త్యపురుషుడే మన స్వధర్మమును యథార్థముగా నెరిగినవాడు. కల్పితమును గతానుగతికమును అగు నీతివాదుల ధర్మబోధకంటెను ఇతడు సత్యతరుడు. ఇతని ఊర్ధ్వప్రేరణము నిగూఢము. ఏలనగా హృచ్ఛయానుడగు నీ పురుషుడే సత్యము, ఋతము, శ్రీ, ప్రేమ మొదలగు దైవసంపదదెసకు మనల నెల్లపుడును ప్రచోదించుచున్నాడు. ఈ చేతనయం దెంతవరకు దివ్యప్రకృత్యేషణ బలపడబోవనో అంతవర కితని సాధనకు విరామ మను మాట యుండదు. ఈ చైత్త్యపురుషుడే మనలో సాధకుడును ఋషియు కవియు. స్వారాజ్యపూర్ణదీప్తిచే వెలుగొందనే యితడు మనలను బ్రహ్మవిద్యదెసకు త్రిప్పి పరమాకాశమున కెత్తి అద్వైతభావనిబిడమగు విశ్వమైత్రియను పరుషవేదితో మన చేతనను పులిమిపైమను.

ఇక ఈ చైత్త్య పురుషభావము తిన్నగా పరిణతము కాక వికృతమును దుర్బలమును ఆయెనేని సాధకుని మానస మోజోదీప్తులతో పయికి కనబడినను

హృదయవాసనా వేగము ప్రబలమై అకుంఠమై దుర్ధర్షమై, ప్రాణశక్తి విజయవంతమై, శరీరసంపద అనుకూలమై, బాహ్యజీవనముగూడ ఐశ్వర్యమండితమై, కనబడినను ఆధారమునందలి సూక్ష్మతరాంశములు వికసింపనయిన వికసింపకుండును. వాని సామర్థ్యమయినను కుంఠితమగును. అదియే అపుడు కామపురుషుడు చైత్త్యపురుషుని వేసము వేసికొని చేయు తాండవము. అపుడతని యింగితమును అభీప్సను భావములను ఆదర్శములను, ఆకూతిని కామనను జూచి 'ఇది, అంతరపురుషుని నిర్దేశ—*Psychic suggestion*' 1 మనియు 'అధ్యాత్మ జీవసంపద' యనియు మనము భ్రమింతుము. గుహాతుడగు చైత్త్యపురుషుడు జీవనమునకు పురోధయై కామపురుషుని జయించి అన్నప్రాణమనః కంచుకముల వెనుకనుండి ఆధారములో కొంత భాగమును గాక నిండార ఏలుకొనునేని, అతని చల్లని యేలుబడి వెలుగుచే జీవనమును అభీప్సయు ఆకూతియు ఆదర్శమును, సత్యఋతశ్రీల చిన్మయవిగ్రహములుగా మూర్తములై తత్ఫలముగా స్వభావమంతయు పరమపురుషార్థము కేసి దివ్యజీవన మహోవిప్లవము కేసి తిరుగును.

జీవనమునకు సాక్షాన్నియంతృరూపముగా చైత్త్యపురుషుని మన ఆత్మయందు మనము నిలువబెట్టుకొనగలుగుచో చరితార్థులమగుదుమనియు దివ్యజ్యోతిర్ద్వారమపావృతమగుననియు తోపవచ్చును. ఇంతియ కాక 'బ్రాహ్మీస్థితికి' లేక పూర్ణసిద్ధికి ఋతచిత్తు నుండి *truth-Consciousness* నుండిగాని అతిమానసోత్తర లోకమునుండిగాని శక్తిపాతముతో ఇంచుకయు పనిలేదని తోపవచ్చును. జీవనము పరిపూర్ణముగా రూపాంతరము చెందుటకు తైజసరూపాంతరము — *Psychic transformation*—తప్పనిసరి యయినను సర్వోత్తరమగు చిన్మయపరిణామమునకిదియు చాలదు. చైత్త్యపురుషుడు ప్రకృతియందున్న వ్యష్టిపురుషుడు కావున నిగూఢమైన దివ్యభూమికల ననావృతముల చేసి వాని జ్యోతిని శక్తిని అనుభవమును మనకు కలుగజేయుగలడు కాని విశ్వాత్మకమును విశ్వాతీతమునగు పరమాత్మమహిమను సంపూర్ణముగా ప్రతిష్ఠించుటకు ఉత్తరలోకమునుండి శక్తిపాతము కావలయును. చైత్యపురుషుడొకానొక స్థితిలో సత్యమును శివమును సుందరమును అను లోకమును కల్పించుకొని దానియందే నివసించు తృప్తిగొనవచ్చును. లేదా కొంచెము ముందులకేగి విశ్వాత్మకు—*World-self*—వశుడై విశ్వసత్తా చేతనా వీర్యానందములకు స్వామిగాని భాగస్వామిగాని కాకున్నను అద్దమువలె గ్రహింప సమర్థుడు కావచ్చును నిబిడమగు విశ్వచేతనా—*Cosmic Consciousness*—వేశముచే పులకితుడై మనోహృదయములందే కాక, యింద్రియములందు గూడ తదావేశోన్మాదము ననుభవించియు వివశుడై దానిని ధరింపవచ్చునుగాని బాహ్యజగత్తునందు దానిని సంచారిత మొనరింపజాలడు. మరియు విశ్వోత్తరభూమిలో స్థాణువుగా నిలిచి జగతికి వేరై వ్యష్టిత్వము వదలి మరల అనాది మూలస్వరూపమును చేరుకొనవచ్చును. అంతియకాని తా నిచటి కెందులకు వచ్చునో ఆ పని చేయు సంకల్పముగాని శక్తిగాని అనగా మన ప్రకృతిని దివ్యమును సార్థకమును చేయగల సంకల్పముగాని శక్తిగాని అతని కుండదు. ఏలయన బ్రహ్మమునుండి ప్రకృతిలో ఈ 'చైత్త్యపురుషునావిర్భూతి'. కాన ప్రకృతినుండి నిస్తరంగమగు అక్షరపురుషుని నిశ్చలతలోని కితడు క్రమ్మరవచ్చును. చైత్త్యపురుషుడు దివ్యపురుషునియే సనాతనమగు అంశము. కావున అంశమయ్యు నితడు బాహ్యరూపమున దక్క, బాహిరమును భేదకమునగు ఆత్మానుభూతిని దక్క, అంశితో అవినాభూతుడు. కావున స్వరూపసత్తానుభూతిచే అతని చేతన శోభితము కావచ్చును. మరియు నతడవిద్యాతమః పుంజమునందొక జ్యోతిఃకందమయ్యు దాన జేసియే 'అంగుష్ఠమాత్రః పురుషః 2' అని వర్ణితుడగు నితడు అధ్యాత్మకాఽఽపూరణముచే—*Spiritual influx*—తన్ను విరియించుకొని మనోహృదయాభివ్యాప్తిచే ఐక్యమొంది విశ్వమును కౌగిటబట్టవచ్చును.

మరియు నిత్యసహచరుని సంధానమెనసి సంతతసాన్నిధ్యమును కోరవచ్చును. అధ్యాత్మానుభవములన్నిటిలో సౌందర్యానందములచే గాఢతరము భావ

1 ఐతరేయమునకు ప్రతిధ్వనియగు భాగవత తృతీయస్కంధమునందలి కపిల దేవహూతి సంవాదములోని సృష్టిప్రకరణమున చైత్యపురుషుడు క్షేత్రజ్ఞుడు. యోగవాసిష్ఠమునందలి ఉత్పత్తి ప్రకరణము. ౬౬ మొ. సర్గలందలి చైత్యపురుషునకు ఆదిజీవుడు ఇత్యాదిగా అర్థము. అచటి చైత్యపదమునకు దృశ్యసమూహము, అనుభవవిషయము చిత్తవృత్తి ఇత్యాదిగా చిత్తభవత్వమను వ్యుత్పత్తితో వ్యాఖ్యాతల అర్థము చెప్పిరి. అరవిందులు *psychic Being* అను పదమునకు చైత్యపురుషుడని వాడిరి. ఈ చైత్యపురుషుడు చిత్త ప్రాణ దేహములకు నాభి. మఱియు వానికి వెనుకనుండువాడు. చిత్తము బాహ్యము. ఇంకను విశేషమునకు *Life Divine Vol I. Ch 23. Letters of Sri Aurobindo to Disciples* చూ.

2 శ్రీ శంకరాదుల అభిప్రాయమునకు కఠము నారాయణము మొ. చూచునది.

కాంతి పొంది పరమప్రియునికి పరమప్రియకృతియై ప్రేమోత్తరమగు మాధురిలో మునిగిపోవచ్చును. ఈ రీతిగా మన ఆధ్యాత్మిక జిజ్ఞాసలకు ఫలముగా పలు సిద్ధులు పలుతెగలుగా జరగవచ్చును. కాని మన కిదియే అగ్రభూమికాదు.

ఇవి అన్నియు ఆధ్యాత్మికమగు మనోభూమిక లోనే కలుగు సిద్ధులు. ఇది ఉన్మనీస్థితియైనను నిజ సంస్కారము తుడిచిపెట్టుకొనిపోదు. భేదబుద్ధి యింకను ఉండును. కావున శాశ్వతమగు సన్మాత్రమే సత్యమని దాని నిశ్చయము. అతీంద్రియమగు అనుభవ రాజ్యమునందును పర్యాయక్రమమున బ్రహ్మమున అచాంచల్యము, శక్తిచాంచల్యము నిర్గుణత్వము సగుణత్వము, సత్తసంభూతి, పురుషత్వము అపురుషవిధత్వము, మొదలగు ద్వైతసంస్కారము నది సృష్టించుకొనును. ఈ విరోధాభాసమునందలి విరోధములలో ఒక కోటిని ప్రత్యాఖ్యానముచేసి మరియొక కోటిని సత్యమని నమ్మ తానందు మునిగిపోవును. కాని అవలి ఒడ్డున అతి మానసమును సర్వోత్తరము నగు ఋతచిదనుభవ మొకటి ఉన్నది. అచట ఈ ద్వంద్వము లన్నియు సమసిపోవును. అటనుండి శక్తి నీ యాధారమునకు తేవలసియుండును.

అవిద్యాప్రపంచములో ప్రకృతి తన మనోమయ ప్రవృత్తుల కంతరాత్మనుగాక తత్ప్రతిభువగు అహంతను అత్కముగా కల్పించుకొనును. దీనిని కేంద్రముగా జేసికొనియే మనము ద్వంద్వవిరోధములచే అసంగతిచే సంకులమగు జగన్మధ్యమునందును మాత్రాస్పర్శల మధ్యమునందును విచిత్రములగు అనుభవములయు సంబంధములయు విరోధములయు వ్యూహమును నిర్మించుకొందుము. మనము ఈ అహంతాదుర్గమును అడ్డముగా పెట్టుకొనియే విశ్వాఘాతమునుండియు అనంతాఘాతమునుండియు మనలను రక్షించుకొనుచున్నాము. చిన్మయ రూపాంతరముచే ఈ దుర్గము కూలుచో సాధకుని అహము తుడిచినటులు పోయి ఒకానొక నిర్విశేషానుభవ సముద్రమునందీ ఉప్పుబొమ్మ కరగిపోవును. ఆస్థితిలో ఆ సాధకుని వృత్తులకును వ్యాపారములకును ఒక పద్ధతి ఉండదు. దానచేసి అతడు లోపల చిన్మయుడే కాని బయటికి ప్రాకృతుడు. అతని ప్రత్యక్చేతన అచలప్రతిష్ఠమయ్యు పరాక్చేతన సంస్కారాంధము—'అవశః ప్రకృతేర్వశాత్'. దీనవలననే విక్షిన్నకోటికి చెందిన సాధకులను మనము చూతుము. ఇట్టి సాధకులు జడమువలె బాలురవలె ఉన్మత్తులవలె పిశాచులవలె తిరుగువారు కలరు. ప్రారబ్ధమెపుడు క్షయమగునా యని వారు సాక్షిమాత్రులుగా సంస్కారములను చూచుచుందురు. చిన్మయస్థితికిని మనశ్చలనమునకు ఏకశ్రుతి యింకను పొసగలేదు గాన దివ్యానుభవబలము వారి మనస్సును ఊపివైచినను అంతరానుభవమంతయు వికసింపదు. ఆ స్థితిలో సాధకుడు అయోగ్యులగు మంత్రులచే నడిపింబడు మహారాజు. ఏలనగా అతని అజ్ఞాన ప్రపంచమునుబట్టి అతని ఆంతరవిజ్ఞానమునకు విలువ కట్టవలసియుండును. అతి మానసభూమియందలి ఋతంభరప్రజ్ఞా సత్యసంకల్పముల సామరస్య మాధారమునందవతరించినగాని అంతర బాహ్యముల చిత్ స్వరూప పరమసామ్య మేర్పడదు. ఏలనగా అజ్ఞానమును విజ్ఞానమునుగా మార్పగలశక్తి అతి మానస మొకదానికే కలదు.

మనఃప్రాణముల ప్రాకృతసత్త స్వరూపసత్తతో కలియుచో వానికి పరమాస్వాయనము. అటువలె చైత్య పురుషునకును పరమబ్రహ్మమునందు నిహితమగు తన స్వరూపసత్యముతో ఐక్యము కలుగుచో పరమాభ్యుదయము. ఉభయక్షేత్రములందును అతి మానసశక్తియే దూతి. సంపూర్ణసామరస్యము నదియే తాదాత్మ్యసంగమమున పర్యవసన్నము చేయగలదు. ఏలన అతి మానసశక్తియే అద్వయసత్తాపరావర కోటులను కలుపు వంతెన—'అమృతస్యసేతుః' అతి మానసమునందే అఖండమగు ద్యులోకద్యుతియు సర్వార్థ సాధకమగు మహాశక్తియు అపావృత ద్వారమగు మహానందమును కలవు. ఈ ద్యుతిశక్తులచే సముద్ధృతు డయియే చైత్యపురుషుడు మనఃప్రాణశరీరములను సుఖదుఃఖాది ద్వంద్వములనుండి దాటించి భయజుగుప్సాదులనుండి తప్పించి మర్త్యమునందలి మాత్రాస్పర్శలను బ్రహ్మానందముగా మార్చి తానెటనుండి వచ్చెనో అట—మూల సత్తానందమునం దైక్యము చెందగలడు.

జడమునుండి మానవస్తర వివర్తమున కెవనికినే ప్రయత్నము నక్కరలేకపోయెను. కానరాని ఒక శక్తిప్రభావముచేతనే అది నెరవేరెను. కాని యిక మానవు డతి మానవత్వము వడయుటకు మాత్రము తానే ప్రయత్నము చేయవలెను. అతడు తన అజ్ఞాన కవచమును భేదించుకొనవలెను, తన స్వరూపమేదో తానే కనుగొనవలెను.

విరక్తి చెందినంతనే మాయామయమగు నీ సంసారమును పరిత్యజించి శ్రవణాదు లొనరించి తురీయబ్రహ్మమున కలిసిపోవుటయే పలువుర సాధనకు మూలోద్దేశము. జడప్రకృతినుండి తప్పించుకొంపోవుటయు పై సాధనకొక కారణము. కాని జడాశ్రయమున చైతన్యవికాసమును, పరిచ్ఛిన్నములో అపరిచ్ఛిన్న పూర్ణవిస్ఫూర్తియు, సృష్టియుద్దేశమగు నెడల మనోమయమానవు డతిమానవు డయితీరవలెను.

(పరిశిష్టము]

# సింహళం - ఆంధ్రసంస్కృతి



శ్రీ అడివి బాపిరాజు

## ప్రస్తావన

ఉముఖ్య మదరాసు ప్రభుత్వమువారి కోరికపైన ప్రభుత్వంవారి మదరాసు మ్యూజియంకు సింహళంలో క్రీ. శ. అయిదవ శతాబ్దంలో రాజ్యంచేసిన, కశ్యపమహారాజు రాజధానీ దుర్గమైన సింహగిరి పర్వతంపైన, గుహలో ఉన్న చరియలో ఉన్నకుడ్య చిత్రాలకు ప్రతిరూపాలు తీయడానికి సింహళయాత్రచేసి, ఆ ప్రతిరూపాలు తీసికొనివచ్చి మ్యూజియంకు ఇచ్చిఉన్నాను. నాకుసహాయార్థంగా యువకులైన నలుగురు చిత్రకారులను కూడా తీసికొనివెళ్లినాను. వారు కోడూరు రామమూర్తి, రాంభొట్ల కృష్ణమూర్తి, పిలకా నరసింహమూర్తి, కె. శ్రీనివాసులుగార్లు. మేమంతా ఈ యాత్ర ఎంతో ఆనందముగా కొనసాగించాము.

సింహళంలో బౌద్ధులు ఎక్కువ, తర్వాత సంఖ్య హిందువులు, ఆవెనుక క్రైస్తవులు ముస్లింలూ! ఎక్కడతిరిగినా ప్రాచీనమైన స్తూపాలు, సంఘారామాలు, దేవాలయాలు, శిథిలాలై పడిఉన్నాయి. చిత్రలేఖనాలు శిల్పాలు, భవనాలు తమతొల్లింటి సౌందర్యరూపాలను దిఙ్మాత్రంగా సూచిస్తూ దేశం అంతానిండి ఉన్నాయి. చాలా పురాతన నగరాలు, స్తూపాలు విహారాలు, సంఘారామాలపై గాటమైన అరణ్యాలు అలుముకు పోయినాయి. ఈ నాడు సింహళ ప్రభుత్వవారి ప్రాచ్య పరిశోధకశాఖవారు ఈ శిథిలాలను జాగ్రత్తగా పైకితీస్తున్నారు. డాక్టరు పరణవితానంగారు ప్రజ్ఞావంతులు శేముషీసంపన్నులు, కళాసంస్కారులు, రసజ్ఞులు. వారు ఆ ప్రాచ్యపరిశోధక శాఖకు ముఖ్యోద్యోగులు. వారు మాయాత్ర నిర్విఘ్నంగాకొనసాగడానికిసర్వవిధాలాసహాయంచేశారు. మన ఆంధ్రులకన్న వారికి మన ఆంధ్రచరిత్ర ఎక్కువగా తెలుసును. ఆయన ఉద్దేశంలో ఆంధ్రదేశానికీ సింహళానికీ సాంస్కృతిక సంబంధమైన బాంధవ్యం అతిగాఢంగా ఉండేదని. ఆదేశం అంతా తిరుగుతూ ప్రాచీనకట్టడాలు, గుహలు, శిల్పాలు, చిత్రలేఖనాలు పరిశీలిస్తూఉంటే, ప్రథమంనుండీ అనేక శతాబ్దలపాటు ఆంధ్రులు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో, తమ శిష్యులైన సింహళులద్వారానో తమ సంస్కృతికి అక్కడవాకలు కట్టించినారని స్పష్టంగా కనబడింది.

## ౧. దేశాలు

అశోక చక్రవర్తి కాలానికిముందే ఆంధ్రులలో చాలామంది బౌద్ధదీక్ష తీసుకున్నారు. స్తూపాలు ఆంధ్రదేశంలో ఆ ప్రథమ దినాల్లోనే వెలిసినవి. బుద్ధదేవుడు తన ఎనభైసంవత్సరాల జీవితంలో రెండు మూడుసారులు ఆంధ్రదేశంవచ్చి బౌద్ధధర్మం నెలకొల్పి సంఘారామాలు ఏర్పరచినట్లు కనబడుతున్నది.

ఆంధ్రదేశానికి క్రీ. పూ. వేయిసంవత్సరాలకు పూర్వమే ఆంధ్రులు వలసవచ్చి రాజ్యాలు స్థాపించినట్లు, సింహళులు క్రీ. పూ. వేయిసంవత్సరాలనాడో (అయిదారు వందలసంవత్సరాలకు పూర్వమే అయి ఉంటుంది) సింహళానికి వలసవెళ్లినారు. వీరికీ వారికీ గాథలలో సింహసంబంధం ఉంది. వీరికీ వారికీ సింహపతాకమే! శాతుడనే గంధర్వుడు సింహమై మొదటి శాతవాహనని పెంచినాడు కాబట్టి వీరుశాతవాహనులు. సింహపతాకులు కాబట్టి వారు సింహళులు.

కథలంటే ఆంధ్రులు ప్రాణం అర్పిస్తారు. ఆంధ్రమహాకవి గుణాఢ్యుడు సేకరించి వ్రాసినగాథల సంపుటి బృహత్కథ. ఆ బృహత్కథలో ఆంధ్రులు సింహళ రాజధానితో బాగావర్తక సంబంధాలు

కలిగి ఉన్నట్లు స్పష్టమౌతున్నది. తామ్రపర్ణిరేవులో ఆంధ్రుల ఓడలు దిగేవట. సింహళంనుండి దాల్చిన, కొబ్బరి, లవంగాలు, కర్పూరము, లక్క, మిరియాలు, పచ్చలురత్నాలు దిగుమతిచేస్తేఆంధ్రులుబంగారము, రంగులు, పోకలు, యాలకులు, లోహసామానులు, వస్త్రాలు శిల్పసామానులు సింహళానికి ఎగుమతి చేసేవారు.

సింహళరాజుల వంశచరిత్రలు వర్ణించేగ్రంధాలు, మహావంశ, దీపవంశ, చూళవంశ అనేగ్రంథాలు. వానిలో ఆంధ్రులరాజులతో సింహళరాజులకున్న స్నేహ బాంధవ్యాలు వర్ణించారు.

## ౨ స్తూపాలు

ఆంధ్రులూ సింహళులూ బౌద్ధులు వారిదేశంలో వారిద్వీపంలో స్థవిరవాదమే ఎక్కువ ప్రాబల్యం వహించింది. ఆతర్వాత ఆంధ్రుడైన శ్రీనాగార్జున బోధి సత్వుడు మహాయానానికి జనకులు. నాగార్జునుడు సింహళంలో కొంతకాలం నివసించినట్లు గాథలున్నాయి. ఆతని మహాయాన విధానం సింహళం నిండింది.

ధాన్యకటకంలోనూ, ఇక్ష్వాకుల రాజధాని నేటి నాగార్జున కొండ అయిన విజయపురిలోనూ, సింహళుల సంఘారామాలున్నట్లు శాసనాలు ప్రత్యక్షం చేస్తున్నవి. సింహళ ప్రాచీన స్తూపాలూ, ఆంధ్రుల స్తూపాలూ ఒకేరూపంలో ఉన్నాయి. పవిత్రమైన బుద్ధుని దంత ధాతువు ఆంధ్రదేశాన్నుండే సింహళం వెళ్లింది. మరీ ప్రాచీన స్తూపాలకు ఆంధ్రస్థూపాలకు ప్రత్యేకమైన ఆయక స్తంభాలు ఉన్నట్లు పరిశోధకులంటున్నారు.

ఆంధ్రస్థూపాలకు చుట్టూన్న శిలాప్రాకారపు రాతికంచెలు సింహళ స్థూపాలకు ఉన్నా, ఆంధ్రస్థూపాలకు ఉన్న రాతికంచె సంపూర్ణశిల్పయుక్తము, సింహళపు కంచెపై శిల్పంలేనేలేదనవచ్చు.

అయినా ప్రదక్షిణ ప్రాకారాలూ, వేదికలూ, సూచీస్థంభాలూ, రెండుదేశాలలోనూ ఒకేవిధంగా ఉన్నవి.

## 3 శిల్పం

సింహళదేశంలో ప్రాచీన శిల్పం జాగ్రత్తగా గమనిస్తే, సింహళ మహారాజులు అప్పటికే జగత్ప్రసిద్ధివహించిన ఆంధ్రశిల్పులను సింహళం తీసుకొనివెళ్లి ఉంటారని అనుకోనడం సత్యదూరం కాదు. పల్లవ భోగంలో (పల్నాడులో) దొరికే పాలరాయి గంధపు చెక్కపై శిల్పం మలచినట్లు, విన్యసించడానికి అనువైన మెత్తనిరాయి. అలాంటిరాయి సింహళంలో దొరకలేదు. ఆంధ్రదేశంనుండి ఆరాయిని కొనిపోవడం కష్టం. కాబట్టి ఆంధ్రదేశాన్నుండి వెళ్లిన శిల్పులు ఆలాంటి రాయిని సింహళంలో వెదికినారు. సింహళ రాజధాని అయిన అనూరాధపురం చుట్టూ నల్లరాయి కావలసినంత ఉంది.



సూచీస్తంభ శిల్పం
నాగదేవుడు (అనూరాధపురం)

అయినా ఆ శిల్పులు దానితో శిల్పం మలచడానికి ఇష్టంలేక పల్నాటిరాయిని పోలిన ఒక విధమైన స్పటికపు రాయిని అనూరాధ పురానికి కొద్దిమైళ్ల దూరంలో కనిపెట్టి ఆరాతిని విరివిగా వారి శిల్పానికి ఉపయోగించినారు.

అనూరాధపురం ప్రాచీన స్థూపాలకు అలంకరించిన నాగులశిల్పాలు, సూచీ స్తంభాలు బుద్ధవిగ్రహాలు పద్మశిలలూ, అన్నీ ఆ రీతితోనే విన్యసించారా శిల్పులు.

అనురాధపురంలో దర్శనమిచ్చే ప్రాచీన బుద్ధ విగ్రహాలన్నీ ధాన్యకటకాది ఆంధ్రబౌద్ధ శిల్ప క్షేత్రాలలో దొరికే బుద్ధవిగ్రహాలకు ప్రతిరూపాలు.

భరతదేశంలో బారహుత, మథుర, గయ, సారనాద, నలందాది క్షేత్రాలలో ప్రత్యక్షమయ్యే బుద్ధరూపాలు వేరు, ఆంధ్రదేశంలో బుద్ధరూపాలు వేరు. నిలుచునివున్న భిక్షుమూర్తి విగ్రహాలు, పద్మాసనస్థులైన ధ్యానబుద్ధమూర్తి విగ్రహాలు అమరావతి శిల్పులో, వారి శిష్యులైన సింహళులలో విన్యసించారు.

మిహింతల పర్వతంలో, "కిరిబవపవు" అనేగిరి బంధ చైత్యంలో పనిచేసినవారు ఆంధ్రశిల్పులో వారిశిష్యులో అయి ఉంటారని డాక్టరు పరన వితానగారి మాటలవల్ల స్పష్టమౌతున్నది. ఇక్కడి శిల్పాలు ముఖ్యంగా అలంకార రూపమైనవి. వాని విన్యాసపై ఖరి భావం చూస్తే సాంచీస్థూపద్వారగోపుర శిల్పాలను తలంపుకు తెస్తున్నవి."

ఆంధ్రులు నాగపూజావలంబకులు, వారి బౌద్ధ శిల్పంలో నాగమూర్తి విన్యాసం ఎక్కువ. ఆలాంటి నాగ నాగినీ, విగ్రహాలు సింహళశిల్పంలోనూ ఎక్కువ. భంగిమలలో, దేహసౌష్ఠవంలో అలంకారాదులలో వస్త్రవిన్యాసంలో అనూరాధ పురాదులలో ఉన్న ప్రాచీనశిల్పాలు ఆంధ్రశిల్పాలకు ప్రతిరూపాలే.

డా. పరణవితాన గారు "కొన్ని శిల్పాలలో అమరావతి శైలి సంప్రదాయం స్పష్ట మవుతుంది" అన్నారు. సూచీస్తంభ శిల్పం ఆంధ్రులసొత్తు. అది అనూరాధపుర మిహింతల స్థూపాలకడ ప్రత్యక్షమౌతుంది. ఇతరచోట్ల కనబడదు అని ప్రాచ్య పరిశోధన శాఖకు చెందిన సేనావరత్న గారు వారి "మిహింతల" అనే గ్రంథంలో వ్రాసినారు.

ఈ విషయమే "విన్ సెంటు స్మిత్" తమ "దక్షిణ భారతీయ, సింహళ కళ" అనే గ్రంథంలో సింహళ ప్రాచీన శిల్పచిత్ర లేఖనలకు ఆంధ్రశిల్ప చిత్రలేఖనాలను పోల్చి చూపి ఆంధ్రకళకు సింహళ కళాచరిత్రపైన ఉన్న ప్రాభవాన్ని నిరూపించినారు.

పల్లవులు ఆంధ్రులు. శాతవాహనులకు వారు చాలాకాలం సామంతులుగా ఉండి గుంటూరు సీమ కంతేరు రాజధానిగా పరిపాలించారు. ఆంధ్ర ఇక్ష్వాకుల కాలంలో వారు కంచీపురం రాజధానిని చేసుకొని, తాముస్నూ స్వతంత్రులు కావడానికి ప్రయత్నించి ఇక్ష్వాకులరాజ్యం నాశనం చేసి



శిల్పం
మరగుజ్జువాడు (అనూరాధపురం)

నారు. వీరితోబాటు ఇక్ష్వాకులకు సామంతులూ రాజబంధువులూ, అయిన చాళుక్యులు స్కంధనగ్రోలు (కందనోలు లేక నేటి కర్నూలు) రాజధానిగా రాజ్యం చేసేవారు. వీరూ, అటు వైజయంతీపురంలోని చూతకుల శాతవాహనులూ సామ్రాజ్యాలు నిర్మింపయత్నం చేసినారు.

శాతవాహన శిల్ప సంప్రదాయం పల్లవులు కంచీ మహాబలిపుర సీతన్నవాసల మొదలైన ప్రదేశాలలో, చాళుక్యులు బాదామిలో, విష్ణుకుండినులు ఉండవల్లి మొగలురాజ పురగుహలలో, సాలంకాయనులు జీలకర్రగూడెం మొదలైన ప్రదేశాలలో, కళింగాంధ్రులు దంతపురం, శాలిహుండాం, సంఘారా

మాయులలో శక్తివంతంగా ప్రవహింపచేసినారు. ఆపల్లవుల కాలంలోనూ ఆంధ్రశిల్పుల ప్రతిభ సింహళంపైన ప్రజ్ఞతో ప్రవహిస్తూనే ఉన్నది. "స్నానపుష్కరిణులు, ఆపుష్కరిణులకు గంగకు ఉన్న సంబంధమూ, ఆగంగలో విహరించే ఏనుగులను, చూసి వారు భారతీయ పల్లవశిల్పం గమనించి, మహాబలిపురంలోని ఏడురాతి రథాలూ, అన్నటి ఏనుగులు, గంగావతరణాది శిల్పాలూ తలంచుకు తీరుతారు" అని డా. పరణవితాన గారు నుడివినారు. ఇటు మణిస్థూపంలో దాని రథికను చెక్కిన శిల్పం గమనిస్తే పల్లవశిల్పమే ఇది అని తోస్తుంది అని సేనావరత్నంగారు వ్రాసినారు.

పెంప్యచేర విహారంలో దొరికిన ఒక శిల్ప ఖండంలో మాయాదేవి స్వప్నం గంహరించి ఉంది.

ఒక మంచంపైన మాయాదేవి పవ్వళించిఉంది. ఆరూపం సగంవరకే ఉంది. చుట్టూ సేవకు/రాండ్రు వివిధ భంగిమలలో కూర్చుండి నిలుచుండి నిదురపోతున్నారు. ఈశిల్పం నాగార్జున కొండలోని స్థూపాల శిల్పఖండం వలెనే ఉన్నది. రాయి తేడా లేకపోతే ఇక్ష్వాకుల శిల్పమే సింహళం తీసుకొనివచ్చి ఉంటారు అని అనుకోవచ్చును. ఇటేరకపు శిల్పం నాగార్జున మెట్ట స్థూప శిల్పాలలో ఎన్నో ఉన్నాయి. పరిచారికల మోములు అలంకరణ జడలు, సేవకుల రూపాలు అన్నీ ఇక్ష్వాకుల విజయపురం శిల్పంవలెనే ఉన్నాయి. ఆంధ్రశిల్పంలో అర్ధచంద్ర శిలఅని పిలువబడే అర్ధపద్మ శిలాశిల్పం అంత విరివిగానూ సింహళంలోనూ ఉపయోగించినారు.

ఇక్ష్వాకుల శిల్పంలో నాగార్జున దేవుని విగ్రహాలు మూడు నాలుగున్నాయి. ఇవి బుద్ధరూపాలే అని కొందరంటారు. అట్టి విగ్రహం ఒకటి చెక్కుచెదరకుండా సంపూర్ణ శిల్పంగా సింహళంలో సెరువిల్లాసంఘారామంలో దొరికింది.

## ౮ చిత్రలేఖనం

భారతీయ చిత్రలేఖనానికి హిమాలయ శిఖర శృంగం కదా అజంతాగుహా విలసిత కుడ్య చిత్రలేఖనము. క్రీస్తు పూర్వం నాలుగవ శతాబ్దంనుండి ప్రారంభమై, క్రీ. శ. ఆరవశతాబ్దంవరకూ అజంతాలోని ఆంధ్రచిత్రలేఖన చరిత్ర అనన్యమై ప్రవహించి వచ్చింది. అజంతాను పయనమై వచ్చి, ఆంధ్రశిల్పకుల పతుల పొంగాలకడ చిత్రలేఖన మభ్యసించి తమతమ దేశాలకుపోయిఅక్కడ విజృంభింప చేసినారు, కోహార స్థాను, గాంధార, పారశీక, చీనా, సువర్ణద్వీప, మలయ ద్వీప యవద్వీప సింహళద్వీప చిత్రకారులు.



ఆలివిహారం

కుడ్యచిత్రం-మరగుజ్జువాడు

ఆ సింహళ చిత్రకారులు, ఆలుసంఘారామ పొలనారువ, అనూరాధపుర, దంబుల్లా సింహగిరి మొదలైన నగరాల సంఘారామ విహారాదులలో ప్రజ్వలింప చేసినారు. దుత్తుగామను దంబుల్లా కొండపై విహారం నిర్మించినాడుట. అక్కడ నేటికీ చెక్కుచెదరకుండా ప్రాచీన కాలంనాటివీ, మధ్యయుగం నాటివీ, చివరియుగంనాటివీ చిత్రలేఖనాలు ఉన్నవి.

భారతీయ చిత్రకారులు ఉపయోగించినన్ని రంగులు సింహళ చిత్రకారులు ఉపయోగించలేదు. కాని ముఖ్యమైన మూడువర్ణాలూ, నీలి, జేగురు, ఇంగిలీకము - పసుపురంగూ ఉపయోగించినారు. రేఖలలో లాలిత్యమూ, శక్తీ భారతీయ చిత్రకారులకున్నట్లు సింహళ చిత్రకారులలో లేదు. అయినా ఆంధ్ర భారతీయ చిత్రలేఖనంలోని అందాలన్నీ వారి చిత్రలేఖనంలోనూ కనబడతాయి.

కశ్యపరాజు తండ్రి ధాతుసేనను చంపించినాడు. సోదరుడు అయిన మొగ్గలాయనుడు కశ్యపు

నకు భయపడి భరతదేశం పారిపోయినాడు. అనూరాధపురం రక్షణ కంత అనువైన నగరం కాదు. కాబట్టి కశ్యప మహారాజు అడవుల కొండల మధ్యకుపోయి, ప్రకృతి సిద్ధంగా దుర్గమమైన సింహగిరిని తన రాజధానిని చేసుకొని ఆకొండచుట్టూ మహానగరం నిర్మించుకొన్నాడు. తన్ను సార్వభౌమునిగా గణించుకొన్నాడు. సార్వభౌములు అవతారపురుషులు. కాబట్టి తాను కుబేరుని అవతారమన్నాడు. సింహగిరి కైలాసపర్వతము. కైలాసపర్వతంచుట్టూ విద్యాధర, గంధర్వాంగనలు ఆకాశసంచారం చేస్తూ విహరిస్తూ ఉంటారు. ఆరీతిగా తన కొండచరియను గుహాకారంగా చెక్కించి మేఘాలలో విహరిస్తున్నట్లు సుందర స్త్రీరూపాలను చిత్రింప చేసినాడు.

అజంతాలో కుడ్యచిత్రం వేసేందుకు రాతిగోడపైన, అందుకై సిద్ధంచేసిన మన్ను అందుగ, సున్నం, ఆవాల లేపం మొదలైనవి కలిపి నూరిన లేపనము పూసి, అందుపై బొగ్గుతో లేతరంగులతో నే బొమ్మవేసి ఆబొమ్మను తడుపుతూ రంగులు వేసినారు చిత్రకారులు. ఆ విధానమే సిగిరియా చిత్రకారులూ అనుసరించినారు.

సిగిరియాలో ముప్పది పై చిల్లర బొమ్మలవరకు మాత్రమే చిత్రించి ఉన్నారు. నేడువానిలో పదిపన్నెండు బొమ్మలుమాయమైపోయినాయి. ఇప్పుడు పదునేడు, బొమ్మలుఉన్నాయి.

భంగిమాదులలో, హస్తవిన్యాసంలో అజంతా సంప్రదాయానికి సిగిరియా బిడ్డ అని స్పష్టంగా కనబడుతుంది.

అజంతాలో వేలకొలది, చిత్రాలు విన్యసించినట్లు దంబుల్లా విహారంలో చిత్రించినారు.

అజంతాలో మహేంద్రుడు సింహళం ఓడలో వెళ్లి చేరుతున్నట్లు అద్భుతమైన చిత్రలేఖనం ఉన్నది. సంఘమిత్రబోధివృక్షం పట్టుకువెళ్లినచిత్రలేఖనందంబుల్లాలో చిత్రించి ఉన్నారు,

## ముగింపు

నేటికీ సింహళంలో చిత్రలేఖనం అజంతా సంప్రదాయాన్నే అనుసరిస్తున్నది. మేము ఉన్న సిగిరియా ప్రక్క ఒక సంఘారామంలో గ్రామచిత్రకారులు కొందరు పూర్వశక్తితో అజంతా భంగిమాయుక్త బౌద్ధచిత్రాలను చిత్రిస్తూ ఉండడము గమనించినప్పుడు నాకుకలిగిన ఆనందము వర్ణనాతీతము.

తమిళసోదరు లెప్పుడో సింహళం దండెత్తి వెళ్లినారు. ఇతర మతమని అయినా గౌరవం లేకుండా "బౌద్ధస్తూప విహారాదులను నాశనం చేసి యక్షులు ఎత్తుకుపోయినట్లు దోచుకొనేవారు." అని మహా వంశకర్తలు వ్రాసినారు.

చోళులు క్రీ. శ. పదవశతాబ్దంలో అనూరాధపురంనాశనంచేసి పొలనారువాలో రాజ్యంస్థాపించినారు. వారు నిర్మించిన దేవాలయమూ, శిల్పాలూ అచ్చటఉన్నాయి.

మధ్యయుగంలో, చివర సింహళానికి స్కంధపురం రాజధాని. ఆ నగరానికి నేటిపేరు కేండీ. ఆరాజులు దండెత్తివచ్చి పోర్చుగీసువారితో యుద్ధాలు చేసేటప్పుడు తంజపురి ఆంధ్రనాయక రాజులూ, మధుర ఆంధ్రనాయకులూ సహాయంచేసినారు. చివరి సింహళ రాజులు ఇల్లడంవెళ్లిన మధుర ఆంధ్ర నాయకరాజవంశంవారు. వారు తీసుకొనివెళ్లిన, నృత్యశిల్ప, చిత్రలేఖన, సంగీతసంప్రదాయాలు నేటికి అక్కడ ప్రచారంలో ఉన్నాయి.

ఆంధ్రులంటే సింహళంవారికి ఎంతో ప్రేమ. అసలు సింహళులు మర్యాదగలవారు, శాంతి హృదయులు. వారిగ్రామాలు, నగరాలు ఎంత పరిశుభ్రంగా ఉంటాయి! వారి మగవారికట్టు దక్షిణాదివారి కట్టు. ఆడవారు మలయాళ ఆంధ్ర విధానాల కలయిక అయిన ఒక చిత్రవిధానపు కట్టు, జుట్టు, అనుకరిస్తారు.

వారి సింగలీభాష పాలిభాషబిడ్డ. కాని వారి భాషాలిపే, ఆంధ్రలిపి బ్రహ్మలిపి నుండివచ్చినవి కాబట్టి, వారుశిల్పంలో ఆంధ్రులశిష్యులు కావడంవల్లా, ఈ నాడు అచ్చంగా ఆంధ్రభాషాలిపి వంటి లిపినే వారూ వృద్ధిచేసుకొన్నారు.

# సంసారం



శ్రీ మద్దాలి వెంకటేశ్వర్లు

ఈ సంసార నాటకంలో
సతిపతి యనువా రిద్దరు
నవకోమల రూపంతో
పాత్రధారులైనారు
స్వగృహమే ఆ నాటక
ప్రదర్శనాలకు నిలయము
ఆనాటకాన్ని ప్రారంభిస్తే
నూరేండ్లైనా పడుతుంది.
ఈర్ష్యా బుద్ధులు లేకుండా,
నిర్వికార నిరంజనముగా,
ప్రజల కాదర్శకులై
పతిసతి యను వారెల్లరు
తమ పాత్రపోషణను
సక్రమముగా చేయాలి.
దర్శకులంతా స్వగ్రామస్థులు
పరగ్రామస్థులు విదేశస్థులు-
పాత్రపోషణ చెడిపోయిందా
చూడ నైన చూడరు
చప్పట్లను కొడతారు
తగవులు కొందరు పెడతారు
వ్యక్తిత్వం పోయిన వెనుక
సర్వస్వం పోయిందనాలి
ఇకజాగ్రత్తగా నడవాలి

పూర్వ పుణ్య ఫలితంగా
సంతానము కలిగిందా
ఈనాటకమున కొక అంకము
సంపూర్ణమవుతుందీ-
తెరక్రిందకు దిగుతుందీ-
చూపరులప్పుడంటారు
'జాగ్రత్తగా వినవలె
దానికి తగిన విధంగా
పాత్ర పోషణ జరపవలె.'
వేగమె తెర లేస్తుంది
మొదటి కన్న గంభీరంగా,
శ్రావ్యంగా నిరాడంబరంగా,
దేశకాల గతులచూచి
నడువాలీ నడువాలీ...
బిడ్డలు వివాహా వయస్కులైరా?
రెండవరంగం సంపూర్ణం
తెరక్రిందకు జారుతుంది—
అప్పుడు చూపరులను మాటలెల్ల
జాగ్రత్తగా వినాలీ
దానికి తగినవిధంగా నడవాలీ—
వేగమె తెర లేస్తుంది —
పుత్రీ పుత్రులకు
పెండ్లిండ్లు పేరంటాలు

బంధుమిత్ర ప్రజాబృందానికి
సంతోషము కలుగునట్లు
చేయాలి. ఆనంద బాష్పములు
రాల్చాలి. కృతార్థత చెందాలి.
కష్టసుఖాలనుభవించి తీరాలి.
మనుమళ్ళను ముదిమనుమళ్ళను
చూడాలి, సంతోషించాలి.
ఇంతట తెర వ్రాలుతుంది-
మూడవ అంకం ఐపోతుంది
అప్పుడు దర్శకులంతా
పలికేమాటలు
కుటుంబపోషక వర్గము నిలవాలి
వేగమె తెర లేస్తుంది——
ముడతలుబడ్డ శరీరాలతో
తడబడుచుండే మాటలతో
మంచంలో ఉండగా
కొడుకో మనుమడో కోడలో
సంతోషంతో నిను చూడాలి
లేకపోతె యమ బాధ
డొక్కల్లో కాళ్ళుపెట్టి
ఏలాగో బుద్ధిపుట్టి
రామజపము చేస్తుంటే
ఏనాటో ఏపూటో
యముని బారిపడాలి——
అప్పుడు చూపరులంతా
నాటక ఫలితాలను
వెల్లడి చేస్తారు.
కీర్తో, అపకీర్తో, నిలుస్తుంది.
అంతటితో తెరదిగుతుంది——
నాటకమంతా సంపూర్ణం.



# పరమిాయుని వేలుపు



ఇగ్నేజియో సైలోన్

## 5

ఈ నా స్వీయ చరిత్రలో, నా పరిణామ వివృతీకరణం చాలా అసమగ్రంగా ఉందనీ, అందుకని చెప్పటంలో చాలా యాతన కనబడుతూందనీ, నేనూ గ్రహిస్తూనే ఉన్నాను. ఇప్పుడైనా ఈ విషయం ఎత్తానంటే 'కాదని' ప్రతిఘటించటానికి కాదు. కాక ఇవన్నీ పరమ సత్యాలని ప్రామాణిక మొనర్చటానికీ కాదు. నా చెప్పటంలో నిజాయితీ ఉందని మాత్రమే నేను పూచీ పడగలను. ఎంతవరకూ, పైవానిగా, సాక్షీమాత్రునిగా, అనాసక్తునిగా ఆలోచించ గల్గుతూన్నదీ చెప్పలేను.

కాని ఒక విషయంమాత్రం నాకు చాలా ఆశ్చర్యంగా కనిపిస్తుంది. ఎప్పుడో యుగాలనాటిదిలాగా పాతబడిపోయిన, ఆనాటి జీవితం తలుచుకొంటూ వస్తే, నా జీవితంమీద చాలా ప్రభావం కల్పించిన ఘట్టాలు, స్థలాలూమటుకు, ఆనాటి నా సహచరులకు - ఎక్కడైనా ఒకటే అరాలీలగా తప్ప - అసలు జ్ఞాపకమే లేకుండా పోయాయి. అంతేగాకుండా, నాకు, అర్థహీనంగా తోచి, మనసుకు పట్టని విషయాలనేకాలు వాళ్లకు చాలా స్పష్టంగా వివరంగా జ్ఞాపకమున్నాయి. ఆనాటి నా సహచరులంతా, తమకు తెలియకుండానే, 'దాసు' లైపోతూ వచ్చారా? అయితే, ఏ విధి విధాయకంవల్ల, లేక ఏ సుగుణంవల్ల, ఒక యీడు వచ్చేటప్పటికి, మనిషి, 'దాసుడు'గా గాని, 'పితూరీ'దారుడుగా గాని తయారవుతాడు? అన్యాయం, ఇతరులకు జరుగుతున్నా, ఒక్క క్షణమైనా సహించలేని తీవ్రోద్రేకం, కొందరి జనులలో కలగటానికి మూల కారణమేది? ఇతరులకు తిండి లేనప్పుడు పంచభక్ష్య పరమాన్నాలతో భుజించేందుకు నామర్దా వేయటానికి ఆధారం ఎక్కడుంటుంది? లోక నిరసనకన్నకూడా, దారిద్ర్యము, కారావాసము, అపేక్షణీయమైన, ఆ అభిమానానికి మూలశక్తి ఏది?

నాకు తెలియదు. ఎవ్వరికీకూడా తెలియదేమో! ఒకస్థితి వచ్చేటప్పటికి, ఎంత పరిపూర్ణమైన, గాఢమైన, పశ్చాత్తాప ప్రకటనమూ కూడా, వట్టి వాచ్యాలమే అవుతుంది తప్ప, ఏ ప్రశ్నకూ జవాబు కాలేదు.

కొన్నికొన్ని నిర్ణయాలు, ఎంతో నిగూఢాలూ, కొన్నికొన్ని కార్యాచరణలు, ఎంతో అజ్ఞేయాలూ, ఏ కారణమూ కనపడనివిగా ఉంటవి, అన్న విషయం, కొంత, తనను గురించి గాని ఇతరులను గురించి గాని ఆత్మవిచారణ చేసుకొన్న ఎవరికైనా తెలుస్తుంది.

నా తిరుగుబాటులో, రాగద్వేషాలు రెండూ ఐక్యమైపోయిన ఒక విశేషం ఉంది. నాలోని, "ఆగ్రహోద్రేకాలు", అవి అవసరమైన "నైతిక ఆశయాలూ," రెంటికీకూడా కారణభూతమైన పరిస్థితులన్నీ నా జన్మస్థానమైన జిల్లాలో ఉద్భవించినవే. దానికి నైసర్గికాలే; అందుకనే, ఇంత విదేశాలలో ఉండి, ఇంత ప్రపంచం తిరిగినా, నా వ్రాతలన్నీ—వ్రాసినవీ, బహుశా వ్రాయబోయేవీకూడా—ప్రతీదీ, నా పుట్టింటనిలిస్తే చుట్టూ ఏబదిమైళ్ళ కనుమాపు మేరలోని దేశానికే పరిమితమైనవే. తక్కిన అబ్రుజ్జీ రాష్ట్రమంతటిలాగా, ఆ జిల్లాకూ ఐహిక భాగ్యభోగ్యాల చరిత్ర అంటూ లేనే లేదు. దాని నిర్మాణం అంతా మధ్యయుగాలది. క్రైస్తవమతమయము. అక్కడి మహాసౌధాలల్లా, గుళ్ళూ, మఠాలూ, మాత్రమే. ఆ గడ్డను పుట్టి పేరుతెచ్చుకొన్న వాళ్లు శతాబ్దాలతరబడిగా చూచుకొన్నా, యోగిపుంగవులూ, శిల్పకారులూ మాత్రమే! ఈ దేశంలో మానవునికి బ్రతుకు తెరవు ఎప్పుడూ అతికష్టమైన విషయంగానే ఉంటూ వచ్చింది. ఇక్కడ, బాధకు, ప్రకృతి ధర్మాలలో ప్రప్రథమమైనదిగానే స్వీకారం జరి

గింది. అందుకని ఇక్కడ 'సిలువకు' స్వాగతమిచ్చి అమితంగా గౌరవిస్తారు. ఏమాత్రం యువకరక్తపు పొంగులున్నా వాళ్లకు ఆ ముష్మికభక్తియోగమో, లేక ఐహిక విప్లవమో, ఈ రెండే సులభమార్గా లవుతాయి. ఈ భూమిపైనే ఎప్పుడో భగవంతుని స్వర్గరాజ్యాన్ని ఏర్పడగలదన్న మహాద్విశ్వాసము, ధర్మశాసనాలు దయాశాసనాలుగా మారగలవన్న నిరీక్షణ, ఆ హృదయాలలో పౌరాతన్యమే చిరోని, ఎంతటి దుస్సహ బాధామధ్యంలోనైనా, సంశయాత్మల చితా భస్మంలో కప్పడి ఆగిపోకుండా, సజీవకణాలుగానే మిగిలి నిలిచాయి. ఈ విషయం, పరమప్రాధానికమైన ప్రాముఖ్యం గలది. నైరాశ్యం, బాధ, నిస్పృహ, నిస్త్రాణలతో మోడుబారిపోయిన మా దేశం లాంటి దేశానికి, నిజమైన సంపద్విశేషం, మహోద్భూతమైన నిక్షేపం, ఈ విశ్వాసమే. దీని ఉనికి రాజకీయ నాయకులకు తెలియదు. మతాధిపతులకు ఇదంటే భయం. ఒక్క యోగులకుమాత్రమే, దీని ఉనికి, దీని ప్రయోజనమూ, తెలుసు నేమో!

రాజకీయ విప్లవం లేవదీయటానికి, స్వతంత్ర సుశిక్షితసంఘం నిర్మించటానికగల మార్గాలకై తడుములాటలోనే, మేము ఎంతో కష్టపడవలసివచ్చేది. దాదాపు ప్రయత్నమే అసంభవమూ అనిపించేది.

నేను పట్టణానికి కదలి కార్మిక సంఘాలతో ప్రథమ పరిచయంలోకి వచ్చినప్పుడే, ఈ విషయం తెలుసుకొన్నా ననుకొన్నాను.

ఆ తెలియటంలో, దుర్భరమైన లౌకికత్వంలో నుంచి, తప్పించుకొని బయలుపడి, గట్టి నేలకు, ఎగిరి వచ్చి పడినట్లు, ఒక నూతన ఖండాన్ని కనుగొన్నట్లు నాకు అనిపించింది. అయితే చిరస్థాయిగా పాతుకొనిపోయిఉన్న ఒక సాంఘిక వాస్తవికతపై, తిరుగుబాటు చేస్తూ బయలుదేరిన ఉద్రిక్తస్వభావాన్ని, అక్షరం అక్షరం సునియమితమైన రాజకీయ సిద్ధాంతపు శాస్త్రీయవిధాయకాలతో, సమన్వయం చేసికోటం అంత సులభంగాదు.

నేను, కార్మిక విప్లవ పక్షంలో జేరటం, కేవలం ఏదో రాజకీయపక్ష సభ్యునిగా సంతకం పెట్టి జేరటమంతటి స్వల్పవిషయం కాలేదు. ఒక మతం మారిపోవటంగా, పూర్తిగా జీవితాన్ని అందులో అంకితం చేయటంగానే, నాకు అవగతమయింది. ఆ రోజుల్లో సోషలిస్టు అనిగాని కమ్యూనిస్టుఅనిగాని ప్రకటించుకోటం, కేవలం బ్రతుకును గాలికి వదిలేసుకోవటమే! తల్లి, తండ్రి, ఇల్లు, అన్నిటినుండి వేరు పడిపోయి, ఆర్జన లన్నిటికి నీళ్లు వదులుకోవటమే!

బ్రతుకు కష్టం, బాధా, వీటి మాట అల్లా ఉండగా, అటు మానసికంగాఉన్న వ్యథా, ఇంత కేమీ తక్కువగా లేదు.

నా మానసిక ప్రపంచంలో, "మధ్యయుగాలు" తరతరాలుగా జితించిపోయి వేరుతన్నుకొని స్థావరంగా నిలిచిఉన్నాయి. అసలు విప్లవభావాలకు జీవరసం అంతా వాటినుంచే పుంజుకొన్నాను. ఇప్పుడు భూకంపంతో కదలిపోయినట్టు ఆ పురాణభావ సంచయమంతా కూకటి వేళ్లతో కదలాడిపోయింది. ప్రతి విషయం కల్లోలమైపోయి ఉడుకెందుకొని కుతకుతలాడి పోతోంది. అన్నీ సమస్యలే అయిపోయాయి. జీవితం, మృత్యువు, ప్రేమ, పుణ్యం, పాపం, సత్యం, ధర్మం, అన్నిటికీ వాట్లవాట్ల అర్థాలు తారుమారైపోయాయిలేదా పూర్తిగానశించిపోయాయి.

పది మందితో ఉన్నప్పుడు, ఆపదలను, ధైర్యంతో ఎదుర్కొటం తేలికే. కాని వ్యక్తి ఆత్మ శాశ్వతత్వ ఆశావిశ్వాసాలను శాశ్వతంగా వదలుకోవటంలోని నైరాశ్యాన్ని, వేదనను, ఎవరు వర్ణించగలరు! ఈ విషయం నా పార్టీ కామ్రేడులతో ఎత్తితే, ఎక్కిరించి నవుబాట్లపాలుచేసి ఉండేవారు. నాకు వాళ్లుతప్ప వేర స్నేహితులు లేరు. అందుకని ఎవళ్లకీ చెప్పుకోలేక ఏకాకినై, ప్రపంచం అంటేనే దృష్టి మారిపోయి చూడసాగాను. మనుష్యులంటే ఎంత జాలిపడితే తీరుతుంది!

ప్రభుత్వం ఫాసిస్టుల వశమవటంతో, వాళ్ల శాసనాలలో కమ్యూనిస్టుల జీవితం చెప్పరాని కడగండ్ల పాలయిపోయింది. కాని ఈ కష్టపరిస్థితులే కమ్యూనిస్టు రాజకీయ సిద్ధాంతసూత్రాలను మరింత ధాటుగా ఋజువుపరిచి, కమ్యూనిస్టు మనస్తత్వానికి సంపూర్ణంగా సరిపోయిన, ఒక సంస్థా నిర్మాణానికి, అనుకూలమైన వాతావరణం కల్పించాయి. అందుచేత నేనుకూడా, నా స్వదేశంలోనే విదేశీయునిలాగానే, సంచరించటానికే సంవత్సరాల తరబడి తయారు కావలసివచ్చింది. పేరు మార్చేసుకోవాలి. కుటుంబం,

స్నేహితులు వీరందరితో పూర్వబంధాలన్నీ తెగ తెంపులు చేసుకోవాలి. విద్రోహపక్ష సంబంధ మున్నట్టు ఆమాకీ ఏమాత్రమూ తెలియనీయకుండా, బూటకపువృత్తితో జీవితం గడపాలి. పార్టీ యే కుటుంబము. పార్టీ యే పాఠశాల, దేవాలయం, సేనాశిబిరం. పార్టీ వెలుపలి ప్రపంచాన్ని, నిర్మూలంచేసి, పునః నిర్మించుకోవలసిందే!

'వ్యష్టి' వీరులంతా, సమిష్టి సంస్థలో, అభ్యుదయాత్మకంగా విలీనమవటానికి, కారకమైన, ఈ మానసిక యంత్రాంగమే, మిలిటరీకాలేజీ శిక్షణల లోనూ, కొన్ని కొన్ని మతసంస్థలలోనూ, కూడా కన బడుతుంది. దాదాపు ఇదే ఫలితాలనుకూడా పండిస్తుంది. సంఘవిమోచన కృషికయ్యే ఖర్చులు, వ్యక్తి చేసే ప్రతిఒక్క త్యాగమూ, కానుకగా ఆనందంతో స్వీకరింపబడుతుంది. మరొక విషయం. పార్టీలో చేరటంలో ఉన్న అపదలూ, చేయవలసిన త్యాగాలే, పార్టీకీ మాకూ ఉన్న బంధాలను, మరింత దృఢంగా, గాఢంగా బలపర్చాయి తప్ప, అవేవో తప్పనిసరి అభ్యంతరాలనుకొంటూ దాటుకొంటూరావటంమాత్రం గాదని, ఇక్కడ గట్టిగా చెప్పవలసిఉంది. ఒకనాదిరి యువతీయువకులమీద, - విజ్ఞులూ, సుమనస్కులూ, ఉదారస్వభావులూ అయి, బీడైపోయిన బూర్జువా జీవితంలో బాధపడేవారిమీద- కమ్యూనిజంకున్న ప్రభావంలోని కీలకమంతా ఇక్కడే ఉంది. తీవ్ర మనస్కులూ, ఉత్తమస్వభావులూ అయిన ఈ యువక జనాన్ని, విలాస భవనాలూ, భోగ్యభోగాలూ, మొదలైనవాటితో ఆశపెట్టి, కమ్యూనిజంనుంచి మళ్ళించుదామనుకొనేవారు, మానవస్వభావమంటే ప్రాథమిక జ్ఞానమైనా లేకుండా అతి సంకుచిత పాండిత్యంతో బయలుదేరేవారు మాత్రమే!

## 6

"కమ్యూనిస్టు ఇంటర్నేషనల్,"ను మొదటి సారిగా కదలించివేసిన అంతః సంక్షోభాలేవీ నాకు అంతగా మనస్సుకు పట్టకపోవటంలో ఆశ్చర్యమేమీ లేదు.

ఈ సంక్షోభాలన్నీ సంభవించటానికి, మూల కారణం—కొత్తఇంటర్నేషనల్ లో చేరినముఖ్య పక్షాలన్నీ, లెనిన్ నిర్ణయించిన ఇరువైఒక్క సూత్రాలూ లాంఛనప్రాయంగా అంగీకరించినా, చాలామటుకు ఎవరికివారుగా తప్ప ఏకసామరస్యంతో పెరిగివచ్చిన వారు కాకపోవటమే.

అందరికీ సామాన్య గుణాలు రెండు మాత్రమే. సామ్రాజ్యదాహయుద్ధం,తత్ఫలితాలూఅంటే ద్వేషం. 'రెండవ ఇంటర్నేషనల్' సంస్కరణ విధానాల నిరసనలో ఏకాభిప్రాయం; ఈ వివిధపక్షాల మధ్య ఉన్న సామరస్యం ఇంతమాత్రమే. ఇక తక్కిన విషయాలన్నిటిలోనూ, ఏ దేశాని కాదేశం, మంచికిగాని చెడుకుగాని, తన చరిత్రకూ, ప్రగతికీ, ప్రతిబింబంగా ఉండే దృక్పథంతో ఉంటూ, తదనుగుణ్యంగా, ఎవరి అభిప్రాయాలు వారివిగా ఉండేవి. అనేక అంతస్తులలో నిర్మితమైన సంఘస్వరూపమూ, రాజకీయ స్వాతంత్ర్యమూ, అనే భావాలే వినూత్నమైన వాతావరణంలో జన్మించిన రష్యన్ బోల్షివిజంకూ, (యూరప్) పాశ్చాత్యదేశాల; వామ పక్షసోషలిస్టు వర్గాలకూ ఈ కారణంచేతనే, అనేక భేదాభిప్రాయాలుండేవి. అందుచేత కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ చరిత్ర అంతా, అంతఃకలహాల చరిత్ర. ఇంటర్నేషనల్ దర్శకులైన రష్యన్‌వర్గం, తక్కిన సభ్య వర్గాలవారి ప్రతి స్వాతంత్ర్యాభిప్రాయం పట్లా, నిర్లక్ష్యం చూపిస్తూ, కుత్సితాలు పన్నుతూ, దురహంకారంతో ప్రవర్తించిన చరిత్ర. ఈ సోదరవర్గాలన్నీ ఒకరి తర్వాత ఒకరు విధిలేక కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నుండి చీలి బయటికి వచ్చేస్తూ రావలసి వచ్చింది. ఇల్లాంటి వర్గాలలో కొన్ని వర్గాలు; ప్రజాస్వామ్య, పార్లమెంటరీ విధానాలకు సన్నిహితమైన ప్రవాహాలు ((ఫ్రోస్సర్డ్, వంటివారు) చట్టబద్ధ మనస్కులై, ప్రభుత్వాలను హస్తలబ్ధ మొనర్చుకోటానికి వ్యతిరేకులైన వర్గాలు (పాల్ లెవీ); సోవియట్ ప్రజాస్వామ్యం విషయంలో ఆత్మభ్రాంతి కల్గించుకొన్న స్వాతంత్ర్యవాదులు (రోలండ్-హోల్స్టు); కమ్యూనిస్టు పార్టీ, బ్యూరోక్రాటిక్, కచ్చేరీ కర్కోటక విధానానికి, ట్రేడ్‌యూనియనులొంగి ఉండాలంటే ఒప్పుకోక ఎదురు తిరిగిన, ట్రేడ్‌యూనియనిస్టు విప్లవకారులు (పియర్రీమానట్, ఆండ్రీనిన్); ప్రజాస్వామ్య సామ్యవాదంతో,సహాకారాలన్నీ పూర్తిగా తెగతెంపులు చేసుకోటానికి ఇచ్ఛగించని వర్గాలు (బ్రాండియర్, బ్రిన్‌గోల్ఫ్, టూసార్క); ఏవిధమైన

అవకాశ విధానం అవలంబించటానికీ, ససేమిరా ఒప్పుకోని తీవ్రవాద పక్షవర్గాలు (బోర్దిగారత్ ఫిషర్, బోరిస్ సూవరిన్)—ఇల్లా కలగాపులగంగా ఉండేది, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సభ్యత్వము!

ఈ అంతఃసంక్షోభాలన్నీ, నా కార్యరంగానికి బహు దూరస్థాలై ఉండటంవల్ల, నేను ఈ సుడిగుండాల వేటిల్లోనూ చిక్కుపడలేదు. ఇది నేను ప్రజ్ఞకు చెప్పుకోటం లేదు. ప్రజ్ఞావిషయం కానే కాదు. పై పెచ్చు పరిస్థితులను విశదీకరించటంకోసమే, విప్పి చెప్పటంకోసమే, చెప్తున్నాను. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ అంతకంతకూ, అధికార నిరంకుశత్వంతో, కర్కోటకంగా తయారవటం, నాకు చాలా వెగటూ అసహ్యమూ, పుట్టించింది. కాని వెంటనే దానితో తెగతెంపులు చేసుకోకపోవటానికి, కొన్ని ముఖ్య అవాంతర కారణాలున్నాయి. జైళ్లలో ఉన్న కామ్రేడులు, చనిపోయిన కామ్రేడులు, వీరిపట్ల దృఢ బాంధవ్యం; ఇటలీలో ఫాసిస్టు ప్రతికూలమైన మరొక సుసజ్జితమైన సంస్థ లేకపోవటం; కమ్యూనిజంని వదలిన వాళ్లలో, చాలామందిలో శీఘ్రగతిలో గలుగుతున్న, రాజకీయ పతనం (కొన్నిచోట్ల నైతికంగా కూడా)—అన్నిటికన్నా ఎక్కువగా, సోవియట్ ప్రభుత్వంలోనే ఏదో అంతస్సంక్షోభము సంభవించి, పశ్చిమ కార్మిక వర్గాలవల్ల ఇంటర్నేషనల్ బాగుపడవచ్చునన్న భ్రమ - ఇదే ఎక్కువ పని చేసింది.

౧౯౨౧—౨౭ ల మధ్య, ఇటాలియన్ కమ్యూనిస్టు ప్రాతినిధ్య సభ్యునిగా, మాస్కోలో జరిగే, నిర్వాహకవర్గ సంఘ సమావేశాలలో, మీటింగులలో, పాల్గొనేందుకు చాలామాట్లు మాస్కో వెళ్ళాను. రష్యన్ కమ్యూనిస్టుల విషయంలో ఒకటిమాత్రం నాకు విపరీతంగా కనిపించింది. వాళ్లల్లో మామూలు వాళ్లే కాక, అనితరవ్యక్తిత్వ సంపన్నులయిన లెనిన్, ట్రాట్స్కీ వంటి మహా పురుషులు కూడా, తమతో ఏకీభవించని అభిప్రాయాలను చర్చించటంలో ఏమాత్రమూ సమబుద్ధి చూపించలేక పోయేవారు. విభేదాభిప్రాయం ఉన్నా ఎదిరి సచ్ఛీలుడై ఉండవచ్చునన్న భావమే రష్యన్ కమ్యూనిస్టులకు అనూహ్యము. భౌతికవాదులం, హేతువాదులం అని చెప్పుకొనే ఈ పెద్దలు, తమ వాదంలో, బుద్ధిబలం కంటే, నైతికానికిపూర్ణంగా అగ్రస్థానంఇయ్యటంలో. అంతరాత్మ ఎంతటి వికృతిని పొందిఉండాలి..!

దీనితో పోలగల వ్యామోహాన్ని చూడాలంటే 'ఇన్క్విజషన్' నాటికి వెనక్కు తప్పుకొంటూ పోవాలి.

౧౯౨౨ లో నేను మాస్కో నుంచి తిరిగి వచ్చేస్తోంటే అలగ్జాండ్రా కొల్లాంటయ్ నాతో ఇల్లా అంది.

“క్రెమ్లిన్‌లో వెండి చెమిచాలు ఎత్తుకుపోయిన నేరంమీద లెనిన్ నన్ను అరెస్టు చేయించాడని, ఎక్కడైనా పత్రికలలో నువ్వు చదవటం సంభవిస్తే, వ్యావసాయిక, పారిశ్రామిక విధానాలలోని ఏవో స్వల్పవిషయాలమీద నేను లెనిన్‌తో పూర్తిగా ఏకీభవించలేదని అర్థం చేసుకో!” అన్నది.

కొల్లాంటయ్ ఈ వ్యంగ్యధోరణి పశ్చిమ (యూరప్) దేశాల్లో అలవర్చుకొంది. అందుకని పశ్చిమదేశాలనుంచివచ్చిన మాలాంటివాళ్లవద్దమాత్రమే ఈ కులాసాధోరణిలో సంభాషించేది. అయినా అప్పటికి, నూతన ప్రభుత్వం నిర్మించుకొంటున్న ఆ దినాల సంరంభంలోనే, నూతనసంప్రదాయాలు, ఆచారసిద్ధిపొంది సాంస్కృతిక జీవనాన్ని గుప్పిటలో ఇముడ్చుకోకముందుకూడా-మనకి విస్పష్టంగా కనిపించే అనేక స్వల్పవిషయాలలో కూడా రష్యన్ కమ్యూనిస్టుతో ఒక సమాధానానికి రావటం ఎంత కష్టంగా ఉండేది! పాశ్చాత్యులకు, కార్మికులకు గూడా, “స్వేచ్ఛ”అంటే ఉన్న అర్థం విషయంలో, ఏకాభిప్రాయం రాకపోతే మాని—ఒకళ్ళనొకళ్లు అధమం అర్థం చేసుకోటానికైనా ఎంత జటిలమై పోయేది!

ఒకనాడు సోవియట్ ప్రభుత్వ ప్రచురణ శాఖాధికారితో, సోవియట్ రచయితలను, నిరుత్సాహ భయాలలో ముంచెత్తుతున్న ఆ వాతావరణం కల్పించుకొంటూన్నందుకు, దర్శకస్థానంలో ఉన్న ఆమె సిగ్గుపడక తప్పదని వివరిస్తూ గంటలకొద్దీ చర్చించాను. కాని నేను చెప్పే దేమిటో ఆమెకు అర్థం కానే లేదు. ఎన్నో ఉదాహరణ లిచ్చాను.

“స్వేచ్ఛ అంటే, సంశయం వెలిబుచ్చేందుకు అవకాశము; పరిశోధన, ప్రయోగము, చెయ్యగలిగేం

డుకు అవకాశము; ఏ అధికారాన్నైనా - సారస్వత, కళా, వేదాంతిక, మతైక, సాంఘిక, అధికారాల్ని వేనినైనా, చివరకి రాజకీయ అధికారాన్నైనా, కాదని ఎదిర్చి చెప్పగలిగేందుకు అవకాశము" అన్నాను.

ఆ సోవియట్ సాంస్కృతిక శిఖామణి, అదిరిపోయింది. నివ్వెరపాటుతో-"అదేమిటి! అది కేవలం, ప్రతి-విప్లవమే" అని సణిగింది. అని కొంత స్వాస్థ్యం కూడగట్టుకోటానికి - "అయినా, మీ - అల్లాంటి స్వేచ్ఛ - మాకు లేనందుకు మేము చాలా సంతోషిస్తున్నాము. కాకపోతే దానికి బదులు మాకు పిచ్చి ఆసుపత్రులున్నాయి" అన్నది.

ఇక్కడ 'బదులు' అన్నమాటకు అర్థం లేదనీ, "స్వేచ్ఛ", బదుళ్లు, మారకాలు, పెట్టుకొని స్థానం పూరించుకొనేందుకు బేహార వస్తువు కాదనీ, తక్కిన దేశాలలోకూడా పిచ్చి ఆసుపత్రులు నేను చూశానని జవాబు చెప్పాను. ఆవిడ ఫక్కుమని నా మొహం మీద నవ్వేసింది. "ఇవాళ నువ్వు నాతో వేళాకోళాలాడే ఉత్సాహంలో ఉన్నావు" అంటూ పకపక నవ్వింది. ఆవిడ అమాయకత్వం చూసి తెల్లబోయి, మరుమాట లేక ఊరుకున్నాను.

అవి, రష్యన్ యువకలోకం మహోత్సాహంతో నూతన ప్రపంచం సృష్టిస్తున్న తొలివత్సరాలు. పాత ప్రపంచంకన్న, శ్రేష్ఠతరమైన 'మానుషం' గల, ప్రపంచం తయారు కానున్నదనే మనసారా ఆశించాము. ఆ యువకుల ఉత్సాహం చూస్తోంటే, ఆ ఆశ యథార్థమనే దృఢవిశ్వాసం కల్గింది. ఒక్కొక్క ఏడాదీ గడిచిపోయి, రష్యన్ ప్రభుత్వం ఆర్థికస్వాస్థ్యం చిక్కించుకొని, విదేశాల నుంచి యుద్ధ దండయాత్రలు సమసిపోయి, ప్రభుత్వం బలపడుతూ-కాలం గడిచినకొద్దీ, ఈ ఆశ పెట్టిన పరిపూర్ణ ప్రజాస్వామ్యస్వరూపం ఈషణ్మాత్రమూ సిద్ధించకపోగా, పైపెచ్చు, నిరంకుశత్వము, తన దండవిధానాన్ని తీవ్రతర మొనర్చుకొంటూ వచ్చేటప్పటికీ, ఆశలడుగంటిపోయి, అంత కంతకూ చేదు మింగినట్లైపోయింది!

ఒకనాటి సాయంత్రం, నా ముఖ్యస్నేహితుడు, రష్యన్ కమ్యూనిస్టు యువసంఘాధిపతి, లాంజర్ సాట్‌జ్కీ, ౧౯౦౫ లో గాని ౧౯౧౭ లో గాని విప్లవంలో పాల్గొనగలిగేందుకు ఆస్కారం లేకుండా ఆలస్యంగా జన్మించినందుకు, తన విషాదాన్ని, నాతో ఆంతరంగికంగా వెలువర్చుకొన్నాడు.

"ఇప్పుడేం పోయింది, విప్లవాలు ఇంతతో ఆగిపోవుకదా! ప్రపంచంలో, చివరికి రష్యాలోనైనా, విప్లవాల అవసరం ఎప్పటికీ ఉంటూనే ఉంటుంది" అని అతన్ని ఓదార్చాను.

"ఎల్లాంటి విప్లవాలు? వాట్లకోసం ఎంతకాలం వేచి ఉండాలి" అని అడిగాడు.

ఆసమయంలో లెనిన్‌గోరీకి దగ్గరలో 'రెడ్ స్క్వేర్'లో నుల్చుని ఉన్నాము.

లెనిన్‌గోరీ అప్పటి ఇంకా కఱ్ఱలతోనే కట్టబడి ఉంది. బీదరైతులు, వాలిక గుడ్డలు కట్టుకొని, నెమ్మదిగా నడుచుకొంటూ అంతులేని బారులుగా కదులుతూ రోజూ అక్కడ వస్తుండేవారు.

"నీకు లెనిన్ అంటే ప్రేమ ఉందనే అనుకొంటాను. నేనూ లెనిన్‌ను ఎరుగుదును. నాకు బాగా జ్ఞాపకం ఉన్నాడు కూడా. అతని శవాన్ని భద్రపరచి ఇల్లాటి మూఢాచారాన్ని సాగించటం, లెనిన్‌స్మృతిని అగౌరవపరచటమే కాకుండా, విప్లవ కేంద్రమైన మాస్కో పురానికే కళంకం" అని చెప్పి రెండు పెట్రోలు టిన్నులు తెచ్చి ఆ కుటీరాన్ని తగులబెట్టి ఒక "చిన్న విప్లవం" ప్రారంభిద్దామని సూచించాను. నిజానికి, ఆ సలహా అతను తీసుకొంటాడని నే చెప్పలేదు. అధమం నవ్వులాటగా తీసుకొని పకపకా నవ్వేస్తాడనుకొన్నాను.

కాని నా స్నేహితుడి ముఖం పాలిపోయింది. వొళ్లంతా గజగజా వణికిపోతోంది. ఇల్లాంటి భయంకరపు మాటలు, తనతోగాని, అసలు అంతకన్నా ఇతరులతోగాని, ఏమాత్రమూ అనవద్దని, నన్ను బతిమాలాడు. (ఇతడే, పదిఏళ్లతరువాత, జినోవీఫ్‌తో జతగలిపి, కుట్ర నేరంమీద అతన్ని విచారిస్తున్నప్పుడు, తన యింటి ఐదవ అంతస్తునుంచి క్రింద కురికి ఆత్మహత్య చేసుకొన్నాడు.)

రెడ్ స్క్వేర్‌లో, ప్రజలూ, సైన్యాలూ కూడా బ్రహ్మాండమైన 'పారేడ్లు' చేస్తూంటే అనేకమార్లు దగ్గరఉండి చూశాను. కాని మనస్సులో, ఆనాటి ఆ

యువకుని భీతి, ఉద్విగ్నత, ఆ భయకంపంలోనే నామీద ఆప్యాయత, అక్కడి తక్కిన ఏ దృశ్యాలకన్నాకూడా నా మనస్సులో గాఢంగా హత్తుకొనిపోయాయి. బహుశా ఈ స్మృతికి అనాసక్త (*Objective*) దృష్ట్యా ప్రాముఖ్యముండి ఉండవచ్చును.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ చరిత్రను తరుచుకొంటూ రావటం తేలికపనిగాదు. అదీకాక అది పరిపక్వం కాకుండా ఇప్పుడే వ్రాయటం, తప్పకుండా తొందరపడటమే అవుతుంది. 'ఇంటర్నేషనల్'—సమావేశాలలోనూ సభలలోనూ, అంతూపంతూ లేకుండా జరిగిన చర్చల కలగాపులగంలో గింజయేదో పొట్టుయేదో విమర్శిచూడటం ఎల్లా కుదురుతుంది? తెలిసికొందామన్న కుతూహలం ఉన్న విజ్ఞులు అర్థం చేసికొనేందుకు చెప్పవలసిన విషయాలేవి? ఎలుకల విమర్శకు వదిలి గ్రంథ భాండాగారాలలో భద్రపరచవలసిన విషయాలేవి? ఏమో, నాకు తెలియదు. నా జ్ఞాపకానికి అవసరం అని తోచిన విషయాలు కొందరకు బజారీ విషయాలుగా తోచవచ్చు.

ఒకనాడు కార్య నిర్వాహకవర్గ సమావేశంలో చర్చ జరుగుతూంది. అప్పుడే బ్రిటిష్ ట్రేడ్ యూనియన్ల కేంద్రసంఘము, బ్రిటన్‌లోని స్థానిక శాఖలేవీ, కమ్యూనిస్టు నాయకత్వపు అల్పసంఖ్యాకోద్యమాలకు ఏమాత్రం సహకారం చేయగూడదనీ, చేస్తే ట్రేడ్ యూనియన్లనుంచీ బహిష్కరణ తప్పదనీ, శాసించింది. ఈ విషయంపై ఆనాడు ఇంటర్నేషనల్ కార్యవర్గ సమావేశంలో చర్చ జరుగుతూంది (మాస్కోలో). చర్చలో సమస్యకు రెండు పరిష్కారాలు సూచించబడ్డాయి. సమావేశంలోని బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధి, ఈ రెండు పద్ధతుల్లో ఏదీ ఎల్లా అనుకరణయోగ్యం కాదో, రెంటిలోని కష్టనష్టాలేమిటో, ఒకదానివల్ల, అల్పసంఖ్యాకోద్యమం ఎల్లా అసలే వదులుకోవలసి వస్తుందో, కాక మరొకదానివల్ల, అల్పసంఖ్యాకులు ట్రేడ్ యూనియన్లలోనుంచి అసలే బైటికి వచ్చేయవలసి వస్తుందో, అంతా వివరించి చెప్పాడు. దానిమీద రష్యన్ ప్రతినిధి, 'పయాట్నిస్కీ' తనకు కరతలామలకంగా గోచరిస్తున్న ఒక పరిష్కార విధానం సూచించాడు. "ట్రేడ్ యూనియన్ శాఖలు, కేంద్రసంఘ ఆజ్ఞలను పాలిస్తున్నామని బహిరంగంగా ప్రకటించేదీ - తర్వాత రహస్యంగా ఆ ఆజ్ఞను ధిక్కరించేదీ" అంటూ ఇట్టే చిక్కు విడదీసి చెప్పేశాడు. ఇంగ్లీషు కమ్యూనిస్టు అడ్డు తగిలాడు. "అబ్బే! అది అబద్ధం కాదా?" అన్నాడు. హాలు హాలంతా గొల్లుమని నవ్వటం ప్రారంభించారు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యాలయపు కారువాతావరణం, అంతటి కోలాహలపు విరగబాటు నవ్వులను మరెప్పుడూ ఒలక పోసుకొని ఉండలేదేమో! ఆ "హాస్యవచనం" క్షణంలో మాస్కో అంతటా పాకిపోయింది. స్టాలిన్‌కూ, ప్రముఖ ప్రభుత్వ కార్యాలయాలకూ ఈ 'వినోదాన్ని' ఫోన్‌మీద వెంటనే తెలిపారు. అమాయకపు నిజాయితీతో ఇంగ్లీషు ప్రతినిధి చెప్పిన మాటమీద పుట్టిన ఈ వికటాట్టహాస సంతోష సంరంభం, అతని అభ్యంతరంలోని సత్యార్థాన్ని ప్రస్ఫుటం చేసింది. "అబ్బే! అది అబద్ధం కాదా!" అన్న యింగ్లీషు ప్రతినిధి పసితనపు టమాయికపు వాక్యంవల్ల పుట్టిన కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ వికటాట్టహాసపు జెల్లువంతా, అందుకనే, ఈనాటికీ నా స్మృతిలో పాతుకునిపోయి, నాకు ఒకమ్మటిరి జాగ్రతా చిహ్నమై నిలచిపోయింది.

నా మాస్కో ప్రయాణాలు, చాలనాళ్లకొక్కొక్కసారిగా కొద్దిమాట్లు మాత్రమే సంభవించాయి. ఇదివరకు చెప్పినట్లు, ఇటాలియన్ కమ్యూనిస్టు ప్రతినిధి సభ్యునిగా వెళ్లే అవసరాలకు మాత్రమే పరిమితమయి ఉండేవి. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సంస్థా నిర్మాణంలో భాగస్వామిగా నే నెప్పుడూ లేను. కాని దానికి చెందిన కొందరు పరిచితులను పరిశీలించుకొంటూ రావటంవల్ల, ఇంటర్నేషనల్‌లో అంతకంతకూ స్వేచ్ఛగా పెరిగిపోతున్న దుర్నీతిని కనిపెట్టుతూ రాగలిగాను.

ఆ పరిచితులలో అందరికన్నా ముఖ్యంగా ఉదహరించవలసినవాడు, ఫ్రెంచివాడు, జేక్వెస్ డోరియట్. మొదటిసారి ౧౯౨౧లో అతన్ని నేను మాస్కోలో కలుసుకొన్నాను. అప్పటికి అతను, వినయము, శ్రద్ధాభక్తులు, ఉత్సాహమూ, కృషీ, కల యువక కార్మికుడు. అతని నెమ్మదితనాన్నీ, మంచితనాన్నీ, కలిమి

డినీ, మాంచి, అంతకన్న చాలా తెలివైనవాళ్లు, బాగా చదువుకొన్నవాళ్లూ అయినా, అంతటి సాంప్రదాయికులు కానందున—తక్కిన ఫ్రెంచి కమ్యూనిస్టుయువకుల కెవ్వరికీ యియ్యక, అంతర్జాతీయ సంస్థకు ప్రాతినిధ్యం అతనికే యిచ్చారు. అతనూ, చక్కగా, వాళ్లు ఆశించినంతటి ఒద్దికతోనూ నడవసాగాడు. ఒక్కొక్క ఏడాది గడిచినకొద్దీ, అతనికి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో ప్రాముఖ్యం హెచ్చుతూ వచ్చింది. ఏటేటా అతన్ని చూసినప్పుడల్లా అతనిలో అంతకంతకూ మార్పు కలగటం చూస్తూనే వచ్చాను. నైతికంగా అంతకంతకూ దిగజారుతూనే వచ్చాడు. ఏ విశ్వాసమూ లేకుండా, ఏదీ నమ్మకుండా, నీతినియమాలు ఏవీ లేకుండా, మనుష్యులు, ప్రభుత్వం వీటిపై అంతకంతకూ, ఫాసిస్టుదృక్పథం పెంచుకొంటూ మనిషి పూర్తిగా మారిపోయాడు. స్వతహాగా నాకు అతనంటే ఉన్న జుగుప్సాభావాన్ని జయించుకొని, జేక్విస్ డోరియాక్ జీవితచరిత్ర వ్రాయగల్గితే గ్రంథానికి బీజాంకురం—"ఫాసిస్టుగా మారిన వీరకమ్యూనిస్టు" అన్న వాక్యం.

ఒకసారి మాస్కోలో, డోరియట్‌ను కలుసుకొన్నాను. అతను అప్పుడే రాచకీయ రాయబారాలకు చైనా వెళ్ళి తిరిగివచ్చాడు. నాతోపాటు కొందరు మిత్రులకు విందుచేశాడు. అక్కడి గోష్ఠిలో, దూరప్రాచ్యంలో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ చేసిన అవకతవకలన్నీ చాలా బీభత్సంగా వర్ణించాడు. కాని మర్నాడు, కార్యవర్గం నిండుసమావేశంలో, ఇంటిదగ్గిర చెప్పిన ప్రతిమాటకూ విరుద్ధంగా మహోపన్యాసం చేశాడు. సమావేశం అయాక నాకు కన్నుగీటి, "అది అంతా రాజకీయచాణక్యం" అని విపులీకరించాడు. ఇది ఎందుకు చెప్తున్నానంటే, ఇల్లాంటివాడు ఇతనొక్కడే కాదు. అనేకులుండేవారు. తర్వాత, ఫ్రెంచి కమ్యూనిజంలోని అంతరంగికపు మార్పులవల్ల, డోరియట్ కమ్యూనిస్టుఇంటర్నేషనల్‌లోనుంచి బైటికి వచ్చేయవలసివచ్చింది. దానితో మనిషి నికార్సురంగు బైలుపడేందుకు పూర్తి అవకాశం వచ్చింది. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ వ్యక్తులలో పెరుగుతూన్న ఈ కపటవర్తన, అవినీతీ ఉటంకిస్తూ, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఆరవ సమావేశంముందు, ఇటాలియన్ కమ్యూనిస్టు సభ్యుడు ఫాత్క్రైరో టోలియాట్టి ఉపన్యసిస్తూ "వెలుగు, వెలుగు కావాలి", అంటూ గోథకవి అంతిమ వాక్యాలను ప్రయోగించాడు.

ఒక విధంగా, ఆ ఉపన్యాసం టోలియాట్టికి మంగళాచరణమే అయింది. మరో ఏడాది రెండేళ్ల పాటు, తన అంతరాత్మతో పోరాడుతూ, మనసు విప్పిచెప్పటానికీ, కమ్యూనిస్టుగా ఉండటానికీ మధ్య ఉండే పోరాటాన్ని సమాధానపరచ ప్రయత్నిస్తూ గడిపాడు. కాని చివరకు అతనుకూడా చిత్తైపోయి లొంగిపోక తప్పలేదు.

విభిన్నజన సమూహమైనందున, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లోని సహజఅంతర్విభేదాల వల్లనే కాకుండా, సోవియట్ ప్రభుత్వంలోని ప్రతి చిన్న ఇబ్బంది వల్లా, కూడా కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ దెబ్బతింటూనే వచ్చింది. లెనిన్ చనిపోయినతర్వాత, నియంతృరాజ్యాలకు విధాయకమేమో అనిపించే దుస్థితిని సోవియట్ ప్రభుత్వం తప్పించుకోలేకపోయింది. ఆ రాజకీయ తత్వం గోపురంలాగా అంతకంతకూ సంకుచితమైపోతూ వచ్చింది. విరోధపక్షాల నన్నిటినీ అణగద్రొక్కేసి, సోవియట్ అసెంబ్లీలలో ఏ సామాన్య రాజకీయచర్చలకూ ఆస్కారం లేకుండా తప్పించుకొన్న రష్యన్ కమ్యూనిస్టుపార్టీ, చివరికి తనకితానే ఆ గతిని పట్టించుకొంది. పార్టీ సభ్యుల విడి రాజకీయాభిప్రాయాలు అన్నిటినీ పార్టీ యంత్రం తుడిచిపెట్టేసింది. ఆ క్షణంనుంచి, నిర్వాహకవర్గంతో ఏమాత్రం భేదాభిప్రాయం ఉన్నా ఆ అల్పసంఖ్యాకులందరూ నైతికంగా కూడా రూపుమాసిపోవలసి వచ్చింది. శత్రువులను నిర్మూలంచేసిన విప్లవము, తన ముద్దుబిడ్డలనే మింగేయటం మొదలుపెట్టింది. దేవతల రక్తదాహానికి ఇక తీరటమంటూ లేకపోయింది.

## ౨

౧౯౨౭ మేలో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యనిర్వాహకవర్గం అదనపు సభ్యులను చాలామందిని కలుపుకొని అత్యవసర సమావేశమొకటి ఏర్పరిచింది. ఆ సమావేశంలో టోలియాట్టితోపాటు నేనూ పాల్గొన్నాను. అప్పుడు అతను పారిస్‌లో పార్టీ రాజకీయ కార్యదర్శవర్గాన్ని నడుపుతున్నాడు.

నేను ఇటలీలో అజ్ఞాతసంస్థ(*under-ground organisation*)బాధ్యత వహించి పని చేస్తున్నాను. ఇద్దరం బెర్లిన్‌లో కలుసుకొని, మాస్కోకు కలిసి ప్రయాణం చేశాము. అత్యవసర సమావేశం ఏర్పరచటానికి కారణం - 'రానున్న సామ్రాజ్య యుద్ధంలో పోరాట కాలంలో కమ్యూనిస్టుపార్టీ ఎల్లా ప్రవర్తించవలసిందీ చర్చించి నిర్ణయించటానికని ప్రకటితం గా చెప్పారు. అసలు ఉద్దేశం, అప్పటి కింకా అంతర్జాతీయ కార్య నిర్వాహకవర్గంలో సభ్యులైన, ట్రాట్స్కీ, జినో వీవ్ లను రూపుమాపటానికి ప్రయత్నారంభం. సర్వ సమావేశంలో తీరా అభిప్రాయభేదాలు ఏమీ రాకుండా ముందుగానే చర్చించుకునేందుకు, మామూలు పద్ధతిలో ముందునాడే ముఖ్య ప్రాతినిధ్యాల నాయకుల నందరిని "సీనియర్-కాన్వెన్టు" అన్న పేరుతో సమావేశ పరిచారు. ఆసారి నేనుకూడా ఈ సీనియర్ కాన్వెన్టులో తన ప్రక్కన ఉండాలంటూ టోగ్లి యాట్టి బలవంతం చేశాడు. రూలు ప్రకారం అయితే ఇటాలియన్ ప్రాతినిధ్యపక్షాన అక్కడ హాజరయేందుకు అతని కొక్కడికే హక్కుంది. కాని అక్కడ ఏవో అసందర్భాలు రాక తప్పవని ముందే గ్రహించాడో యేమో, రహస్య సంస్థా ప్రతినిధినైన నేను కూడా అక్కడ తనకు అండగా ఉండటం అవసరమని తల పోశాడు.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కేంద్ర కార్యాలయంలో ఒక చిన్న గదిలో సమావేశమయాము. జర్మన్ ప్రతినిధి థాల్మన్ అధ్యక్షత వహించి, రేపటి సర్వసమావేశంలో ట్రాట్స్కీని ఖండిస్తూ ప్రవేశ పెట్టదలచిన, తీర్మానపాఠం చదవటం ప్రారంభించాడు.

ఆ తీర్మానం, చాలా ఘాటైన మాటలతో నిండి ఉంది. రష్యన్ కమ్యూనిస్టుపార్టీ రాజకీయ కార్యాలయాన్ని సంబోధిస్తూ ట్రాట్స్కీ వ్రాసిన ఒక పత్రాన్ని అతితీవ్రంగా ఖండిస్తూ, తీర్మానం నడిచింది. ఆనాడు సీనియర్ కాన్వెన్టులో పాల్గొన్న రష్యన్ ప్రాతినిధ్యం అంతా అసామాన్యమైనది. స్టాలిన్, రికోవ్, బుకరిన్, మనుల్‌స్కీ, మహామహు లంతా ప్రతినిధులు.

తీర్మానం చదవటం ముగియగానే, ఈ తీర్మానం అందరికీ సమ్మతమేనా, అని థాల్మన్ అడి గాడు. ఫిన్నిష్ ప్రతినిధి అట్టోవార్ కూసినినిన్, తీర్మానంలో ఘాటు చాలదనీ, ఇంకా తీవ్రంగా ఖండించాలనీ అన్నాడు. "ట్రాట్స్కీ, రష్యన్ కమ్యూనిస్టుపార్టీకి పంపిన పత్రము పూర్తిగా విప్లవ వ్యతిరేకంగా ఉందనీ, అది వ్రాసినవాడికి, కార్మిక వర్గంతో సామ్యగుణం ఏమాత్రమూ లేకుండాపోయిందనీ తీర్మానంలో బహిరంగంగా ప్రకటించితీరాలి" అని వాదించాడు.

ఇక తక్కినవాళ్లెవరూ మాట్లాడకపోయేటప్పటికి, టోగ్లియాట్టితో సంప్రదించి, నేను లేచాను. సమావేశానికి నేను రావటం కొంత ఆలస్యమైనందుకు క్షమాపణ చెప్పుకొని, అందుచేత ఈ ఖండించే పత్రము ఏదో నేను చూడలేకపోయాననే చెప్పుకొన్నాను.

"నిజం చెప్పాలంటే, ఆ కాగితం ఏదో మేమూ చూడలేదు" అన్నాడు థాల్మన్.

నా చెవులను నేనే నమ్మలేక, మళ్లీ మాట మార్చి అదే అభ్యంతరం చెప్పాను. "ట్రాట్స్కీ వ్రాతను ఖండించి తీరవలసిన అవసరం నిజంగా ఉంటే ఉండవచ్చును. కాని అదేదీ చూడకుండా నేను ఖండించటానికి వీలు లేదుకదా" అని అన్నాను.

"మేమూ చూడలేదు. ఆమాటకొస్తే ఇక్కడున్న వాళ్లల్లో రష్యన్లు తప్ప తక్కిన చాలామంది చూడనే లేదు" అన్నాడు థాల్మన్. థాల్మన్ జర్మన్ భాషలో మాట్లాడాడు. అతని మాటలు స్టాలిన్ కోసం రష్యన్ భాషలోకీ, మాలో మరి ఇద్దరి ముగ్గురి కోసం ఫ్రెంచి భాషలోకీ, అనువదించి చెప్తున్నారు. నాకు చెప్పిన సమాధానం నమ్మలేనట్టుగా ఉండేటప్పటికి, అనువాదకునిమీద విరుచుకొనిపడ్డాను. "థాల్మన్ ఆ మాట అనటం అసంభవం. అతనిమాటలు ఏ ముక్కకాముక్క సరిగ్గా మళ్ళీ చెప్పు" అన్నాను.

ఇక్కడికి వొచ్చేటప్పటికి స్టాలిన్ కలుగజేసుకొన్నాడు. అంతవరకు గదిలో ఒకప్రక్కన నిదానంగా నుల్చుని వింటున్నాడు. ఆ గదిలో ఏ అదురుపాటూ, ఉద్రేకమూ, సంక్షోభమూ లేకుండా శాంతంగా ఉన్నవాడు స్టాలిన్ ఒక్కడే. స్టాలిన్ నెమ్మదిగా చెప్పాడు.

సోవియట్ ప్రభుత్వ రాజ్యాంగవిధానాల ప్రమేయం ఎక్కువగా ఉండబట్టి, ట్రాట్స్కీ

వ్రాసిన పత్రాన్ని అంతర్జాతీయ కార్యనిర్వాహక ప్రతినిధు లందరికీ, ఆయా భాషలలోకి అనువదించి పెట్టటం, క్షేమకరమూ, అవసరమూ కూడా కాదేమో నని పార్టీ రాజకీయ కార్యాలయం భావించింది. (ఆ అభూతపత్రంలోని ఉదంతమంతా, ట్రాట్స్కీయే తర్వాత "చైనీస్ విప్లవ సమస్యలు" అన్న గ్రంథంలో యథాతథంగా చేర్చి, యూరప్‌లో ప్రకటించాడు. అందులో సోవియట్ ప్రభుత్వ విధాన ప్రమేయ మేమీ లేదనీ, చైనాలో, స్టాలినూ, కమ్యూనిస్టు ఇంటర్నేషనలూ, అవలంబించిన విధానా లన్నిటినీ సతార్కికంగా, అతి సూక్ష్మంగా విమర్శించాడనీ, ఈనాటికీ ఆ పుస్తకం చూసినవాళ్ల కెవళ్లకైనా తెలుస్తుంది.)

౧౯౨౭ ఏప్రియల్ ౧౫న మాస్కో సోవియట్ల సమక్షాన్న స్టాలిన్ ఒక ఉపన్యాస మిచ్చాడు. అందులో ఛాంగ్ కై షేక్‌ను ఆకాశానికెత్తి పొగడేశాడు. కూమిన్‌టాంగులో తనకు వ్యక్తిగతంగాగల సంపూర్ణ విశ్వాసాన్ని వెల్లడించాడు. ఈ ఉపన్యాస మిచ్చి వారంరోజులు కాలేదు. ఛాంగ్ కై షేక్ ఒక్క రాత్రిలో నూతనావతారం దాల్చాడు. రాత్రికి రాత్రికి కూమింగ్‌టాంగ్‌లోని కమ్యూనిస్టు సభ్యు లందరినీ నట్లగొట్టేశాడు. షాంఘైలో ఆ రాత్రి వేలకు వేలు కార్మికులను రాక్షసంగా ఊచకోత కోసి నరికించాడు. మరో నెలరోజులకు వుహాన్‌లోనూ ఈ మారణహోమమే సాగించాడు.

అందుచేత ఈ విషయంపై చర్చ జరిపించటానికి స్టాలిన్‌కు ఇష్టంలేక, 'దేశక్షేమం' అన్న ముసుగు క్రింద రక్షణకోసం ప్రయత్నిస్తూఉండిఉండవచ్చును.

'స్టాలిన్ చెప్పిన మాటలు నిన్ను సమాధానపరిచాయా?' అని ఎర్నెస్టు థాల్మన్ నన్ను అడిగాడు.

"రష్యన్ కమ్యూనిస్టుపార్టీ రాజకీయ కార్యాలయంవారికి, ఏ పత్రాన్నైనా రహస్యంగా ఉంచుకొనే హక్కుందన్న విషయాన్ని నేను కాదనటం లేదు. కాని ఆ పత్రంలో ఏముందో తెలియకుండానే ఇతరులుకూడా దాన్ని ఖండించాలనటంలో సబబేమిట్లో నాకు కనబడటంలేదు" అన్నాను.

ఈ మాటతో, నామీదా, ట్రోలియాట్టీమీదా అక్కడున్నవా ళ్లందరికీ మండుకొచ్చింది. వాళ్ల కోపాలు పట్టశక్యం కాకుండా ఉన్నాయి. అందరికన్నా ముందు చెప్పిన ఫిన్నిష్ సభ్యునికీ, బల్గేరియన్ సభ్యునికీ ఒక రిద్దరు హంగరీ సభ్యులకూ మరీ మండుకొచ్చింది.

కూసినెన్ మొగం కందగడ్డ చేసుకొని అరవటం ప్రారంభించాడు. "ప్రపంచ విప్లవపుకోట నడిమధ్యంలోనే, ఇల్లాంటి, 'పెట్టీ—బూర్జువాలు', మనలో ఉన్నారని ఎక్కడా కనీ వినీ ఎరగమే" అని అరిచాడు. "పెట్టీ—బూర్జువా" అన్నమాటను, తిరస్కార, అసహ్యాలు గుమ్మరిస్తూ మహా హాస్యాస్పదంగా ఉచ్చరించాడు.

అక్కడ తొణకకుండా బెణకకుండా నిలచిన మనిషి స్టాలిన్ ఒక్కడే.

"ఏ ఒక్క ప్రతినిధికి సమాధానం లేకపోయినా, ఈ తీర్మానం ప్రవేశపెట్టటం జరుగదు" అన్నాడు స్టాలిన్. అని "బహుశః మన ఇటాలియన్ కామ్రేడులకు, మా అంతరంగిక పరిస్థితులు పరిపూర్ణంగా తెలియవేమో. ఈ సమావేశం రేపటికి వాయిదా వేయాలని నేను సూచిస్తున్నాను. ఈలోపుగా మనవాళ్లల్లో ఒకరు ఈ సాయంత్రం మన యిటాలియన్ కామ్రేడులతో మాట్లాడి, మన పరిస్థితంతా వాళ్లకు విశదీకరించాలని సూచిస్తున్నాను" అన్నాడు. ఈ అరవచాకిరీ పని బల్గేరియన్ సభ్యుడు వాసిల్ కోలరోవ్‌కు అప్పగించారు.

అతను చాలా నేర్పుతో, నయంతో, ఈపనికి తలకొన్నాడు. ఆ సాయంత్రమే టీ తాగటానికి "హోటల్ లక్స్"లోని తన గదికి మమ్మల్ని ఆహ్వానించాడు. పెద్ద ఉపోద్ఘాతం పెట్టకుండానే సూటిగా "కంప" కదిల్చాడు.

"అబ్బాయిలూ, ఉన్నమాట చెప్తున్నగా." అంటూ చిరునవ్వుతో ప్రారంభించాడు. "నేను మాత్రం ఆ కాగితం ఏదో చూశానని మీరనుకొంటున్నారా? నేను అసలే చూడలేదు. ఆమాటకొస్తే, అందులో ఏముందో కూడా తెలుసుకోవాలని నాకు ఏమాత్రమూ కుతూహలంకూడా లేదని చెప్తున్నాను. ఇంకా చెప్పమంటారా? ట్రాట్స్కీయే రహస్యంగా, ఆపత్రం కాపీ నాకు పంపించినా, నేను దాని మొహమైనా చూడను.

మిత్రమా, ఇది మతలబులూ, దస్తావేజుల ప్రశ్న కానేకాదు. ఇటలీలో పరిషత్తుల పురాణ సాంప్రదాయం ఉందని నాకూ తెలుసును. కాని ఇక్కడ మనం పరిషత్తులో లేము. రష్యన్ కేంద్రదర్శకవర్గంలో అధికారానికి కొట్లాడుతున్న రెండు పోటీ పక్షాలమధ్య ఉన్నాం. ఏ పక్షాన మనము ఉండదలచుకొన్నాం? అదీ ప్రశ్న. ఇందులో కాగితాల ప్రమేయం లేదు. చైనీస్ విప్లవ అపజయంలో చారిత్రక సత్యమేదా అన్నది కాదు మనకు కావలసినది. సమాధానమంటూ కుదరని, రెండు విరోధిపక్షాల మధ్య పోరాటాన్ని గురించిన ప్రశ్న ఇది. ఏ పక్షాన్నంటామో తేల్చుకోవలసి ఉంది. నా మటుకు నేను తేల్చేసుకొన్నాను. మైనారిటీ పక్షం ఏమవనీ, ఏం చెయ్యనీ, మెజారిటీ పక్షానికి ప్రతికూలంగా, ఏం కాగితమైనా తయారు చెయ్యనీ, నేను మాత్రం మెజారిటీపక్షాన్నే ఉంటానని మళ్లీ నొక్కి చెపుతున్నాను. నాకు కాగితాలు కరామతులు పట్టవు. ఇదేం, వాదోపవాదాలకు, పరిషత్తు కాదు" అన్నాడు. అని మళ్లీ రెండు కప్పులు టీ, మాకు పోసి, అల్లరి పిల్లకాయలను మంచిమాట చేసుకొని సద్దటానికి కూర్చున్న బడి పంతులులాగా, "ఏం నేను చెప్పింది స్పష్టంగా అర్థమయిందా?" అంటూ ముఖ్యంగా నావంక తిరిగి అడిగాడు.

"ఓ! చాలా స్పష్టంగా అర్థమయింది" అన్నాను.

"మరి మిమ్మల్ని ఒప్పించానా?"

"లేదు"

"అదేమిటి, ఎందుకనీ," అని చెప్పమని అడిగాడు.

"ఫాసిజానికి నే నెందుకు ప్రతికూలుడనో అదంతా మీ కిప్పుడు వివరించాల్సిఉంటుం" దన్నాను.

కోలరోవ్ మహాకోపం వచ్చినట్టు నటించాడు. టోలియాట్టి తన భావం అంతకన్నా సునిశితంగా సౌమ్యంగా అతనికి విప్పి చెప్పాడు. "విషయం చూడకుండానే ముందుగా నేను మెజారిటీ పక్షమనీ, లేక మైనారిటీ పక్షమనీ, ఎవరైనా ప్రకటించుకోటం కుదరదు. సమస్యలోని రాజకీయ స్వభావాన్ని గ్రహించుకోకుండా తోసేయటానికి వలనుపడదు" అన్నాడు.

కోలరోవ్, మమ్మల్ని చూసి, జాలిపడుతూన్న సానుభూతి మందహాసంతో, "మీ రింకా చాలా చిన్నవాళ్లు. రాజకీయాలంటే ఏమిటో మీ కింకా బోధపడలేదు" అని పెద్దరికం చూపిస్తూ, సాగనంపాడు.

మర్నాడు ప్రొద్దున్న, 'సీనియర్ కాన్వెంట్'లో మళ్ళీ నిన్నటి నాటకమే ప్రదర్శితమయ్యింది. ఆ చిన్నగదిలో జనమందిదాకా క్రిక్కిరిసిఉన్నాం. ఎవరికి వారు నరాలు బిగబట్టుకొని కూర్చున్నట్టుగా కలత చెందిఉంది వాతావరణం.

"పరిస్థితి అంతా మన ఇటాలియన్ కామ్రేడులకు చెప్పారా" అని స్టాలిన్ కోలరోవ్‌ను అడిగాడు. "క్షుణ్ణంగా చెప్పాను" అన్నాడు కోలరోవ్.

"ఏ ఒక్క ప్రతినిధి ఒప్పుకోకపోయినా తీర్మానం సర్వసమావేశంలోకి వెళ్లదు. ట్రాట్స్కీ మీద తీర్మానం అందరూ ఏకగ్రీవంగా ఒప్పుకొన్నాకే చెయ్యవలసి ఉంటుంది." అని మావంక తిరిగి "మన ఇటాలియన్ కామ్రేడులు తీర్మానానికి అనుకూలురేనా?" అని అడిగాడు.

టోలియాట్టితో సంప్రదించి నేను లేచాను. "దీనికి సంబంధించిన కాగితం చూస్తేనేగాని తీర్మానం విషయం మే మేమీ ఆలోచించలేము" అన్నాను.

ఫ్రెంచి ప్రతినిధి, ఆల్బర్టు ట్రెన్‌టు, స్విస్ ప్రతినిధి హంబర్టుడ్రోజ్, ఒకేసారి ఒకేమాట అందుకొన్నారు. (ఈ ఇద్దరూ కూడా, కొద్ది ఏళ్ళ తర్వాతే కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నుంచి బైటపడ్డారు.)

"ఈ తీర్మానం ఉపసంహరించుకోవటమైనది" అని స్టాలిన్ ప్రకటించాడు. సభలో మళ్లీ నిన్నటి హంగామా అంతా బయలుదేరింది. కూసినెన్, రాకోసీ, పెప్పర్ మొదలైన వాళ్లంతా కారాలు మిరియాలు నూరారు.

మా 'అంకఛందాలపు' దృక్పథాన్నిబట్టి చూడగా, ఇటలీలోని మా ఫాసిస్టు ప్రతికూల ఉద్యమమంతా చాలా తప్పుడు తడికగా ఉండి ఉండాలనీ, ఇటలీలో ఫాసిజమ్ ఇంకా వేళ్లుపాతుకొని కూర్చుందంటే, అదంతా కేవలం మా తప్పిదమే అయిఉండాలనీ, థాల్మన్, హేతువాదరీత్యా తేల్చివేశాడు.

కేవలం దీన్నిబట్టే, ఇటలీ కమ్యూనిస్టుపార్టీ విధానం అంతా పూర్తిగా పునఃపరిశీలించి చూడవలసిందంటూ సభవారిని అడిగాను. ఆ పునఃపరిశీలనం జరిగింది.

ఆ పని జరిగింది. మా 'పెంకి తనానికి', శిక్ష ఏమిటా అని పరిశీలించి పరిశీలించి ఆ తీవ్ర 'శిక్షాచార్యులు' ఒకటి కనిపెట్టారు. జరిగిన సంవత్సరాల పొడుగునా మాసుకొంటూరాగా, అంటోనియో గ్రామోసి, ఇటాలియన్ పార్టీని నడుపుకొంటూ వస్తూన్న మూలవిధానాలను పరిశీలించగా, చాలా 'పెట్టీ బూర్జువా' తత్వంతో భయంకరంగా కలుషితమై పోయాయని ఇట్టే తేల్చగలిగారు.

"మనం ఇద్దరం కలిసి, కార్యవర్గ సమావేశంలోని మన చర్చను విశదీకరించుకొంటూ, రష్యన్ కమ్యూనిస్టుపార్టీ రాజకీయ కార్యాలయానికి ఒక ఉత్తరం వ్రాయాలని" టోలియాట్టి నాతో నిశ్చయం చేశాడు. ఆ ఉత్తరం సారాంశం ఇది. "ఇంటర్నేషనల్, చోదకత్వం విషయంలో, రష్యన్ కామ్రేడుల పౌరాణిక ప్రాశస్త్యాన్ని, అగ్రపీఠాధిపత్యాన్ని శంకించటానికి తనకు అర్హతవుందని ఏ కామ్రేడూ అనుకోడు. కాని ఈ ప్రాశస్త్య అగ్రస్థానాలవల్లనే రష్యన్ కామ్రేడులమీద కొన్ని బాధ్యతలు కూడా ఉన్నాయి. వాళ్లకు స్థానబలిమిచేత వచ్చిన హక్కులను, కేవలం అధికారపూర్వకంగా యాంత్రికంగా ప్రయోగించ వలనుపడదు."

ఈ ఉత్తరం బుకరిన్ అందుకొన్నాడు. వెంటనే మమ్మల్నిద్దరిని పిలిపించాడు. ఉత్తరం ఉపసంహరించుకోటం మంచిదనీ, అసలే కల్లోలంగా ఉన్న పరిస్థితులను మరింత క్షోభితం చెయ్యటం మంచిది గాదనీ సలహా ఇచ్చాడు.

ఆ తర్వాత, రోజుల తరబడి నిస్పృహుడనై, నిరాశుడనై పోయాను. నాలో నేను ప్రశ్నించుకోసాగాను.

చివరికి ఇంత అధోగతికి కృంగిపోయామా? మృతులైనవారు, జైళ్లలో మృత్యుస్థితిలో నున్నవాళ్లు, వీళ్లందరూ చేసిన త్యాగాలన్నీ ఇందుకేనా? బికారులమై ఏకాకులమై, నిత్య అపాయంతో జీవితం గడుపుతూ, మాతృదేశాలలోనే, దేశానికి పరాయివాళ్ళమయిపోయి, గాలి బ్రతుకులు బ్రతికిందంతా,— అంతా చివరికిందుకేనా?

ఆ నిస్పృహ తుది అంచులదాకా అనుభవించాను. బుద్ధి అచేతనమై సమ్మూర్ఛితమైపోయింది. దేహంలో తట్టుకోగల శక్తి శూన్యమై ఒక్కసారి సర్వాంగాలూ నీరసంగా కృంగిపోయాయి.

మాస్కోనుంచి వచ్చేసేముందు అక్కడి ఒక ఇటాలియన్ కార్మికుడు నన్ను చూడటానికి వచ్చాడు. ఫాసిస్టుప్రభుత్వం అతనికి దీర్ఘకారాగార శిక్ష విధించింది. దాన్ని తప్పించుకొనేందుకు రష్యాకు కాందిశీకుడై వచ్చి అక్కడే పొట్టపోసుకొంటున్నాడు. (ఈనాటికీ, అతను కమ్యూనిస్టుగా ఉన్నాడనే నా నమ్మకం) తను పనిచేస్తూన్న మాస్కో ఫాక్టరీలో, కార్మికుల పరిస్థితులు ఎంత హేయంగా ఉన్నదీ నాతో చెప్పుకోటానికి వచ్చాడు. మానవశక్తికి అసాధ్యమైన సౌకర్యాలు, వస్తువిషయకంగాగాని, అహోరాత్రి కాలకొరతలోగాని, ఏమిగానీ కిమ్మనకుండా భరించటానికి అతను సంసిద్ధుడుగానే ఉన్నాడు. కాని కార్మికులంతా ఫ్యాక్టరీ యాజమానిక సంఘ దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి ఉండవలసి రావటం, కార్మికుల హక్కులను రక్షించేందుకు సమర్థమైన సంస్థలేకపోవటం, ఎందువల్లనో, అతనికి అర్థంకావటం లేదు. ఈ కొత్త విషయంలో కూడా, కాపిటలిస్టు దేశాలలోకన్నా మాస్కోలో కూలివాని పని కనా కష్టంగా ఎందుకుందో అతను గ్రహించలేకపోతున్నానన్నాడు. "కార్మికవర్గపు హక్కులు" అంటూ మహాఘోషణంతో చెప్పే, సిద్ధాంతికపు వాక్యాలన్నీ పుస్తకంలో మాటలే!

మాస్కోనుంచి తిరిగివస్తూ బెర్లిన్‌లో ఆగాను. "కమ్యూనిస్టు ఇంటర్నేషనల్"వారు, చైనా విషయంలో ట్రాట్స్కీ తయారుచేసిన పత్రాన్ని తీవ్రంగా ఖండిస్తూ, ట్రాట్స్కీని గట్టిగా చివాట్లు వేశారని పత్రికలలో చదివాను. వెంటనే జర్మన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కార్యాలయానికి వెళ్లి, థాల్మన్‌తో "ఇది పట్టి అబద్ధం" అని నిక్కచ్చిగా చెప్పి దీని కేమి సంజాయిషీ ఇస్తారని అడిగాను "ఇంటర్నేషనల్" రూల్సుప్రకారం అత్యవసర సమయాలలో, ఏ నిర్ణయమైనా తీసుకొనే అధికారం అధ్యక్షవర్గానికుందని విశదీకరించాడు. బెర్లిన్‌నుంచి దొంగపాస్‌పోర్టు పుట్టించుకోటానికి అక్కడే నాలుగు నాళ్లు ఆగవలసివచ్చింది. అప్పుడే మళ్లీ పేపర్లలో

చదివాను. "అమెరికన్ హంగేరియన్, జెకోస్లొవక్, కమ్యూనిస్టుపార్టీలు ట్రాట్స్కీ-పత్రాన్ని తీవ్రంగా ఖండించాయి" అని.

"అయితే చివరికి ఆ ట్రాట్స్కీ ఉత్తరాన్ని బైటపెట్టారా" అని ఫాల్మర్‌ నడిగాను.

"లేదు. అయినా, అమెరికన్, హంగేరియన్, జెకోస్లొవక్, కమ్యూనిస్టుపార్టీలు, కమ్యూనిస్టు శిక్షణ స్వరూపమెల్లా వుండాలో మీకు వరవడి చూపించారనుకొంటాను" అన్నాడు ఫాల్మన్. అతను వ్యంగ్య ధోరణిలోమాట్లాడ లేదు. వ్యథాకులిత తీవ్రతతోనే అంటున్నాడు. నిజానికి ఆ సంఘటనల దుస్స్వప్న వాస్తవికతకు, అతని ధోరణి సరిగ్గా సరిపోయివుంది.

ఆరోగ్యకారణాలవల్ల, నేను సంసర్థి స్విట్జర్లాండులోని ఒక చికిత్సాశ్రమానికి చేరుకొన్నాను. ఒకనాడు, ఆశ్రమానికి దగ్గిర పల్లెలో ఒకచోట టోలియాట్టి కనబడ్డాడు. తను అవలంబించ దలుచుకొన్న విధాన మేదో, సుస్పష్టంగా, అరమరిక లేకుండా నాకు చెప్పాడు—ఇంటర్నేషనల్ ప్రస్తుత వ్యవహారాలు, ఏమాత్రమూ సంతృప్తికరంగా గాని, మనస్కరించేటట్లు గాని లేవని సంక్షిప్తంగా ఒక మాటలోనే చెప్పవచ్చును. అయినా దాన్ని మార్చేందుకు మన సత్ప్రయత్నాలు, సదభిలాషలూ, ఏమాత్రమూ పనిచేయవు. అక్కడి సమస్యలు, అవ్యక్తిగత చారిత్రక పరిణామపరిస్థితులతో పెనవేసుకొని ఉన్నవి. అందుకని ఆ పరిస్థితులను లెక్కలోకి తీసుకోకతప్పదు. కార్మికవిప్లవ స్వరూపస్వభావాలు శాశ్వత నిర్ణీతాలు కావు. మన ఇష్టానిష్టాలతో, అవి ఏకీభవించకపోతే, అందులో నష్టపడేది మనమే కాని వాటి కేమీ చెక్కుచెదరదు. అదీగాక మనకు వేరుగతి ఏముంది?—పార్టీతో వేరుపడ్డ కమ్యూనిస్టుల దుర్గతి గమనిస్తూనే ఉన్నాం కదా? సోషల్ డెమోక్రసీకి పట్టిన కడగళ్లను గమనించు—అంటూ చెప్పుకొచ్చాడు.

అతనికి నేను చెప్పిన అభ్యంతరాలు అంత సమన్వయంగా లేవు. ముఖ్యకారణం - టోలియాట్టి వాదాలన్నీ శుద్ధ రాజకీయాలు - నిన్నమొన్నటి అనుభవాలతో నాలో కలిగిన మనః కల్లోలము రాజకీయాల అంచులను దాటి వ్యాపించింది. ఈ "నిర్దాక్షిణ్య చారిత్రక స్వరూపాల" ముందు మోకరిల్లక తప్పదా?

ఇంతకాలం, వేటికి ఎదురు తిరిగి కత్తికట్టి పెనుగులాడేందుకు సోషలిస్టులుగా మారిపోయామో, ఆ అమానుష వాస్తవికాలకు ఇవి నూతనావతారాలు కావా?

నెత్తిమీద పిడుగులాంటి ఘాతం తగిలీకూడా, ఏం జరిగిందీ ఏమాత్రమూ తెలియకుండా తలదిమ్మెత్తిపోయీ మాట, నడక, చేష్ట, మాత్రం మామూలుగానే సాగిస్తూన్న మనిషిమాదిరిగా అయిపోయింది, ఆ సమయంలో నా బ్రతుకు !

ఆతర్వాత సంవత్సరాలలో, ఎల్లా అయితేనేం, అతి బాధాకరంగా, అతి నిదానంమీద, నాకు తెలివిడి కలిగింది. ఈనాటికీ, ఇంకా సరిగ్గా అర్థం చేసుకొందామని ప్రయత్నిస్తూ ఆలోచిస్తూనే ఉన్నాను. నేను వ్రాసిన గ్రంథాలన్నీ. ఈ అర్థం చేసుకోటానికీ, ఇతరులు అర్థం చేసుకొనేటట్టు చేయటానికీ-నా కృషి ఆసాంతం అయిందన్న నిశ్చయం ఇప్పటికీ నాకు లేదు. కాని ఇది మాత్రం సత్యం. ఏరోజు కమ్యూనిస్టుపార్టీని వదిలివేశానో ఆనాడు నాకు చాలా దుర్దినం. ఆనాడు బంధుమరణానికి శోకించినట్లు తపించాను. పోగొట్టుకొన్న నా యౌవన జీవితమంతటికోసం దీర్ఘసూతకం పట్టినట్లు శోకంలో మునిగిపోయాను. నా పుట్టిన దేశంలో మృతాశౌచము, దుఃఖము, దీర్ఘకాలం పాటించే ఆచార ముంది. కమ్యూనిస్టుపార్టీ నిగూఢ సంస్థవంటి సంస్థతోగల - ఆ సంస్థఎంతటి నిబిడసంఘటితమో- అంతటి నిబిడగాఢపరిచయానుభూతులను, ఒక్కసారి, విదిలించుకొని దులిపేసుకోవటం అంత సులభసాధ్యం గాదు. ఆ అనుభవం కొంత, వ్యక్తిశీలంమీద మారని ముద్రలు వేస్తుంది. జీవితాంతం ఆ ముద్రల మచ్చలు, అలాగే నిలిచి ఉంటాయి. యథార్థానికి, మాజీకమ్యూనిస్టులను ఎంత తేలికగా ప్రతివారూ గుర్తించవచ్చునో అందరికీ తెలిసేవుంటుంది. మాజీ సైనికోద్యోగుల లాగా, మాజీ మతగురువులలాగా, వాళ్లు కూడా ఒక విస్ఫుటవర్గంలోకి వస్తారు. ఈనాడు ఎక్స్ కమ్యూనిస్టుల సంఖ్య అక్షౌహిణులలో ఉంది. ఈ మస్య నే టోలియాట్టితో నవ్వుటాలకు అన్నాను.

"అంతిమయుద్ధము, కమ్యూనిస్టు, మాజీ కమ్యూనిస్టుల మధ్యనే జరుగుతుంది" అని.

అయినా, కమ్యూనిస్టుపార్టీ వదిలినప్పటినుంచీ మాజీ కమ్యూనిస్టు వివిధవర్గాలు, ఉపవర్గాలలో వేటిలోనూ చేరకుండా మాత్రం తప్పించుకొంటూ వచ్చాను. ఇందుకు నే నేమాత్రమూ, ఏవిధంగానూ, విచారించవలసిన అవసరం లేకపోయింది. ఈ సంఘాలకూ, ఉపసంస్థలకూ, అధినేతృత్వమైన విధాయక శక్తులూ, గతికంగా వాట్లకు పట్టే కర్మ, ఇదంతా నాకు బాగానే తెలుసును. ఆ సంఘాలు మళ్ళీ మళ్ళీ చీలి అంతకంతకూ చిన్న చిన్న చీలికలుగా ఐపోతూంటాయి. సాధికార కమ్యూనిజంలోని దుర్గుణాలు ప్రతి ఒక్కటీ—ఆ ఉన్మత్త ఆవేశము, కేంద్రీకరణము, ఆ నిర్మమత్వమూ, అన్నీ ఉంటాయి. ఆ సుగుణాలు మాత్రం—విపుల కార్మిక ప్రజా బాహుళ్య అభిమాన అనుసరణవల్ల సాధికార కమ్యూనిజం కుండే ప్రయోజన, ఫలిత సుగుణాలు మాత్రం—మచ్చుకైనా ఉండవు. "ఏదైన ఎదిరించేదే" అన్న తార్కికతత్వం, మాజీకమ్యూనిస్టులను చాలామందిని బయలుదేరినచోటి నుంచి చాలా పెడగా—కొందరిని చివరికి ఫాసిజం వరకూ కూడా—లాక్కుపోయింది.

కొన్ని పరిస్థితుల ప్రోద్బలంవల్లనే కమ్యూనిస్టుపార్టీతో నాకు ఎడబాటు కల్గినా, వాటి కన్నాకూడా, నా స్వానుభవాలను దీర్ఘంగా పరిశీలించుకొనిపోవటంలో, ఈ ఎడబాటుపడటంలో నాకుగల ఉద్దేశాలు, మరింత గాఢతరమౌతూ వచ్చాయి.

కాని సామ్యవాదంలో విశ్వాసం మాత్రం మునుపటికన్నా ఉజ్వలంగానే నాలో సజీవమై నిలచింది. ఇందుకు నా జీవితం యావత్తూ కూడా తార్కాణంగానే నిలవగలదని చెప్పగలననే భావిస్తూన్నాను.

సాంఘికవ్యవస్థపై మొట్టమొదటిగా తిరుగుబాటు చేసిననాడు నాలో ఈ ఆదర్శం ఎంత ఉజ్వలంగా ఎంత గాఢంగా ఉందో, ఈ నాడూ తిరిగీ మళ్ళీ అంత ఉజ్వలంగా, గాఢంగానే ఉన్నది. విధాయకం, కర్మ, అంటూ నమ్మటానికి అసంసిద్ధత; నైతికబుద్ధిని 'వ్యక్తి' పరిమితం మాత్రమే చేయకుండా, కుటుంబానికి సంఘానికి, మానవలోక సంగ్రహ సర్వస్వానికీ విస్తృత మొనరించే అపేక్ష; మానవుల మధ్య యథార్థ భ్రాతృత్వభావము ఉండటానికి అవశ్యకత. మానవుణ్ణి అణగారుస్తున్న, ఆర్థిక సాంఘిక, యంత్రాంగాల కన్నింటికంటే ఉత్కృష్టమయి, మానవునిగా మానవుని కున్న విశిష్టస్థానము—ఈ భావసంచయ మంతా ఆ ఆదర్శంలో భాగము. ఏళ్ళు గడుస్తూ రాగా—మానవుని గాంభీర్యం అర్థం చేసుకొనే సహజ జ్ఞానం; మానవునిలో నిత్యం అతిన్ని అధిగమించటానికి ప్రయత్నిస్తూ, అతనిలోని నిత్య సంక్షోభానికి మూల కారణమైన పరాతత్వం అంటే గౌరవం—పై భావాలకు తోడౌతూ వచ్చాయి.

కాని ఈ విధమైన "సామ్యవాదము" నా ఒక్కడి "ప్రత్యేకతే" అని నేను అనుకోటం లేదు. ఈ "ఉన్మత్త - సత్యాలు" అన్నీ మార్క్సిజం కన్నా చాలా పురాతనమైనవి. గత శతాబ్ద ద్వితీయార్థంలో పారిశ్రామిక ధనికవాద ఫలితంగా జన్మించిన ఉద్యమాలలో వీటి కాశ్రయం దొరికింది. ఈ నాటికీ ఆ ఉద్యమానికి ప్రాణం పోసే నిరంతర శక్తిమయ జీవస్రోతస్సు లివే!

సామ్యవాద తత్వానికీ, సామ్యవాద ఉద్యమాలకూ, కల సంబంధాలపై నా అభిప్రాయాలను ఎన్నోమాట్లు చెప్పుకొని ఉన్నాను-ఈ సంబంధాలు, ఎప్పటికీ ఒకే పద్ధతిలో మూసపోసి ఏ మార్పూ చెందటానికి వీలులేదనే, సంబంధాలు కావు. కొత్త కొత్త విజ్ఞానాలతో, పరిశీలనలతో, మునుపటి తత్వవాదాలు, పాతబడి పట్టు తప్పిపోవచ్చును - కాని ఉద్యమం శాశ్వతంగా నడుస్తూనే ఉంటుంది. అయితే, కార్మికోద్యమంలోని, ఉత్సర్గాపవాద విస్మృత సిద్ధాంతవాదులకూ, (*Doctrinaire*) స్వానుభవజన్య స్వల్ప జ్ఞానవాదులకూ, (*Empiricist*) మధ్యనున్న నిత్య వివాదంలో, నన్ను రెండవ తరగతికి చేర్చటం మాత్రం పొరపాటని చెప్పుకొంటున్నాను. సామ్యవాద విధానము, ఏ ఒక్క సూత్ర ధర్మానికీ ముడిపడ్డది కాదు - ఒక విశ్వాసానికి సంబంధికము. సోషలిస్టు వాదాలు, తాము ఎంత "శాస్త్రీయము" అని చెప్పుకోటానికి ప్రయత్నిస్తూ పోతాయో, అంత తాత్కాలికాలూ గాక తప్పదు.

వాదాలకూ, విలువలకూ మధ్యనున్న విభేదమెంతో సామాన్యంగా గ్రహించబడటం లేదు. కాని ఆ విభేదము ప్రాథమికము. కొన్ని వాదాల సమీకరణతో ఒక మతము మాత్రము స్థాపించవచ్చును. కాని 'విలువల' సమీకరణను పునాది చేసుకొని, ఒక సంస్కృతిని, ఒక నాగరికతను, మానవులలో ఒక నూతన జీవిత విధానాన్ని సృష్టి చేసుకోవచ్చును.

---

(హామిష్ హామిల్టన్ అండ్ కంపెనీ; బ్రిటిష్ ఇన్ఫర్మేషన్ సర్వీసులసౌజన్యంతో)

# స్వాగతము



శ్రీ దండిపల్లి వేంకటసుబ్బాశాస్త్రి

౧

సి చిల్లీ లలు సృష్టిగర్భమున వర్ధింపఁ దురూహ్యమ్ముల; లా
శా చైతన్యము మానవప్రకృతి విశ్వాసించి జీవించు; గాం
ఢా చాపల్యము లేక కాలము ! సమస్థాయిఁ బ్రదర్శించి ఆ
జ్ఞాచక్రమ్మును ద్రిప్పుచుండు నిటు నూత్నప్రాప్త వర్షమ్ములఁ.

౨

జీవకళల్ దొరంగుట గ్రహించె మహాంధ్రయశస్సు; నైక్యతా
భావము లిప్పు డిప్పుడె ప్రవర్తితమయ్యెడు జాతియందు;-స్వా
భావిక, వీరశౌర్యము లపారముగా గయిసేసి, 'ఆంధ్రరా
ష్ట్రా'వని! తేజరిల్లగ ఖరాబ్దమ ! ఆంధ్రుల పూజ లందుమా !

౩

ఒకనా డుండిన ఆంధ్రవైభవము, ధృత్యుత్సాహముల్ నేడు పు
చ్చుకు గాన్పింపవుగా ఖరాబ్దమ ! జగత్క్షోభప్రవాదక్రియా
త్మక యుద్ధజ్వాలనమ్ము నాపి యఖిలాంధ్రవ్యాప్తరాష్ట్రమ్ము సా
ధక మౌనట్టుల జేసి, ఆంధ్రుల మహౌదార్యమ్ముతో బ్రోవుమా !

౪

నవ వసంతోదయప్రసన్నములు, మధుర
మధురసప్రపూర్ణములును మంజులములు
ప్రకృతిదత్తములు లతికాప్రసవములును
స్వాగతం బిడు ఖరనామ వత్సరాది—
సకలమానవకల్యాణ సాధన మయి
భారతము వర్ధిలుత ! శాంతిపథమునందు.

---

# కాంట్ పరతత్త్వ వాదం

శ్రీ జి. వి. కృష్ణరావు



భావాల చరిత్ర చాల విచిత్రం. కొన్ని భావాలు మానవులను కీలుబొమ్మలు చేసి మారణహోమాలు రేకెత్తిస్తాయి; వాటిని అభ్యుదయ చిహ్నాలంటాయి. ఇవి చండశాసనాలై అవకాశం ఉన్నంతవరకూ ఏలుతూనే ఉంటాయి. మరొకరకమైన భావాలు ఈ గడబిడ లేమీ చేయవు. అసలు ఉన్నట్టే కనిపించనంత సౌమ్యంగా ఉంటాయి. అయితే యివి వివేచనాశీలునికి గిలిగింతలు పెడతాయి. నూతన భావాలు రేకెత్తిస్తుంటాయి. అంతేగాని కత్తి పుచ్చుకొని శాసించవు. వీటి ఉపదేశాలు హృదయకుహరంలో అనురణనంపొందే ఆత్మప్రబోధాలవలె ఉంటాయి. ఇవి విశ్వమానవ సౌభ్రాతృత్వానికీ, స్వాతంత్ర్యవికాసానికీ, తత్త్వాన్వేషణకూ ప్రాతిపదికలు. ఈ తరగతికి చెందినవే ఇమాన్యుయల్ కాంట్ సిద్ధాంతాలు.

ఆధునిక పాశ్చాత్య దార్శనికులలో కాంట్ అగ్రేసరుడుగా పరిగణింపబడుతున్నాడు. అతడు 1724 ఏప్రిల్ 22 న తూర్పు ప్రష్యాలోని కోనిగ్స్‌బర్గ్ నగరంలో జన్మించాడు. అతని తలిదండ్రులు పేదలు. అతని తోబుట్టువులు పెండ్లి అయ్యేటంత వరకు ఇతరులకు పనిపాటలు చేసిపెట్టి పొట్టపోసుకొనేవారు. కాంట్ సోదరుడు విశ్వవిద్యాలయంలో చదివి ఉత్తీర్ణుడై మతగురువయ్యాడు. కాంటుకు పన్నెండవఏట తల్లి, 21 వ ఏట తండ్రి గతించారు.

పదమూడవఏట కాంట్ విశ్వవిద్యాలయ కళాశాలలో ప్రవేశించాడు. మొత్తంమీద ఏ కొలది సంవత్సరాలో తప్ప అతని జీవితమంతా కోనిగ్స్‌బర్గులోనే గడిచింది. ఆ కాలంలో యం. ఏ. డిగ్రీకి డాక్టరేట్ డిగ్రీకి విద్యావిషయంలో పెద్ద వ్యత్యాసం లేదు. కాని డాక్టరేట్ డిగ్రీ పుచ్చుకోవాలంటే ఎక్కువ డబ్బు చెల్లించవలసిఉండేది. ధనాభావం వల్ల కాంటు యం. ఏ. పరీక్షకే కూర్చుని డిగ్రీ సంపాదించాడు. తరువాత భుక్తికోసమని కోనిగ్స్‌బర్గు పరిసరాలలోని శ్రీమంతుల బిడ్డలకు విద్యబోధిస్తూ వచ్చాడు. 1746 నుంచి 1755 వరకు జీవయాత్ర ఇలాగే గడిచింది. 1770 లో అతనికి కోనిగ్స్‌బర్గ్ విశ్వవిద్యాలయంలో తత్త్వశాస్త్రాచార్యపదవి లభించింది.

కాంట్ నాటి జర్మన్ తత్త్వశాస్త్రవేత్తల సిద్ధాంతాలను ఆకళించుకొన్నాడు; డెస్కార్టిస్, లెబనిజ్, లాకీ, బర్క్లీ మొదలైన పాశ్చాత్య దార్శనికుల సిద్ధాంతాలను జీర్ణించుకొన్నాడు. న్యూటన్ గణితశాస్త్రం, రూసో సిద్ధాంతాలు మననం చేశాడు. నాటి ఫ్రెంచివిప్లవసిద్ధాంతాలకు స్వాగత మిచ్చాడు. అతడు మూడుమూర్తులా ప్రజాస్వామ్యవాది. స్వాతంత్ర్యం అతనికి ప్రాణప్రదం. ఈ లక్షణాలే అతని తత్త్వవిచారాన్ని చాలవరకు దిద్దితీర్చాయి. ముఖ్యంగా స్వాతంత్ర్యాభిలాష లేకపోయినట్లయితే అతని సిద్ధాంతాలు మరొకవిధంగా ఉండేవి.

అతని దినచర్య అత్యంత క్రమబద్ధంగా నడిచేది. రోజూ ఏ గడియన ఏ పనిచేసేవాడో ఎన్ని అవాంతరాలు వచ్చినా ఆపని ఆగడియన విధిగా నిర్వర్తించేవాడు. అందువల్ల అతని దినచర్యనుబట్టి కోనిగ్స్‌బర్గు ప్రజలు తమ గడియారాలను సరిదిద్దుకొంటూ ఉండేవారట.

కాంట్ ఆజన్మ బ్రహ్మచారి. క్రమబద్ధం కావటంవల్ల అతని జీవితం ఎగుడుదిగుళ్లు ఎరుగదు. అంతజ్ఞానవంతుడైనా అతనికి అహంకారం ఏ కోశానా లేదు. జ్ఞానవంతుడు కాబట్టి తన జీవితమే సార్థకం, సామాన్యప్రజల జీవితాలు నిరర్థకాలన్న దురభిమానం అతనికి లేదు. తత్త్వశాస్త్రానికి ఇతర శాస్త్రాలు లోకువ అని కాని, రామణీయకం నిరర్థకమని కాని అతడు ఒప్పుకోడు. ఆయా రంగాలలో ఆయా

శాస్త్రాలే ప్రమాణాలని అంగీకరించి వీటికి స్వాతంత్ర్యం ప్రతిపాదించాడు. "నాది అన్వేషకబుద్ధి. జ్ఞానంపొందాలనీ, క్రొత్తకొత్త విషయాలు తెలుసుకోవాలనీ నాకు ఉత్సాహం. మానవజీవితానికి ఉదాత్తతను ప్రసాదించేవి ఇవేనని ఒకప్పుడు విశ్వసించేవాణ్ణి. మూఢజనులను ద్వేషించేవాణ్ణి. కాని రూసో నన్ను చక్కదిద్దాడు. ఈ కల్పితాధిక్యం అదృశ్యమైపోయింది. సామాన్యప్రజలను గౌరవించటం నేర్చుకొన్నాను. మానవసహజాలైన స్వత్వాలను మానవులందరికీ నా సిద్ధాంతాలు ప్రతిపాదించగలవన్న నమ్మకం నాకు లేకపోతే, సామాన్య కార్మికుని జీవితంకంటే కూడ నా జీవితం నిరర్థకమని భావిస్తాను" ఈ వాక్యాన్నిబట్టి అతని స్వభావం అర్థంచేసుకోవచ్చును.

కాంట్ సిద్ధాంతం ఒక్కసారిగా ఊడిపడ్డది కాదు. హ్యూమ్ రచన అతనిని 'మూఢనిద్ర'నుంచి మేలుకొలిపింది. దానితో విచారం రేకెత్తి, క్రమక్రమంగా వికాసంపొంది జ్ఞానస్వరూప విచారం (*critique of Pure Reason*), ధర్మస్వరూప విచారం (*Critique of Practical Reason*), రామణీయక స్వరూపవిచారం (*Critiqul of Judgment*) అన్న మూడు ఉద్గ్రంథాలతో పూర్ణ స్వరూపం సంతరించింది. మొదటి గ్రంథం 1781 లోను, రెండవది 1788 లోను, మూడవది 1790 లోను వెలువడ్డాయి. ఈ మూటిని ప్రస్థానత్రయమని చెప్పవచ్చును. ఈ వాదాన్ని పరతత్త్వవాదమనీ (*Transcendental Philosophy*) విమర్శకవాదమనీ (*Critical Philosophy*) అంటారు. ఇవి కాక 1783లో దిప్రోలిగామినా, 1785 లో ధర్మదర్శనమూల సూత్రాలు అన్న రెండు గ్రంధాలు అతడు వ్రాశాడు. "నిత్యశాంతి" అన్న అతని రచన 1795 లో వెలువడింది. అతని రచనలలో సామాన్యులకు కొంతవరకు అందుబాటులో ఉన్నది ఈ పుస్తకమే. ఇవికాక ప్రస్థానత్రయానికి పూర్వం ఎన్నో వ్యాసాలు, పుస్తకాలు, వ్రాశాడు. ఈ విధంగా తన సిద్ధాంతాలను సమగ్రంగా వివరించినతరువాత 1804 ఫిబ్రవరి 12 న కాంట్ మరణించాడు. విశ్వవిద్యాలయం, కోనిగ్స్‌బర్గ్ నగరం అశ్రుతర్పణాలు విడిచి తమ యోగ్యతను చాటుకొన్నవి.

## జ్ఞానస్వరూప విచారం

'జ్ఞానస్వరూపవిచారం'లో ప్రమాణస్వరూపాన్ని పరామర్శించి, జ్ఞానతత్త్వాల్ని చర్చించి మేరలను నిర్దేశించి ఆ విద్యను కాంట్ వివరించాడు. దానితో ఏర్పడుచున్న దార్శనిక అర్థాలను అతడు సిద్ధాంతీకరించాడు. అందువల్ల తత్త్వజిజ్ఞాసువులకు ఈ గ్రంథపరిశీలనం అవసరం. కాని ఇది అంత తేలికగా అర్థంకాదు. ప్రతివాక్యం తర్కకర్కశం. పరిభాషాక్లేశం,సర్వతోవ్యాప్తం. వాక్యాల అన్వయాలు సుబోధకాలు కావు. పైగా ప్రతిపాదించే అర్థాలు విచిత్రమైనవి. దానితో అర్థం చేసుకోవటం మరీ కష్టం. అందువల్లనే కాబోలు ఎన్నో వ్యాఖ్యానాలు వెలువడ్డాయి. ఇంకా వెలువడటానికి అవకాశం ఉన్నది. మరీ చిత్రం ఏమంటే ఈ వ్యాఖ్యాతల భాష్యాలలో ఒంటికొంటికి పొత్తులేదు. సోవనార్ కాంట్ సిద్ధాంతంపై సాగించిన విమర్శతో మనం ఏకీభవించకపోవచ్చును. కాని కాంట్ శైలినిగూర్చి వ్రాసిన వాక్యాలు గమనింపదగ్గవి:—

"రచనలో అపూర్వనీరసత్వం ఉన్నది. ఇలాంటిది మళ్లీ అరిస్టోటల్ శైలిలోనే నాకు గోచరించింది. అయితే అది సులభతరం. కాంట్ భాష తరచు అస్పష్టంగా, అనిర్దిష్టంగా ఉంటుంది; భావాన్ని పూర్తిగా వెల్లడించజాలదు. దీనికితోడు కొన్నిపట్లు అయోమయం. ఈ అయోమయతకు విషయక్లిష్టత' భావగంభీరత కొంతవరకు కారణాలు. అయినా యీ అయోమయత్వం, అయోమయత్వమే."

జీవితాలు వెచ్చించి వ్యాఖ్యానాలు వ్రాసినవారే భిన్నార్థాలు చెబుతున్నారంటే ఈ గ్రంథక్లిష్టతనుగూర్చి వేరే వివరించవలసిన అవసరంలేదు. దాదాపు ప్రతివిమర్శకుడూ కాంటురచనలో స్వవచనవ్యాఘాతాలున్నవన్నవాడే. కాంట్ సిద్ధాంతాలను విమర్శిస్తూ, "భావాలలో ఒంటికొంటికి పొందికలేదు. ఇలాంటి బాధ ఏర్పడుతున్నదన్న విషయం గమనించను కూడా గమనించడు," అని హెన్రీసిడ్విక్ వ్రాశాడు. అతడు విమర్శకుడు కాబట్టి అతనిమాటకు అంత పట్టింపులేదు. విమర్శనంలో ఎప్పుడూ తారతమ్యాలు ఉండనే ఉంటవి. కాని 'నేను వ్యాఖ్యానం వ్రాస్తా' నంటూ, "దాదాపు ప్రతి అధ్యాయంలోను

కాంట్ తన్నుతాను అన్యథాకరించుకొన్నాడు. కేవలం పరస్పర విరుద్ధార్థాలలో వాడని పారిభాషిక పదం దాదాపు లేదనే చెప్పవచ్చును.” అని అనటం వ్యాఖ్యాతకు లక్షణం కాదు. అర్థం కానప్పుడు పుస్తకంజోలికి పోకపోవటం ఉత్తమం. అంతేకాని వ్యాఖ్యానిస్తానంటు ఇలాంటి విమర్శకు పూను కోవటం వ్యాఖ్యాతకే గౌరవహాని. నిజంగా ఒక రచయితను అర్థంచేసుకోవాలంటే విరుద్ధంగా భాసించే అర్థాలకు సమన్వయం ఏర్పరుచుకోవాలి. అలా ఏర్పరచుకొన్నప్పుడు రచయిత అభిమతం తెలుసుకోవటానికి వీలవుతుంది. అలా సమన్వయించు కొన్న అర్థాలతో ఏకీభవించినా ఏకీభవించక పోయినా అది వేరే సంగతి. వ్యాఖ్యాత అయినవాడు విరుద్ధంగా కనిపించే అర్థాలను సమన్వయించి చూపు తాడు. సద్విమర్శకుడు అలా అన్వయించుకొని అర్థం చేసుకొని గుణావగుణాలను వివరిస్తాడు. ఇంతకూ కాంట్ రచనలోని అయోమయత్వం ప్రొఫెసర్ పాటన్ పేర్కొన్నట్లు విమర్శకులు సృష్టించిందే తప్ప నిజంగా లేదు. “ఎక్కడన్నా నిజంగా అయో మయత్వం ఉంటే దానికి రెండు కారణాలున్నవి. (1) ఆ గ్రంథాన్ని ఆదరాబాదరా వ్రాయటం, (2) ప్రతిపాద్య విషయాలు క్లిష్టాలూ, నవ్యాలూ కావటం” అంతకు తప్ప మరేమీ లేదు.

ఈ ఉపక్రమణికను ఇంతలో ముగించి కాంట్ సూచిస్తున్న సమస్యను, పరిష్కారమార్గాన్ని చూదాము.

## లౌకిక అలౌకిక జ్ఞానాలు

మనకున్న జ్ఞానం రెండువిధాలు :—(1) అనుభ వంవల్ల కలుగుతున్న లౌకికజ్ఞానం. (2) అనుభవంతో నిమిత్తంలేకుండా కలుగుతున్న అలౌకికజ్ఞానం. అను భవంవల్ల కలుగుతున్న జ్ఞానం ఇంద్రియాల వల్ల బుద్ధివల్ల కలుగుతున్నది. మొత్తంమీద ప్రత్యక్ష అనుమాన ప్రమాణాలవల్ల కలుగుతున్నదంతా మొదటిశాని క్రిందికి వస్తుంది. ఈ జ్ఞానం వ్యక్తికం. పైగా అనుభవంమీద ఆధారపడుతుంది. అందు వల్ల దీనికి క్షతి తప్పదు; స్వయంప్రకాశత్వం ఉండదు. ఈ జ్ఞానం ఎలా కలుగుతున్నదో, మరొక విధంగా ఉండటానికి ఎందుకు వీలులేదో తెలియదు. దృష్టాంతం కాకుల నలుపుదనం. కాకి నల్లగాఉంటుం దని అనుభవంవల్ల తెలుస్తున్నది. అనుభవం లేక యీ జ్ఞానమేలేదు. అయితే యీ జ్ఞానానికి ఇకముందు బాధ కలగదని చెప్పలేము. ఇంతవరకూ మనకు కని పించిన కాకులన్నీ నల్లగానే ఉన్నవి. కాని రేపు తెల్లనికాకులు కనిపించరాదన్న నియమ మేమున్నది? పైగా కాకికీ, నల్లదనానికీ సంబంధ మేమిటి? ఎందు వల్ల అది తెల్లగా ఉండటానికి వీలులేదు? కాబట్టి ఈ జ్ఞానం అబాధితం కాదు. అనుభవంమీద ఆధారపడు తున్నది. కాబట్టి నిరుపాధికం కాదు. స్వయంప్రకాశ మానము కాదుగనుక సంభావ్యము (*apodictic*) కాదు. ఇలాంటి జ్ఞానాన్ని వ్యావహారికజ్ఞానమనీ, లేక లౌకిక జ్ఞానమనీ, లేదా అపరావిద్యఅనీ అన వచ్చును.

రెండవ రకమైన జ్ఞానం అలా కాదు. అది అను భవంవల్ల కలగటంలేదు. ఏకాలంలోను దానికి క్షతి లేదు. పైగా అది స్వయంప్రకాశమానమూ, సంభావ్య మూను.

ఇందుకు రెండురెళ్లు నాలుగు అన్నదే దృష్టాంతం. ఈ జ్ఞానం అనుభవజన్యం కాదంటే ఆశ్చర్యం కల గక మానదు. అసలు అనుభవజన్యం కాదని ఎలా అంటున్నాము. ప్రపంచంలోని రెండు రెండ్ల వస్తువు లన్నిటినీ మనం లెక్కపెట్టలేదు. అయినప్పటికీ రెండురెళ్లు నాలుగే అవుతవి కాని అయిదు ఎన్నటికీ కావు. ఇవాళ మనదేశంలో కాంగ్రెసుపార్టీ అధికా రంలో ఉన్నది. నాలుగువందల సంవత్సరాల తరు వాత ఎవరు ఈ అధికారం చేపడతారో చెప్పలేము. కాని అప్పుడు కూడా ఇద్దరు మంత్రులు, ఇద్దరు మంత్రులూ కలిసి నలుగురు మంత్రులు అవుతారు కాని ఐదుగురు మంత్రులు కారు. ముందు జరగబోయే దానిని ప్రత్యక్షంద్వారా చూస్తున్నామనటానికి కాని, అనుమానంద్వారా ఊహిస్తున్నామనటానికి కానీ వీలులేదు. అయినా రెండురెళ్లు నాలుగు అన్న దానికి క్షతి ఏర్పడదు. మరొకవిధంగా అది ఉండ టానికి వీలులేదు. ఈ రకమైన జ్ఞానం అలౌకికజ్ఞానం లేదా పరావిద్య అనవచ్చును.

ఈ పరావిద్య, అంటే అబాధితమూ, నిరుపా ధికమూ సంభావ్యమూఅయిన జ్ఞానం మనకు ఎలా లభ్య

మాతున్నది? అనుభవం పొందకుండానే ముందుగా కొన్ని కొన్ని విషయాలను ఎలా తెలుసుకోగలుగుతున్నాము? రస్సెల్ పేర్కొన్నట్లు శూన్యవాది అయితేతప్ప తత్త్వవేత్త అయిన ప్రతివాడూ దీనికి సమాధానం చెప్పాలి. ఈ సమస్యను సవ్యంగా పరిష్కరించటమంటే, ప్రకృతిసమాజశాస్త్రాల సమస్యలను, తత్త్వశాస్త్రసమస్యలను పరిష్కరించటమే అవుతుంది.

ఈ విద్య ఎలా ప్రాప్తిస్తున్నదో శ్రీమతి అనుభూతిని ప్రశ్నిస్తే ప్రయోజనం ఉంటుందా? రాజకీయ నాయకులకు రహస్యాలుంటవి. పార్టీనియమావళి ఉంటుంది. ఇది అనుమతించినా ప్రజల ప్రాపకం సంపాదించవలసిఉంటుంది. నిజం చెప్పటానికి ఇవన్నీ ఒకవేళ ప్రతిబంధకాలు కాకపోయినా అసలు రహస్యం నాయకులకే తెలియకపోవచ్చును. ఇలాంటి బాధలే శ్రీమతి అనుభూతికి ఉండవని నమ్మకమేమిటి? కాబట్టి శిష్యమాత్రులమై అనుభూతికి సేవ చేసినా ప్రయోజనంలేదు. భౌతిక శాస్త్రకారుడు ప్రకృతి ఏమి చెబుతుందా అని ఎదురుచూడడు. ప్రకృతి విలాసాలను ఇది హావం, ఇది భావం అని వర్ణిస్తూ కూర్చోడు. దానికి దినచర్య వ్రాస్తూఉండడు. న్యాయాధికారి కోర్టులో సాక్షిని తనకు కావలసిన ప్రశ్నలడిగి సమాధానాలు పొందుతాడు. వాటినిబట్టి సత్యం తెలుసుకోటానికి యత్నిస్తాడు. అలాగే శాస్త్రకారుడుకూడా ప్రశ్నావళి తయారుచేసి, "దీనికి ఏమి చెబుతావు? మరి దీని కేమిటి?" అని గుచ్చిగుచ్చి ప్రశ్నిస్తాడు. అంటే ప్రమాణశాస్త్ర (*Pure Logic*) విహితమైన తన సిద్ధాంతాలకు అనుగుణంగా పరిశోధనలు సాగించి ఆ పరిశోధన సఫలమైతే అది యథార్థమని తెలుసుకొంటాడు. ఏ శాస్త్రానికైనా ఇదే మార్గం. కేవలం శుశ్రూషవల్ల ప్రయోజనంలేదు. శుశ్రూషచేస్తూకూర్చుంటే గురువు తనకు ఇష్టమైన అర్థాలను మాత్రమే శిష్యులకు బోధించినట్లుగా ప్రకృతి తన కిష్టమైన విషయాలను మాత్రమే వెల్లడిస్తుంది.

"ఇంతవరకూ మన జ్ఞానం,విషయప్రకారకమని భావించటం జరిగింది. ఈ భావాన్ని అనుసరించి అనుభవప్రాప్తికి ముందుగా విషయజ్ఞానం సంపాదించటానికి యత్నాలు జరిగి విఫలమైపోయాయి. ఈ పద్ధతి వదలి విషయం, జ్ఞానప్రకారకమని భావించి పరిశీలన సాగిస్తే దార్శనిక కృషి సఫలమౌతుందో లేదో ప్రయత్నించిచూడాలి. ఇది పరవిద్యాప్రాప్తికి ఎక్కువ అనుకూలిస్తుంది."

కాబట్టి ఈ పద్ధతినే అవలంబించి పరావిద్య తత్త్వం పరిశీలించటం అవసరం. ఈ పనే జ్ఞానస్వరూప విచారంలో పరామృష్టమైంది. ఈ గ్రంథం మొదటిభాగంలో మన ఇంద్రియకత (*Sensibility or Intuition*) వల్ల లభిస్తున్న పరతత్త్వసూత్రాలు నిశితదృష్టితో నిర్ధరించటం జరిగింది. "ఈభాగం అపూర్వం,అత్యంతవిశిష్టం. ఇది ఒక్కటే కాంట్ ప్రతిష్ఠకు అమరత్వం ప్రసాదించి ఉండేది. ఇందు ప్రతిపాదించిన ఉపపత్తులు సంపూర్ణ విశ్వాసజనకాలు. ఇందు ఉపపాదించిన అంశాలు అప్రతిహతసత్యాలని భావిస్తున్నాను. ప్రపంచంలో అత్యంత ఫలప్రదమైన వాక్యాలలో ఇవి కొన్ని. ఇవి మహత్తర సత్యదార్శనికార్థసమున్మీలనాలు," అని షోపనార్ ఈ భాగాన్ని ప్రశంసించాడు. తన భావాలను కాంటుకు ఆపాదించి అతను ఈ వాక్యాలు వ్రాసినా వీటిలో సత్యం లేకపోలేదు.

ఇక అసలు విషయానికి వద్దాము. కాంటు మతంప్రకారం ఆత్మకు మూడుశక్తు లున్నవి. (1) ఇంద్రియకశక్తి (*Intuition or Sensibility*) (2) చింతనాశక్తి లేక బుద్ధి (*understanding*) (3) వివేచనాశక్తి (*Reason*) ఇంద్రియకశక్తి ఇంద్రియాల ద్వారా అర్థాలతో ప్రత్యక్ష సంబంధం కలిగి ఉంటుంది. ప్రత్యక్షజ్ఞానం కేవలం ఇంద్రియకమే కాని ఇందులో ఆలోచన ఉండదు. రెండవదైన బుద్ధి ఇంద్రియక శక్తివంటిది కాదు. ఇది సవ్యాపార. ప్రత్యయాల (*concepts*) ద్వారా ఇంద్రియకతా లబ్ధవిషయాలను ఆలోచిస్తుంది. వివేచనాశక్తి ఇంద్రియకతా లబ్ధాలు కాని విషయాలను ఆలోచిస్తుంది.

## దేశకాలాలు

ముందు ఇంద్రియకతాస్వభావాన్ని పరిశీలింతాము. ఒకటి మనకు కనిపించాలి అంటే అది ఉండాలి. అదే వస్తువు. ఆ వస్తువునుంచి వచ్చే వేదన

లను (*Sensations*) మన ఇంద్రియాలు, బుద్ధి ఆ దేశానుసారంగా స్వీకరిస్తాయి. ఇలా స్వీకరించిన వాటిని దేశకాలాలలో వ్యవస్థీకరిస్తాయి. బట్వాడా కావలసిన ఉత్తరాలను తపాలాఫీసులో ఉద్యోగులు ఆయా ప్రాంతాలవారీగా విభజించి క్రమత్వం ఏర్పరస్తున్నట్లే ఇంద్రియాలు వేదనలకు దేశ కాల వ్యవస్థ కల్పిస్తాయి. అంటే వేదనలపై దేశకాలాలు అధ్యస్థాలవుతాయి.

దీనినిబట్టి దేశకాలాలు లేవనికానీ, ప్రాతిభాసికాలు అని కానీ అర్థంచేసుకోరాదు. ఇవి రెండూ ఉన్నవి. విడిగామాత్రం లేవు. ఇంద్రియాల వృత్తులుగా (*functions*) లేక ఐంద్రియకతారూపాలుగా (*forms*) ఉన్నవి. దేశం బాహ్యేంద్రియవృత్తి. కాలం అంతరింద్రియం లేక అంతఃకరణం వృత్తి. అంతేకాని దేశకాలాలు అనేవి నైయాయికవైశేషికులు భావిస్తున్నట్లు ద్రవ్యాలు కావు. సాంఖ్యులు, సాపేక్షవాదులు వివరిస్తున్నట్లు ద్రవ్య వృత్తులు కావు. లాకీ, అధునిక వాస్తవికతావాదులు ఊహిస్తున్నట్లు ద్రవ్యగుణాలు కావని కాంట్ వాదం. ఇది పరతత్త్వవాదానికి ఆయువుపట్టు. దేశకాలాలు ఐంద్రియకతావృత్తులు కావంటే కాంట్ సిద్ధాంతానికి గుడుసు చుట్టటమే.

దేశకాలాలు ఐంద్రియకతారూపాలా? నాకు కనిపిస్తున్న యీ పుట నా నేత్రాలు ఆరోపిస్తున్నవే తప్ప నిజంగా లేదా? నా గదిలో ఈ సమయాన ఈ పుట చూస్తున్నానంటే ఈ కాలాన్ని నా అంతఃకరణం అధ్యస్తం చేసిందేతప్ప నిజంగా లేదా? ఈ పుటలు, ఈ సమయాలు ఏమిటి? నిజంగా దేశకాలాలు మీ కాంట్ మహాశయుని ఐంద్రియకతావృత్తులే అయితే ఆయన ఎప్పుడో అస్తమించాడు కాబట్టి నేను దేశకాలాలలో లేకపోవాలి. నేను లేను అనటం ఎంత సబబుగా ఉన్నది? నా యింద్రియాలు నా శరీరానికి దేశకాలాలు ఆరోపిస్తున్నవి కాబట్టి నేను దేశకాలాలలో ఉన్నాననుకొన్నా, ఇతరుల కళ్లు వారి కనుబొమలకు క్రిందుగా కనిపిస్తవే కాని చెవుల వనకాల ఎందుకు కనిపించవు? మన చెవులు మన నెత్తిమీద ఎందుకుండవు? ఎప్పుడూ ముందు మెరుపు ఆ తరువాతనే ఉరుము ఎందుకు గోచరిస్తున్నవి? ఇంద్రియాలకూ, అంతఃకరణకూ ఇంత పక్షపాతం, ఇంత దీక్ష దేనికి? పొరపాటుననైనా ఎందుకు వ్యత్యయం జరగదు?

ఇలాంటి ప్రశ్నలు పరశ్శతంగా బయలుదేరక తప్పదు. అయితే యీమాత్రం కాంట్ ఆలోచించకుండా ఉంటాడా? ఏ దృష్టితో ఇలా అన్నాడు? ఎందుకన్నాడు? ఉన్మత్తుని ప్రలాపాలకుకూడా ఒక అన్వయం, ఒకక్రమం, అర్థం ఉన్నవి. కాగా కాంట్‌లాంటి తత్త్వవేత్తవాక్యాలు అర్థరహితంగా ఉంటవా? కొంచెం ప్రశాంతంగా ఆలోచింతాము. పచ్చద్దాలజోడు పెట్టుకొన్నప్పుడు వస్తువులన్నీ పచ్చగా కనిపిస్తాయి. అలాగే మన మనస్సుకు దేశకాలాల జోడు తగిలించి ఉంచదనుకోండి. ఈ జోడు తీసివేయటానికి వీలులేక మనస్సు చూడటం మానుకోలేకపోయినప్పుడు ఏమౌతుంది? ఈ స్థితి ఊహించటంకూడా కష్టమే కాబట్టి ఈ ఉపమానం కాసేపు ఆవల ఉంచుదాము.

మనం సాధారణంగా అనంతమైన దేశం మన చుట్టూ ఉన్నదని అనుకొంటాము. ఇది నిజంగా పరమంగా వేరుగా ఉన్నట్లయితే కెమెరాలు, దూరదర్శినీయంత్రాలు సూక్ష్మదర్శినీయంత్రాలు నిరర్థకాలు కావాలి. ఎందుకంటె చిన్నఫోటోలు తీయటానికి, తారాపథాన్ని దూరదర్శినులతో సన్నిహితం చేయటానికి, సూక్ష్మజీవులను పెద్దవిచేసి చూడటానికి ఎలా సాధ్యపడుతుంది? మన కళ్ళజోడు సంగతి ఏమిటి? మన దృష్టికి అనుగుణంగా త్రిపరిణామాత్మకమైన దేశాన్ని మార్చుకోవటంలేదా? ఇదే నిజమైతే మనస్సుకు ప్రత్యేక దేశకాలరూపాత్మకమైన ఐంద్రియకశక్తి ఉన్నదన్నప్పుడు వైపరీత్యమేమున్నది? అయితే కాంటు మరొక అడుగు ముందుకువేసి అసలు దేశకాలాలు అనేవి ఐంద్రియకతారూపాలు అంటాడు. దీనికి అతడు ఈ క్రింది ఉపపత్తులను చూపుతున్నాడు.

1. ఈ వస్తువు ఇక్కడ, ఆ వస్తువు అక్కడ, ముందు టేబిలు, ప్రక్కన గోడ, పైన కప్పు ఉన్నదన్న జ్ఞానం కలుగుచున్నది. ఇక్కడ, అక్కడ, ముందు, ప్రక్క, పైన అంటున్నాము అంటే ఈ అనుభవాలకు ముందే మనకు దేశజ్ఞానం ఉండాలి. లేనిపక్షంలో ఇక్కడ అక్కడ అన్న జ్ఞానం కలగటానికి వీలులేదు. కాబట్టి దేశం అనుభవంతో

కాని, అనుభవం అనంతరం కాని ఏర్పడటం లేదు. అనుభవానికి పరమందే, అంటే పూర్వమే దేశం ఉండాలి.

ఇలాగే ఆ పని ముందు జరిగింది. వాడు తరువాత వచ్చాడు. ఈ పనులు ఒకేసారి జరుగుతున్నవి అన్న జ్ఞానం కలుగుతున్నది. ఈ జ్ఞానం అనుభవానికి పరమైనది కాకపోతే ముందు, తరువాత ఏక కాలం మొదలైన జ్ఞానాలు సిద్ధించటానికి వీలు లేదు.

కాబట్టి దేశాకాలాలు అనుభవంకంటె పరమైనవి కాని అపరమైనవి కావు.

2. విషయాలనుంచి వేరుగా దేశకాలాలను ఎరుగవచ్చును కాని దేశకాలవిరహితంగా విషయాలను తెలిసికోలేము. కాబట్టి విషయాలకంటె దేశకాలాలు పరమైనవి.

(ఇక్కడ కాంట్ అభిప్రాయం, నిజంగా విషయాలను విడిచి కేవల దేశకాలాలను గ్రహించగలమని కాదు. విషయ శూన్యమైన దేశంకాని, కాలంకాని గోచరించదు. ఈ అంశం జ్ఞానస్వరూప విచారంలోని మరొక ప్రకరణంలో అతడు స్పష్టంగా పేర్కొన్నాడు.' శూన్యదేశం గోచరించదని మరొక రచనలో కూడా వివరించాడు. నిజానికి దేశకాలాలు గోచరించాలంటే దేశకాలగత విషయాలు గోచరించాలి. అయితే దేశకాల భావాలు మనకు కలగాలంటే దేశకాల గతములైన విషయాలు విగళితాలు కావాలని కాంటు అభిప్రాయమని ప్రొఫెసర్ పాటన్ వివరించాడు.)

3. దేశకాలాలు గోత్వాదులవలె జాతులు కావు. సమానప్రసవాత్మికమైన అనేక వ్యక్తులు ఉంటే వాటిని ఒకేజాతిగా పరిగణిస్తాము. దేశమనేది ఒకటే కాని అనేకాలు కావు. భిన్నదేశాలు దేశంలోని భాగాలు మాత్రమే కాని వేరుకావు. అలాగే కాలం కూడా ఏకమే. కాబట్టి దేశకాలాలు ఇంద్రియ వృత్తులే కాని చిత్తవృత్తులు కావు.

4. దేశకాలాలు అనంతాలు. భిన్నదేశాలు వాటి అంతర్భాగాలు. కాబట్టి జాతికీ వ్యక్తికీ ఉన్న సంబంధం దేశానికీ తదంతర్భాగాలకు కాని, కాలానికీ తదంతర్భాగాలకు కాని లేదు. కాగా దేశకాలాలు ఇంద్రియ వృత్తులే కాని చిత్తవృత్తులు కావు.

5. దేశం ఇంద్రియకతారూపం కాకపోతే రేఖాగణిత సూత్రాలు బాధితాలు కావాలి. ఉదాహరణకు త్రిభుజంయొక్క అంతరిక కోణాల మొత్తం రెండు సమకోణాలకు సమమన్న సూత్రం తీసుకొందాము. మనం ప్రపంచంలో ఇప్పుడున్న త్రిభుజ అంతరికకోణత్రయాలన్నీ కొలవలేదు. ఇకముందు వచ్చేవాటి నన్నిటినీ మనం కొలవలేదన్న సంగతి వేరే పేర్కొన నవసరంలేదు. అయినా ఏ త్రిభుజంలోనైనా ఆంతరికకోణాల మొత్తం రెండు సమకోణాలకు సమానంగానే ఉంటూంది. ఈ జ్ఞానం ఎలా కలుగుతున్నది? దేశం ద్రవ్యం కాని, తద్ధర్మంకాని కాక కేవలం ఇంద్రియకతారూపం కాబట్టి రేఖాగణితసూత్రాలు అబాధితాలు, సంభావ్యమానాలు అవుతున్నవి. అంటే కాలం అంతఃకరణవృత్తే కాకపోతే, గతి, పరిణామం మనకు బోధపడటానికే అవకాశంలేదు. వాటిని అర్థం చేసుకోవటమంటే ఒకేవస్తువునకు విరుద్ధగుణాలను భిన్న కాలంలో ఆపాదించటమే. గతపరిణామాల గ్రహణానికి కాలం సామాన్యోపాధి. ఈ ఉపాధి బుద్ధివల్ల ఏర్పడటంలేదు. కాబట్టి ఇది అంతఃకరణవృత్తి కావాలి.'

కాగా దేశకాలాలు ఇంద్రియ అంతఃకరణాల వృత్తులు. లేదా ఇంద్రియకతారూపాలు. అంతేకాని చిత్తవృత్తులు కావు. ఇది సిద్ధాంతమైతే బుద్ధీంద్రియ జన్యమైన అనుభవానికి సంబంధించినంతవరకు ఇవి యథార్థాలు. ఈ అనుభవాన్ని అధిగమించినప్పుడు ఇవి కేవలం మానసికభావాలు మాత్రమేకాని యథార్థాలు కావు. దీనినిబట్టి మనం వస్తువులను యథాతథంగా చూడటంలేదు.

మన ఇంద్రియాలు, అంతఃకరణం వస్తువులకు దేశకాలాలు ఆరోపించి చూపుతున్నవి. దేశకాలాగ్రస్తాలై వస్తువులు, విషయాలు, అవుతున్నవి. అందువల్ల వస్తువులు వేరు, విషయాలు వేరు. యథాస్వరూపంతో ఉన్నవి వస్తువులు. బుద్ధీంద్రియవృత్తి సమవచ్చిన్నవస్తువులు విషయాలు, మనకు గోచరిస్తున్న విషయాలే కాని యథాస్వరూపంలో ఉన్న వస్తువులు కావు. మరి వస్తువులకు, విషయాలకూ సంబంధమేమిటి? వస్తువులు యథార్థాలు. విషయాలు ఆభాసాలు. (*Appearances*) అంతమాత్రాన ఆభాసాలకు

వస్తువులు కారణాలనటానికి వీలులేదు. కారణకార్య భావం కాలాన్ని అపేక్షిస్తుంది. కాలం అంతఃకరణ వృత్తేకాని వస్తువు కాదు. వస్తుగుణంగూ కాదు. అందువల్ల విషయాలకు వస్తువులు కారణమని చెప్పలేము.

ఈవిధంగా రెండు ప్రపంచాలేర్పడుతున్నవి. ఒకటి, యథార్థ వస్తుప్రపంచం. రెండు ఆభాసికమైన విషయప్రపంచం. ఈ వాక్యానికి ముక్కకి ముక్కగా అర్థంచెప్పుకొని విభిన్నమైన రెండు ప్రపంచాలు వేరు వేరు చోట్ల వేరువేరుగా ఉన్నవని భావించరాదు. ఉన్నది ఒకటే ప్రపంచం. అది వస్తుప్రపంచం. ఆ ప్రపంచమే మనకు అనుభవగోచరమైనప్పుడు విషయప్రపంచం లేదా ఆభాసిక ప్రపంచం అవుతున్నది. ఇలా అన్నంతమాత్రాన మనకు గోచరిస్తున్న ప్రపంచం రజ్జుసర్పం స్వప్నతురగంలాంటి ప్రాతిభాసికమని భావించరాదు. భ్రాంతి తొలగితే సర్పం అంతరించి రజ్జువే కనిపిస్తుంది. జాగృతి ఏర్పడగానే స్వప్నతురగం మటుమాయమౌతుంది. ఈ విషయప్రపంచం అలా కాదు. జీవకోటి ఉన్నంతవరకూ బుద్ధి ఇంద్రియాలు ఉన్నంతవరకూ ఇది ఉంటూనే ఉంటుంది. వస్తుప్రపంచం వేరు, విషయప్రపంచం వేరు అన్న జ్ఞానం కలిగి, మననం చేసి తపించినా విషయప్రపంచం మాత్రమే గోచరిస్తుందితప్ప వస్తుప్రపంచం గోచరించదు.

ఆసంగతి అలా ఉంచి మరొక విశేషం గమనించవలసిఉంది. దేశకాలాలను విడదీసి దేశం బహిరింద్రియ వృత్తి అనీ, కాలం అంతరింద్రియవృత్తి అనీ కాంటు పేర్కొన్నాడు. ఇది విమర్శకులలో వివాదాలకు దారితీసింది. కాలం అంతఃకరణవృత్తి అవటంలో అర్థం లేకపోలేదు. మన మనోభావాలు కాలగతాలేకాని దేశగతాలుకావు. మన మనస్సు కాలంలో ఉన్నట్లు తెలుస్తున్నదే గాని దైశికవిస్తృతి ఉన్నట్లు ప్రత్యక్షంగా తెలియటంలేదు. రూపాదులు దేశగతాలని ప్రత్యక్షంగా తెలుస్తున్నది. మనస్సు దేశగతమని పరోక్షంగానైనా తెలియటానికి కారణం శరీరాకాశాన్ని (*Space*) మనస్సుకు ఆరోపించటమే.

ఇంతవరకూ బాగానేఉన్నది. దేశం బాహ్యేంద్రియవృత్తేకదా ? వేదనలను దేశంలో వ్యవస్థీకరించేది బాహ్యేంద్రియమేకదా ? అయినప్పుడు కొన్ని విషయాలు గుండ్రంగాను, మరికొన్ని నలుచదరంగాను, ఎందుకు కనిపిస్తున్నవి? ఈవిషయమై నిర్దిష్టంగా కాంటు ఏమీ చెప్పలేదు. కాని కొంతమంది వ్యాఖ్యాతలుమాత్రం మనస్స్వభావంవల్ల గుండ్రంగా నలుచదరంగా ఇలా నానాకారాలతో విషయాలు కనిపిస్తున్నవని అంటున్నారు.

“ఇది బాధ్యత గమనించనివాదం. ఇదే నిజమైతే వేదనలు దేశకాలాతీతాలని, కాంటు తాత్పర్యమైనట్లు చెప్పవలసివస్తుంది. వేదనలు దేశకాలాతీతాలు కావన్నప్పుడు పై వాదన నిలవదు. విషయ ఆకారాలలోని భేదం, ఇతర వ్యావహారిక గుణాలవలెనే విషయభిన్నమైన వస్తుస్వరూపప్రభావంవల్ల బాహ్యేంద్రియం ఆయా ఆకారాలను ఆపాదిస్తున్నది.”

అయితే మరొక సందేహం:—దేశకాలాలు మనః కల్పితాలు కదా ? నామనస్సు కల్పించే దేశకాలాలు, ఇతరుల మనస్సులు కల్పించే దేశకాలాలు ఒకటేనా ? నామనస్సు దేశకాలాలను కల్పిస్తున్నప్పుడు నాకు గోచరించే ఇతర మానవులు, వారి భావాలు ఆభాసాలుకావా? నా స్నేహితుడు నాతో మాట్లాడుతున్నాడంటే ఈసిద్ధాంతంప్రకారం నాదేశకాలాలు ఒకవిధంగా ఉండి, నా మిత్రుని దేశకాలాలు మరొకవిధంగా ఉండి అతడు చెప్పినదానిని నేను వినటానికి, నేను అడిగినదానికి అతడు సమాధానం చెప్పటానికి ఎలా అవకాశ మేర్పడుతున్నది ?

ఇతరుల అనుభవాలకు దేశకాలాలు ఉపాంగులన్న జ్ఞానం మనకు ఎలా కలుగుతున్నదో, అసలు అనుభవాలు పొందుతున్న ఇతర మానవు లున్నారని మనకు ఎలా తెలుస్తున్నదో కాంటు వివరించలేదు. కాని ఆ రెండూ ఉన్నవని మనం నిస్సందేహంగా భావించవచ్చును. ఇతరమానవు లున్నారన్న దృష్టితోనే మన కార్యకలాపాలు, భావాలు కొనసాగుతున్నవి. అందరికీ సామాన్యమైన విషయప్రపంచం ఒకటి ఉన్నదన్న బుద్ధితోనే మన ఆలోచనలు, శాస్త్రార్థవిచారం సాగుతున్నవి. కాంట్ సిద్ధాంతం ప్రకారం మన స్వ స్వరూపం మనకు తెలియదు. మన ఆభాసమాత్రమే మనకు తెలుసు. అలాగే ఇత

ఘులను ఆభాసాలుగా మాత్రమే మనం తెలుసుకో గలము. ఇతర మానవులనుగూర్చి, వారి అనుభవాలను గూర్చి మనకు కలుగుతున్న జ్ఞానవిషయమై కౌంట్ ప్రత్యేకచర్చ జరిపిఉండవలసినది. కాని అతడు ఆ పని చేయలేదు.

"విభిన్న మనస్సులకు ఒకే దేశకాలాలు ఉన్నవని మనకు ఎలా తెలుస్తున్నదని ప్రశ్నించవచ్చును... నాకు తెలిసినంతలో ఈ విషయాన్ని కౌంటు ప్రస్తావించలేదు. కాని ఒకటి మాత్రం నాకు బోధపడటం లేదు. ఇద్దరు మనుష్యులలో ప్రతిఒక్కడూ సాధర్మ్యమూ, అనంతత్వమూ కలిగిన దేశకాలాలను చూస్తున్నాడంటూనే వారి దేశకాలాలు విభిన్నాలంటే బోధపడటంలేదు. వివేచించటానికి వీలులేని వాటికి తాదాత్మ్యం చెప్పుకోవాలన్న సూత్రం ఇక్కడ వర్తిసుం దనుకొంటాను."

(సశేషము)

---

# నా మనసు

శ్రీ జూలూరి హనుమంతరావు

నీల నీలాంబరములోన నిండియున్న
ఛాయ, నా మనోగర్భ ప్రశాంతశక్తి;
నీల నీల్యాంబు నిధిలోన నిండియున్న
తీరు, నా మనోగర్భగంభీరపటిమ.
సరస పరిఫుల్లకంజాత సౌరభమ్ము,
నా మనోనిర్గతాయత నంగనమ్ము;
ప్రథిత కంకేళికా మకరందరసము,
కరఁగి ప్రవహించు మన్మనఃకరుణరసము.
బాలభానుని ముఖములోఁ బఱఁగుకళలు,
నా హృదంతర నిబిడితానంతకళలు
క్రమ్ము నవయామినీకేశ కాళరుచులు,
నా మనోవృత్త బహువేదనముల చెలులు.

నిత్య శీతలయుత హిమానీనదమ్ము,
పావనాంచిత మన్మనోభావలహరి;
భాను భానుప్రచండ తాపానలమ్ము,
అస్మదీయ మనఃక్రోధనాగ్నికీల.
బర్హిబర్హాక్ష చక్షుప్రభాసితములు,
మన్మనోజ్ఞానవికసిత మంగళములు;
ప్రకృతిసంసిద్ధ సర్వవిభ్రాజితములు,
మన్మనస్సిద్ధ సర్వసమ్మానితములు.

# పెండ్లోటపురము - మార్కండేయప్రభుడు

శ్రీ కొండూరి వీరరాఘవాచార్యులు

ఆంధ్రదేశ చరిత్రము మనకింకను సమగ్రముగా దెలియకున్నది. ఇందుకు కారణము పెక్కులగు శాసనములు చిక్కకుండుటయు, చిక్కినవానిని మనము చారిత్రక దృష్టితో బరిశీలింపకుండుటయు నని తలంపవచ్చును. మఱియు ననేకములగు కావ్య ప్రబంధములు పలువురు భూపాలురకంకితము చేయబడి వారి చరిత్రములతోబాటు దేశచరిత్రమును గూడ మనకందింపుచున్నవి. అట్టి కావ్యప్రబంధముల కృత్యవతరణికలను, కావ్యనాయకుల విషయములను గూడ మనము పరిశీలింపవలసి యున్నది. ఈ పరిశీలనలో నాకంటబడిన కొన్ని చరిత్రాంశములను పాఠకుల కెఱిగింప నుద్యమింతును.

అద్దంకి, కొండవీడు, ఉదయగిరి, బెల్లముకొండ, గురజాల, మాచర్ల, పెండ్లోట, పాటూరు, ధాన్యకటకము, శ్రీ కాకుళము, హంపి మున్నగు స్థలములు చరిత్ర ప్రసిద్ధములని మన మెఱుంగుదుము. కాని అందు కొన్నింటి చరిత్ర ప్రాముఖ్యము మాత్రము మనకే కొలదిపాటియో తెలిసియుండును. ఒక్కొక్క దాని విషయమై సమగ్రముగా తెలిసికొని స్థల పురాణమువంటి చరిత్రమును వ్రాయవలసిన యవసరమెంతేనియు గలదు. అట్టి చరిత్ర రచనము ఆంధ్రదేశ చరిత్రకర్తృత్వంతోపయోగియని వేఱుగా జెప్పనక్కఱలేదు. అద్దానిచే నాంధ్ర సారస్వతము సైతము ఆంగికముగ పరిపుష్టి నందగలదు.

కృష్ణాతీరమున వెలసిన ఆంధ్రరాజధానీ నగరములలో శ్రీ కాకుళము, ధాన్య కటకము, నాగార్జునకొండ, పెండ్లోట అనునవి ప్రముఖములైనవి. వానిలో పెండ్లోట చరిత్ర దక్క తక్కిన వాని యుదంతములు మనము కొంతవఱకెఱుంగుదుము. ఈ నాలుగు రాజధానులు ఆంధ్ర సామ్రాజ్య లక్ష్మికి క్రీడారంగములై యాంధ్రౌన్నత్యమును భూములు పట్టకుండ జేసినవి. పెండ్లోటను గూర్చి యీ వ్యాసమునందించుక పరిశీలింతము.

పెండ్లోట నగరమును బాలించిన ప్రభువరేణ్యులలో ధవళేశ్వరపు మార్కండేయ భూపాలుడొకడు. ఈతడు శా. శ. ౧౫౦౦ ప్రాంతమున నున్నాడు. క్రీ. శ. ౧౫౮౫ ప్రాంతమున నిజాం రాజ్యమును పాలన సేయుచున్న "మహమ్మద్ ఖులీకుతుబ్ శాహీ" కీర్తి శేషుడయ్యు నిలిచి నిజాం రాజ్య విస్తృతికి గూడ తోడ్పడినట్లు తెలియుచున్నది. మహమ్మద్ కుతుబ్ షాహి క్రీ. శ. ౧౫౮౦ నుండి ౧౬౧౧ వఱకు నద్భుతముగా రాజ్యము చేసియున్నాడు. ఈతని పూర్తిపేరు "ఖుదావంద ఆలమ్, ఓ ఆలమియాన్, హుజూర్ బందగానె ఆలీ, ముతాలీమద జిల్లహుల్, ఆలీ నూరుల్లాహూ, మగ్ ఖదహూ, జనాబ్ **మహమ్మద్ కులిఖుతుబ్ షా.** ఇందు "జనాబ్ మహమ్మద్ కులీ ఖుతుబ్ షా" అనునది నామమును, తక్కినది వంశాచారము గావచ్చు బిరుదావళియు నైయుండవచ్చును. ఈ తురుష్క ప్రభువరేణ్యుని దగ్గఱ మార్కండేయ ప్రభువు ప్రధాన మంత్రిగా నుండెనన్నాడని నాగర ఖండము నచ్చొత్తించిన శ్రీ రాయసపు పూర్ణయ్యగారు పీఠికలో వ్రాసియున్నారు.

ఈ మార్కండేయ ప్రభువు కవిపండిత పోషకుడు. ఇతడు తుర్కా రాజకవి, అయ్యంకి బాలసర

స్వతి, అను నిరువురుకవి వరేణ్యులను బోషించి వారిచే స్కాంద పురాణాం తర్గతమును నాగరఖండ మును దెలుగు చేయించి తానంకితమందెను. అందలికృతి నాయకుని వర్ణనాదులనుబట్టి పెందోట చరిత్రయు, కృతిపతి చరిత్రయు గొంతవఱకు దెల్లమగుచున్నది.

## పెం దో ట.

"పెందోట" గుంటూరు మండలమున గురిజాల తాలూకాలోని నాగార్జునిని కొండ కెనిమిది మైళ్ల దూరములో నున్నది. దీనికుత్తరమున కృష్ణానది ప్రవహించుచుండును. కృష్ణకుదక్షిణముఖమున నున్న దంతయును నైజాంరాజ్యము. పౌరాణికముగా జూచి నచో పెందోట చరిత్రము చాల ప్రాచీన మైనట్లు గన్పట్టుచున్నది. కాని చారిత్రక దృష్టినియ్యది క్రీస్తునకు పూర్వమైదారు వందల సంవత్సరముల నుండియు ప్రసిద్ధమైయొప్పు చున్నది. విశ్వకర్మపురాణములో పెందోట ప్రశంసకలదు. మయబ్రహ్మతన పుత్రియగు సంజ్ఞాదేవిని సూర్యునకిచ్చి వివాహము చేసినది మహావైభవోపేత మగునీనగరము సందేయుని విశ్వకర్మ పురాణము వర్ణించుచున్నది. ఈ విశ్వకర్మ పురాణమును తెనుగున వ్రాసినకవి గాయత్రీపీఠాధి పత్యమువహించి మించిన వీపూరివర వెంకటాచార్య గురుస్వాములు.

పెందోట వేదవేత్తలగు మహాశిల్పాచార్యుల కాలవాలమగు మహానగరమనియు, అచ్చటిశిల్పులే అమరావతీ నాగార్జున కొండలయందలి శిల్పములను, ఇంకను ఆంధ్ర, ఆంధ్రేతర ప్రాంతములందలి బౌద్ధ శిల్పములను దీర్చిదిద్దిరనియు ననుటకు జనప్రసిద్ధి యును ఆధారములును గలవు. మఱియు నాగార్జునుడు సైతమీ పెందోట వాడేయనియు, నందుచేతనే యాతడు తన్నమీపపు కొండనివాసముగా జేసికొని మహా విహారమును నెలయింపజేసె ననియును నూహింప బడుచున్నది. ఏదియెట్లున్నను పెందోటమాత్రము శిల్పులకు నివాస నగరమని యనుటకు పెక్కులా ధారములున్నవి.

సోమప్రభుని పుత్రుడగు మార్కండేయ ప్రభుని కాలమున పెందోట పెద్దకోటతోడను, క్రీడాపర్వత ములతోడను, బుడ్డనబావులతోడను, చక్కని రాజ వీథులతోడను నొప్పారుచున్నదట:—

సీ॥ కోటయే వీటికి మేటియై మిక్కిలి
  చూపట్టుచక్కని చుట్టుగట్టు,
క్రీడాద్రులేపురికిని సప్తకుల పర్వ
  తములను మేరుమందర నగములు,
బొడ్డన బావులే పుట భేదనంబున
  కమృతాబ్ధి ముఖ్య రత్నాకరములు,
రవిసోమవీథులే రాజధానికిఁ బ్రబసి
  ద్ధిగను నేబదియాఱు దేశములును,
గీ॥ పరగు నగునట్టి పెందోటపుర వరమున
  కధిపతి శిరోవతం సమైయులరె సకల
  కళల భవశేశ్వర పుర విఖ్యాతుఁడైన
  గురుతర యశోధనుండు మార్కండు ఘనుఁడు.

ఈ పెందోట నగరము పర్వత ప్రాంతమున నున్నది. చుట్టునున్న పర్వతములే పెట్టని కోటగోడలై యొప్పియుండవచ్చును. ఈ ప్రభుని కాలము నున్నగు నంశములనీది గువ పద్యము వ్యక్తము సేయుచున్నది.

సీ॥ శాలివాహనశక సంఖ్యాకములునగు
  పదియేసువందలపై నెనిమిది
వత్సరంబుల లోన వసుధా స్థలంబున
  "కుతుబ్ షాహీ" నిజాం కుతల నాగు
ప్రాభవవేళ మార్కండేయ భూపతి
  భవశేశ్వరాన్వయ భవుడునగు చు
సకల దిశావ్యాప్త సాంద్ర సుధాస్వచ్ఛ
  కీర్తి పరంపరా స్ఫూర్తి నలరి,
గీ॥ సురు చిరంబైన పెందోటపురిని నిలిచి
  విశ్వ కర్మాన్వయాంబుధి వలయఁజేసి
  సప్తసంతానము లఁగాంచి సానువృత్తి
  సుకవివర్యులు భళియని స్తుతు లొనర్ప
  ధరణి పాలింపుచుండెను ధర్మనిరతి.

పైపద్యమును బట్టి నైజామును బాలించిన "కుతుబ్ షాహీ" కాలమున మార్కండేయ ప్రభుడు మహాకీర్తిశాలియై సప్తసంతానములను నిలిపి సజ్జనా గ్రగణ్యుడై కవిపండిత కళావిదుల సంస్తుతులతో పెందోటను రాజధానిగాఁ జేసికొని ధరణిని పాలించి నట్లు తెలియుచున్నది. ఈతని పరిపాలనలో నెంత భూభాగమున్నదో తెలిసికొనుటకు సరియగు ప్రమా ణము లీగ్రంథమున నగపడుటలేదు. బహుశః కృష్ణా నది దక్షిణతీరమున నాగార్జునిని కొండవద్దనుండి

బెజవాడ వఱకును నితని పాలనములోనుండి యుండవచ్చును. ఈతని పూర్వులలో నైదవతరము వాడగు నీతని పెదతండ్రి బెజవాడను పాలించి "బెజవాడ ప్రభు" డని ప్రసిద్ధిగాంచినట్లు నాగరఖండము చెప్పుచున్నది. కావున బెజవాడ వఱకును వీరి రాజ్యమున్నదని తెలియుచున్నది. మహాశైవుడగు నతడు శ్రీశైలమున నేకాదశ శివలింగములను బ్రతిష్ఠించినాడట. దానింబట్టి మూడ శ్రీశైలమువఱకు గూడ నీ పెందోట రాజ్యము వ్యాపించి యున్నదేమో యనియు నూహింపవీలగుచున్నది. ఇప్పటి గుంటూరుమండలమంతయు నీతని పరిపాలనములో గొంతకాలముండి యుండవచ్చును. జనాబ్ మహమ్మద్ ఖులీకుతుబ్ శాహీతో నీతడు నెయ్యము నెఱపుటం బట్టి మూడ కృష్ణకావల నుత్తరము నందును నీప్రభుని రాజ్యము కొంతవఱకుండి యుండవచ్చునని తోచుచున్నది. కుతుబ్ శాహీకీత డెంతగా నండదండయై నిలిచెనో దిగువ పద్యమునుబట్టి తెల్లమయ్యెడిని —

"అతఁడు ప్రసిద్ధి వహించెఁ గా
క్షితి నరగజపతుల గెలిచి చెలగిజయశ్రీ
సతిఁ జేకొనిన మహమ్మద్
"కుతుబశహా" చంద్రునకును కుడిభుజమగుచున్."

కుతుబ్ షాహి పెక్కురు నరపతులను, గజపతులను గెలిచి జయలక్ష్మిని బొందినాడనియు, అట్టివానికీతడు కుడి భుజమై యొప్పినాడనియు ననుటచేత ఆయా యుద్ధములందీ మార్కండేయ ప్రభుడు కుతుబ్ షాహీకు దోడై నిర్వహించినట్లు స్పష్టమగుచున్నది. ఈ యంశము నే దిగువపద్య భాగమును స్పష్టము సేయుచున్నది. షష్ఠ్యంతములలో ని యీ పద్యపాదముంగనుడు—

"స్తంభదలంఘ్య నిజాజ్ఞా
స్తంభిత పరవంచకా హిత కళింగునకున్,"

ఇందలికళింగులు గజపతులే గదా! గజపతులను నిజాజ్ఞచే స్తంభింప జేసిన యీతడెంత పరాక్రమ శాలియో! ఇంకను:—

"కర్కశరిపు దుర్గమ నయ
తర్కార్జితవాంఛిత సముదాయునకు,శుభో..."

అనుటచేత శత్రుదుర్భేదమైన నీతిచేతను, తర్కముచేతను గూడ నీతడు తన జయవాంఛను సఫల మొనర్చుకొన్నట్లు తెలియుచున్నది. ఈ వాక్యముల చేత పరాక్రమమునందేకాక, మంత్రాంగమునందును, చతుర్విధోపాయములను బ్రయోగించుట యందును కూడ నీతడు దిట్టయని తెలియుచున్నది.

కుతుబ్ శాహీతో నీతడు మైత్రి నెరపి యాతనికి సాయపడుటచేత నీతని రాజ్యముగూడ నైజాములో కొంత యుండియుండవచ్చునని దోచుచున్నది. లేకున్న నాతినితో నేస్తము నెఱపి నరగజపతులను గెలుచుటలో నుపపత్తి కానరాదు. ఒకపక్షములో కుతుబ్ శాహీ కితడు సామంతుడో, లేక ప్రధాన మంత్రియో యైయుండవచ్చునను కొనుటకైనను, అట్టి ప్రస్తావన యీ కావ్యమునందెచ్చటను గానరాదు. పీఠికలో శ్రీపూర్ణయ్యగారు ఇట్లు వ్రాసిరో మంత్రియని విచారింపవలసియున్నది. కృతినాయకునింతగా వర్ణించిన నాగరఖండ కవులు సుప్రసిద్ధమగు నీవిషయము నెట్లు వర్ణింపకుందురు. కావున సామంతుడుగను, మంత్రిగను గాక సాటిరాజుగనే యీతడు ప్రకాశించినట్లూహింపవలయును.

మఱియు పెక్కురగు సామంతులచేతను, మంత్రి పుంగవులచేతను ఈతనిభవనమే పరివేష్టింపబడి యుండెడిదని దిగువ పద్యముగ్గడించుచున్నది.

ఉ॥ ఎంతని యెన్నవచ్చునవ
శేశ్వర సోమయ మారుకందు ధీ
మంతుని రాజ్యభారము, స
మగ్ర విభూతియు? సర్వమంత్రి సా
మంతుల యందలంబులె చ
మత్కృతి బారగ రేకు దీర్చిన
ట్లంతటనిండుఁ దద్గృహస
మావృతి సాలమలంకరించుచున్."

ఇట్లనేక మంత్రిసామంత బృందములచే సందడించు పెందోటరాజ్యము విస్తారమునగూడ గొప్పదెయై యుండును గాని కొద్దదిగాదు.

ఆనాటి పెందోటలో దండపాణీశ్వరస్వామి భక్తుల వాంఛితములను దీర్చుచుండెడు వాడు. ఆదండపాణియే మార్కండేయ ప్రభునకిలువేల్పు.

## మార్కండేయప్రభువు

ఈతడు విశ్వబ్రాహ్మణ వంశీయుడు. విశ్వజ్ఞ ఋషి గోత్రమున నుద్భవించినవాడు. మహాపరాక్రమ

శాలి, దాత, సకల సద్గుణ సంపన్నుడు. రాజ్యాంగమున సాటిలేని వాడు. మహా వీరశైవ శిఖామణి. పంచాక్షరీమంత్ర పారాయణపరాయణుడు. జంగమారాధన మీతనికి నిత్యవ్రతము. ఈ ప్రభువరేణ్యుని గుణశీలాదు లీ క్రింది విధమున వర్ణితములు :—

“సీ॥ ఏ వీరశైవున కిల వేల్పు చంద్రకో
టీరుండు దండపాణీశమూర్తి,
ఏ ధన్యమణి శిష్టసాధన జంగమా
రాధన నిత్యసద్వ్రత విశేష
మేవదాన్యునకు స్వాభావికాచారంబు
దేవబంధు ప్రతిష్ఠావిధాన,
మేజ్ఞానఘను నిరసజ్ఞానసుధార సా
యనము పంచాక్షరీ మనులలామ
గీ॥ మతడు పూర్వాది సకల దిగంతరాళ
వినుత “ఘన మేఘవాహన,” “కనకతుండ
లాభరణ” ముఖ్యబిరుదాంక లాభవైభ
వుండు ధవళేశపురపు మార్కొండ ఘనుడు.”

పూర్వాది సకల దిక్కులయందును వినుతిగాంచిన వాడనుటచేత నీత డెంతయో కీర్తిప్రతిష్ఠలతో వర్థిల్లె నని తెలియుచున్నది. “మేఘవాహన”, “కనకకుండ లాభరణ”, “జగద్గురు” అనునవి విశ్వకర్మ బ్రాహ్మణులకు వంశానుగతము లగు బిరుదములు. అందుకే దిగువ పద్యములో—

“స్తుత్య జగద్గురు బిరుదాం
కా త్యుజ్జ్వలలోక విశ్రుతౌన్నత్యనకుణ్...”

అని జగద్గురు బిరుదమునుగూర్చి కవులు పేర్కొన్నారు. మహాదాతయును, శివభక్తాగ్రగణ్యుడును నగు నీతడు దేశక్షేమమును, ప్రజాహితమును సాధింపగోరి యూరూరను చెఱువులు, బావులు త్రవ్వించియు ద్యానములను మఠములను నెలకొల్పి, పెక్కు లన్న సత్రములు పెట్టించినాఁడట :—

“శా॥ పారావారము మేరగా గలుగు భూ
భాగంబుపై నున్న యూ
రూరం గూపములుం, దటాకములు, ర
మ్యోద్యాన పంక్తుల్మఠా
గారంబుల్నిరతాన్న సత్రములు నా
కల్పంబుగా నిల్పె; నౌ
రౌరా! సోమయ మారుకండు ఘన పు
ణ్యం బెన్నగా శక్యమే!”

వీర శైవాగ్రగణ్యుడగు నీ మహారాజు శ్రీశైలములో నేకాదశ శివలింగములను బ్రతిష్ఠించెనట, రుద్రులు పదునొకండుగురు గావున ఏకాదశ లింగప్రతిష్ఠ నీతడు చేసి తన పాశుపతదీక్షను సార్థకము చేసికొని యుండవచ్చును.

“విశదముగ నిలిపె నేకా
దశ మార్కొండయ్య లింగధామములు నిరం
కుశ వృత్తిన్ శ్రీ గిరినా
శశి తారార్కముగ వీర శైవాగ్రణియై.”

లింగధామము లనుటచేత శివాలయములే నిర్మించినాడన్నమాట.

ఈతని కార్తజన రక్షాదక్షతయు, మిత్ర రక్షాదీక్షయు నాదిగాఁగల సుగుణములు పన్నతో బెట్టినవి—

“ఉ॥ ఏ యెడ నెయ్యురన్ వదలఁ,
డేమరఁ డార్త జనైక రక్ష, వి
ద్యాయతనంబు, ధైర్యమున
కాకర, మార్య జనంబు కోరిరాఁ
జేయు పరోపకారియు, వి
శిష్ట చరిత్రు, డుదార ధీర లీ
లాయుతి మారుకొండు ఘనుఁ
డమ్మహిమేటికి సాటిలే రిలన్.”

ఈ ప్రభు డింకను “దండపాణి శంభుపాద తత్పరైక మానసు” డనియును, నిత్య ప్రధితాన్నదాన కలశా సంకల్పు” డనియును, నానామనీషికృతానేక ఘన ప్రబంధవిభవ శ్రీధాముఁ డ”నియును, ఆశీతాచల సేతు మధ్య భరితోద్యద్ధర్ముఁ డ”నియును, నిజ కుల రక్షా మహామోద్దండుఁ” డనియును, విద్యానవద్య హృద్య విద్వజ్జనానీకహితకరుడనియును, నానా ప్రకారములఁ గొండాడఁబడినాఁడు. ఇతడు బ్రాహ్మణులకును విశ్వబ్రాహ్మణులకును పెక్కగ్రహారముల నిచ్చి పోషించి వారి యజ్ఞయాగాదులు నిర్విఘ్నము లగునట్లు చేసినాఁ డని దిగువపద్య ముగ్గడించుచున్నది—

సీ॥ పందోటపుర వరమందుఁ గాపుర ముండు
విశ్వకర్మావనీ విబుధవరులు
శ్రీమారుకొండు ధరిత్రీ వరాగ్ర ప్ర
గణ్య ప్రదత్త విఖ్యాతములగు
నగ్రహారాది సమగ్ర సుస్వాస్థ్యాది
కములు గల్గుటచేత కలిమిగాంచి

వేద శాస్త్రాదిక విద్యలు చదివి ది
వ్యజ్ఞాన సంపత్తి నతిశయిల్లి
సకల యజ్ఞంబుల సరవితో గావించి
నిత్యాగ్నిహోత్రులై నెగడుచుండి
గీ॥ సుర పితామహునిని, శతాధ్వరుని, గురుని
ధిక్కరించియు నిరత వితీర్ణ మహిమ
ధైర్యమున వారి దాద్రులఁ దలఁకునటుల
చేసి బ్రహ్మణ్యులైరి యీ స్థిరను స్థిరత."

మార్కండేయప్రభునకు వేదశాస్త్రాది విద్యలయందును, యజ్ఞ యాగాది క్రతుకర్మలయందును నింత యాదర మున్నదని చెప్పుటచే నీతని వీరశైవము పాషండ ప్రాయము గాక, వైదిక ధర్మాను గతమై, బ్రాహ్మణప్రీతి భాజనమైన దని తెలియుచున్నది.

విశ్వజ్ఞసగోత్రు డగు నీ మహారాజు మహాదాత, పరాక్రమశాలి, వీరశైవ శిఖామణి, వేదధర్మ రక్షకుడు, సప్త సంతానముల నెలకొల్పిన మనీషి, కవి. పండిత, శిల్పి, జన పోషకుడు, మహా ధర్మమూర్తి, ప్రజాశ్రేయస్సు నొడగూర్చు నుత్తమ పాలకుడుగా ప్రకాశించి జంబూద్వీప జనములలో నుద్దండుడయి వఱలినాఁడు—

"శ్రీ పెందోట పురాధిప
భూపతి జనవశ్యదృశ్య పుణ్య చరిత్రో
ద్దీపితవైభవ "జంబూ
ద్వీపజనోద్దండ సోమవిభు మార్కండా!"

"ప్రాజ్ఞలోక కల్పభూజ, భాగ్యరాజరాజ, వి
శ్వజ్ఞగోత్ర సత్పవిత్ర, వైభవారి గోత్ర, భా
వజ్ఞ మంత్రి వర్గనిత్య వర్ణనీయ సద్గుణా,
క్షిజ్ఞరాజ పూజ్య, కుంతభిన్న యోగ శేఖరా!"

ఇతడు భావజ్ఞులగు మంత్రులచే నెన్నదగిన సుగుణములు కలవాడనుటచేత నీతని మంత్రాలోచనా పటిమము సూచితమగుచున్నది. "అక్షిజ్ఞరాజపూజ్య" డనుటచేత నానా రాజులలో నీతనికి గల గౌరవము వ్యక్తమగుచున్నది. కాబట్టి యీతడు "ఖులీకుతుబ్ శాహీ" కిమిత్రరాజై యాతని మన్ననలనంది వానికి చేదోడు వాదోడుగా మెలగినాడనుట స్పష్టమగుచున్నది. ఈతడింత పరోపకార పరాయణుడై నను మానవ సహజమైన స్వకులాభిమానమీతనికిని గలదు—

"ఘనాఘనాతిదాన, దీనకల్పభూజ, లోకరం
జనా, జనామ విశ్వకర్మ సంతతి ప్రసిద్ధిగా
వనా, వనాతి శక్తి యుక్తి భాగ్యయోగ్య ధర్మయో
జనా, జనాభిగమ్యరమ్య సద్గుణైక భూషణా!"

సమకాలీనులగు నాగరఖండ కవులొనర్చినవై వర్ణనలు మార్కండేయ ప్రభుని విషయమును గొంత వఱకుమాత్రమే స్పష్టపఱచుచున్నవి. ఆతని చరిత్రో

విశ్వజ్ఞఋషి (గోత్రక)
|
వీరయప్రభువు, భార్య-గంగమ్మ
|
1. బెజవాడ ప్రభుడు. 2. పర్వతాచార్యుడు. 3. బత్తెన. 4. రామయప్రభుడు. 5. గోపాచార్యుడు.
|
(4. రామయప్రభుడు →) సోమవిభుడు, భార్య-వీరాంబ
|
కేదారవిభుడు, భార్య-కన్నమ్మ
|
1. పెదలింగన. 2. చినలింగన. 3. సోమవిభుడు. 4. వీరసుకృతి.
భార్య-పెద్దమాంబ.
|
1. మార్కండేయ ప్రభుడు. 2. కేదారాచార్యుడు. 3. దండపాణి
నాగరఖండ కృతిభర్త

దంతము లింకను శాసనాదులయందు దేమైన నగపడు నేమో చూడవలసియున్నది.

## పెందోట ప్రభువులు

నాగరఖండములో కృతి నాయకుని వంశావతారమును వర్ణించుపట్టున మార్కండేయప్రభుని పైదారు తరముల పూర్వులు వర్ణింపబడి యున్నారు. వారందఱును పెందోటను పాలించి వాసికెక్కినవారే. దొరకినంత వఱకు వంశవృక్షమును పైన పొందుపఱచితిని.

ఈ మార్కండేయ ప్రభునకు ముగ్గురు భార్యలు. పెద్దభార్యయగు వీరమ్మయందు బచ్చారాయుడు జన్మించినాడు. రెండవసతి విస్సమాంబయందు చంద్రశేఖరుడు, చంద్రశేఖరమ్మయు బుట్టిరి. మూడవభార్య గురవమ్మకు సంతున్నట్లు వర్ణింప బడలేదు. మార్కండేయుని పిమ్మట బచ్చారాయుడు పెందోటపాలకుడై యుండవచ్చును. అతని భార్య బుచ్చమ్మ.

వీరయప్రభుని యొద్దనుండి మార్కండేయ ప్రభుని వఱకు నాలుతరములు. మార్కండేయ ప్రభుని రాజ్యకాలము క్రీ. శ. ౧౫౮౦ నుండి ప్రారంభమాయెను. అంతకు పూర్వపుటైదు తరముల వారికిని నలుబదేసి సంవత్సరములుగా కాలమును దగ్గించుచు వచ్చిన ౧౫౮౧ కి ౨౦౦ సంవత్సరములు పూర్వము నుండియే పెందోటలో ధవళేశ్వరపువారియాధిపత్యము సాగుచున్నట్లు తెలియుచున్నది. అనగా నాగరఖండపుటాధారములను బట్టి క్రీ. శ. ౧౩౮౦ నాటికే పెందోటలో ధవళేశ్వరప్రభువుల పాలనము సాగుచున్నదని రుజువగుచున్నది. ఇంకెంతకాలము నుండి వీరు పెందోటను పాలించుచున్నారో, వీరిలో రెండవ తరమువాడగు బెజవాడ ప్రభువు బెజవాడ నివాసము గావించుకొనియు దేశము నేలినట్లు తెలియుచున్నది. మఱియు విజయవాడకు బెజవాడయను పేరు ౧౫౭౦ ప్రాంతము నాటికేయున్నదని నాగరఖండముచే వెల్లమయ్యెడి.

## రూపఱిన పెందోట

అతిప్రాచీన కాలమునుండియు మహావైభవ విలాసములతో వెలుగొందిన పెందోట ఎప్పుడు తన్నమైనదో తెలిసికొనుటకు సరియగు నాధారములగపడుటలేదు. పరిదాపు ౧౫౮౦ నుండి మార్కండేయ ప్రభుని పాలనములో నుండి, తరువాత నాతనికుమారుడగు బచ్చారాయని పాలనములోనికి వచ్చియుండవచ్చును. వీరిరువురి పరిపాలనకాలము నేబదిసంవత్సరములుగా లెక్కకట్టినను క్రీ. శ. ౧౬౨౦ కి తరువాత పెందోట చరిత్ర మగమ్యము. ఈనాడు పెందోట భయంకరారణ్యముతో నిండియున్నది. నాగార్జున కొండయాత్రికులు ఆ కొండపై నుండియే అచ్చటకు సాక్షాత్కరించుచున్న పెందోటనుగూర్చి చెప్పికొందురు. మాచర్లప్రాంతమున పెందోటనుగూర్చి మనము పెక్కుఉదంతకథలను వినగలము. ఇప్పుడా దండపాణీశుడు లేడు. ధవళేశ్వర ప్రభువులు లేరు. ఆ నగరరాజము లేదు. అంతయు పుడమిలో రూపఱినది. పురాతత్వశాఖవారు నాగార్జునకొండలోవలె నిక్కడ గూడ త్రవ్వటములు సాగించి వెదకినచో పెందోట ప్రాచీన చిహ్నములు దొరుకును, ఆంధ్రచరిత్ర నిర్మాణమున కిట్టి శిథిలనగరము గలస్థలములను తవ్వి వెదకు టెంతయు నవసరము. ఇట్లు పెందోట రూపఱిపోయి నప్పటికిని అచ్చటినుండి వలసవచ్చిన పెందోటవారు దేశమున పలువురున్నారు.

ఒకనాటి ఆంధ్రవిభవమును వర్ణించి చెప్పిన నాగరఖండ కృతికర్తలను గూర్చికొంత ప్రశంసించి యీ వ్యాసమును ముగింతును. తురగా రాజ కవి, అయ్యంకి బాలసరస్వతి అనునీ జంటకవులు ప్రబంధయుగపు కవీశ్వరులకేరికిని దీసిపోరు. వారభినవ కవితా భవులు, తమ్ముగూర్చి యిట్లు చెప్పికొన్నారు.

"అభినవ విశ్రుత కవితా
విభవులమఖిలాగమాంత విదశానకగో
త్రభవులము బుధవిధేయుల
మభవ పదాంభోజ బంభరాత్ములము మహిన్."

"రసికుడు తురగా రాజన,
యసమ ప్రతిభా విరాజి యయ్యంకిత బా
ల సరస్వతి యనువారల
ము సహిష్ణువ్రజ విదారణార్థులము మతిన్."

ఇట్టి వీరిని మార్కండేయప్రభువు పిలిచి కృతి రచింప బహుమానించినాడు—

"మము బిలిపించి చాల బహు
మాన మొనర్చి కవీంద్రులార! సాం

దమున మహా ప్రసిద్ధమగు
నాగర ఖండ మఖండ విశ్వక
ర్మము హితప్రభవాకరము
మాకు దెనుంగున నంకితంబుగా
రమణ ఘటింపగా దగు బు
రాణ విదుల్ మది రాణ మెచ్చ గాన్."

"అని కనకాంబరాభరణ
హార పటీర సుగంధ వీటికా
ద్యనుపమ పారితోషికము
లర్థి నొసంగ బోసంగ బొంగి కై
కొని కృతికంఠ మాలికను
గొబ్బున నాయక రత్న మబ్బె ప్రా
క్తన సుకృతంబుచే ననుమ
తత్కథ, బూనితి మే మొనర్పగన్."

ఇందును ఉదాత్తులగు కవులు గావున తగిన నాయక రత్నము దొరకినందుకు మురిసి కృతిమాలికను కైసేయం బూనినారట.

ఇట్లు ఈ నాగరఖండము - ఇందలి కృతి నాయకుని వర్ణనాదులతో గూడిన పెందోట చరిత్రము ఆంధ్ర దేశ చరిత్రమునకు సాయపడు నని తలంచెదను.

నాగరఖండకృతి శా. శ. ౧౫౦౮ కి సరియగు క్రీ. శ. ౧౫౮౫ ప్రాంతమునరచితమై త్ర్వభువన కంకితము జేయబడినట్లు కవులేస్వయముగా నుగ్గడించినారు. ఈ కవుల కావ్యరచనా ప్రతిభను గూర్చియు, నాగరఖండస్థ విషయమును, దానికి మూలమగు సంస్కృత నాగరఖండ విషయమును చరిత్రాంశ ప్రధానముగ నీవ్యాసమున జర్చింపవీలు గాదని విరమించుచున్నాను.



# మార్గణము

## (From the Eve of St, Agnes)

శ్రీ బ్రహ్మజోస్యుల శ్రీరామమూర్తి

ఆ జాబిల్లి వెలుంగువెల్లికల' కుయ్యాలించి 'రాకానిశా
రాజశ్రీసఖమైన మోమున బటాగ్రం బెత్తి' వేగమ్మునన్
రాజీవమ్ముగ జేసె చంద్రముఖమున్ లాస్యానుమోదాత్మయై
తేజంబుల్ ప్రసరించె జంద్రుడు కడున్ ధిక్కారముల్ సేయుచున్

వెన్నెల గోలుపోయి యరవిందపదం బగు నట్టి మోమునం
దున్నొకభంగి దోచెడు మధువ్రత వర్గ మదెల్ల సర్వసం
భిన్న నిజాంగవర్గక నిషేవితులై మును 'పార్స్ఫరో' ప్రసం
పన్నని గుట్టుజూచె పరివర్తిత సోన్నమితోపభోగ్యతన్

మును 'నాసేటను' గొన్న విందు పగిదిం బాల్పారుచుండంగ న
య్యెను నీ'పార్స్ఫరో' "మేడలీనుల" సుబర్హీభూత మార్గమ్ములన్
ఘనుడే యానిక పార్స్ఫరోవరుడు వ్యాఖ్యానించి "మూఢమ్మ, ఈ
వును" గుర్తించెడు దోషమేమియును సంభూతమ్ము కాకుండుటన్

వాసన చూచి చూచి నవవారిజగంధము నెల్ల గాలికిం
దోసిలి యొగ్గజూచెడు మధువ్రతిబోలను నాతఁడున్ సము
ద్భాసితమైన పుప్పొడుల వాసనలన్నిటితోడ శోషితా
బ్జాసన పీతపద్మమగు భారముమై వహియింప జూచుచున్

చెందొవ చిందులాడు నును చెక్కు పసందులు రేకరేకలం
గ్రందుకొనంగ ఝంకృతివికారములన్ విసిగించి పద్మని
ష్యంద మరందబిందు రుచిరాన్వితమై తన రారు మార్గణం
బుం దలపోసె భూరిపరిపోషిత హాస్యరసానుమోదితిన్.

---

కథానిక:

# తారాబలం

శ్రీ వెంపటి సచ్చిదానందశర్మ

నక్షత్ర మండలాన్నుంచి ఆ చుక్క — "మహాఁ... పోతానంటావు, ఎక్కడికి? గట్టిగామాట్లాడితే, నీకు 'నా' అనే వాళ్ళెవళ్ళన్నా ఉన్నారూ?" అని నిలవేసి అడిగితే, ఈ చంద్రుడు సమయస్ఫూర్తి కోసమన్నా కొంచెం చెంగాలు ఫిరాయించి నీ లెక్ఖేమిటి? మాపట్టు మేరంతా — నా — నాదే" — అని ఉండాల్సింది.

ఇంతకీ, ఘనమనే, శ్రీలేఖ, అలా అననూ లేదు; ఆమె అలా అనకపోయినా తనీమాటలు అని ఉండాల్సిందన్న విషయం వెంకట్రావుకి స్ఫురించనూ లేదు. ఇది తల్చుకున్నప్పుడల్లా హరినారాయణ పొట్ట చేత్తో పుచ్చుకుని ఎడ్డేవాకి పడతాడు. అంతేకాదు — మీరుకనిపించా గంటేచాలు, ఈ కథంతా మళ్ళీ ఒకసారి తిరిగెయ్యందే వాణ్ణి మీరు వదుల్చుకోలేరు.

ఈ రసాభాసకోస మన్నట్టు, గతసోమవారం సంజచీకట్లో పార్కులో ఒక బెంచీ తగదిచేసుకుని వెన్ను వాల్చాడు వెంకట్రావు. ప్రక్కనున్న హోటలు రోజూ పెట్టే పిడికె డన్నంతోపాటు హరివాసర ముంచి బలవంతానపరవ్వంత ఘ్రాణ్యముంటగట్టింది. రేడియో వదుల్తున్న విషాదగీతం వెంకట్రావు గూబలకి వడగాలిలాగా తగుల్తోంది. తనకు స్వతస్సిద్ధమైన కూనిరాగం కూడా తీసే ఓపిక లేని వెంకట్రావు సిగరెట్టు కోసమని జేబు తడుముకుంటున్నాడు పనుకునే. దాని అంతుదొరక్క, అప్పుడేకొన్న పెట్టెడు సిగరెట్లూ ఎటు మాయమయినయ్యాని కలవరపడుతున్న సమయంలో బల్లకిందనించి పెట్టెతీసి అందిస్తూ హరినారాయణ చాలా నాటకోచితంగా ప్రత్యక్షమయాడు.

తనాస్థితిలో హరినారాయణ్ణి ఎదుర్కోవలసి వచ్చేసరికి ఎక్కడలేని లజ్జఅనిపించింది వెంకట్రావుకి. ఒక విధంగా కోపంకూడా వచ్చింది వాడిమీద. తను — ఇదిచేస్తున్నాను అని చెప్పగల సమయం వచ్చేదాకా — మన అన్న వాళ్ళకళ్ళ పడకూడదని వెంకట్రావు తప్పుకు, తప్పుకు తిరుగుతున్నాడు.

అందులోనూ — హరినారాయణ కీకుగా నవ్వుమని సెంటు పొగలుగక్కుతున్నాడు! వెంకట్రావుకి వెక్కిరించి నట్లయింది. "ఇక్కడి కెలావచ్చావురా! నేనిక్కడున్నట్టు నీ కెలా తెలిసిందే?" అన్నాడు తడబడుతూ.

వెంకట్రావడిగిన మొదటి ప్రశ్నకి సమాధానం చెప్పకుండా "నీ శ్రేయోభిలాష ఆపాటి మాకుండాలే గాని నువ్వెక్కడుండీ కనుక్కోలేక పోతామూ?" అన్నాడు — హరినారాయణ ఈ మధ్య తననితాను బహువచనంలో తప్పితే సంబోధించుకోవటం లేదని వెంకట్రావు తరవాత, తరవాత గ్రహించాడు.

వెంకట్రావలాగే ముణగదీసుక్కూర్చునేసరికి "భోజనాది కాలయ్యాయా?" అన్నాడు హరినారాయణ.

"ఊఁ..." ఆకలికడుపుతో మూలిగాడు వెంకట్రావు.

"మరినిద్రెక్కడ?"

వెంకట్రావుకి పళ్ళుమండింది. హరినారాయణ తన్నిలా ఎందుకు బాధపెడతాడు? "ఎక్కడైనా కావచ్చు!" అన్నాడు ఫెళ్ళున.

"అంటే?"

"అంటే... ఈ బెంచీమీదనన్నా కావచ్చు; ఆపాకలో నన్నా కావచ్చు!" తిక్క కుదిరిందను కున్నాడు వెంకట్రావు.

"పోనీ, ఆ మేడలోనన్నా కావచ్చుగా?" అన్నాడు హరినారాయణ మళ్ళీ.

"ఐతే కానూవచ్చు" అన్నాడు వెంకట్రావు అటువైపు చూసి.

"మరైతే పోదాంపద... ఈ చలి గాడ్పుల్లో — జలుబు లంకించుకుంటే ఓపట్టానవదల్దురా, నాతండ్రీ! అసలే ముసముసలాడుతూ ఉంటావు" హరినారాయణ తన్ని ఎత్తిచంకనేసు కుంటాడేమో ననిపించింది వెంకట్రావుకి. ఊళ్ళో ఉండగా నాటకం కంపెనీలని లేవదీసి తను చెడి ఇతర్లని చెడగొట్టినం

డుకు హరినారాయణకి కొద్దిపాటి అభినయం అబ్బింది. ఫరవాలేదని సంతోషించాడు వెంకట్రావు.

తరవాత హరినారాయణ ఎంతసేపు మాట్లాడినా వెంకట్రావుని ఆ మేడలోకిపోయి నిద్రపోదాం రమ్మంటాడు! వాడి తరహా చూస్తే మహా చిరాకనిపించింది వెంకట్రావుకి. నవ్వులాటకైనా అంటే, అది నవ్వులాట కంటున్న సూచన, దానికొక హద్దూ పద్దూ ఉంటుంది. విని, విని తలనొప్పొచ్చి, "ఆ మేడెవరిదో కనీసం తెలియనన్నా తెలుసా, నీకు?" అన్నాడు వెంకట్రావు.

"ఎవరిదైతే మనకేం ... వెళ్ళి, ముందు మన మెవళ్ళమో తెలియజెప్పుకుందాం" అన్నాడు వాడి సహజమైన తలతిక్క ధోరణిలో.

"ఏమని?" అన్నాడు వెంకట్రావు విసుగ్గా.

"తేవిణీ వేసి, అభ్యాగతులమని!"

ఇంకా హరినారాయణతో మాట్లాడటమల్లా వాణ్ణింకా రెచ్చగొట్టటమే కాని మరేమీ ప్రయోజనముండదనుకున్నాడు వెంకట్రావు. తలతిక్క సంభాషణలు చెయ్యటంలో హరినారాయణ అప్పుడూ ఇప్పుడూ కూడా ఒకేమాదిరిగా ఉన్నాడని కూడా అనుకున్నాడు వెంకట్రావు. ఆ మేడ, తారామణి—ముక్కోటి ఆంధ్రుల ముద్దుగుమ్మ—శ్రీలేఖదని హరినారాయణకి మాత్రం తెలీదని వెంకట్రావు ఎలా అనుకుంటాడు? నిజానికి, ఆ మేడలోకి ప్రవేశం ఎలా దొరుకుతుందా అని తనింతవరకు పడిగాపులు పడి ఉన్నానన్న విషయంకూడా జ్ఞప్తికి వచ్చింది వెంకట్రావుకి.

"అబ్బ! లేరా...పోదాం" అన్నాడు మళ్ళీ హరినారాయణ ఆవలించి, మత్తుగా, విసుగ్గా.

"ఎక్కడికిరా?" ఒక్క అరుపు అరిచాడు వెంకట్రావు. మళ్ళీ ఒకక్షణం తరవాత "ఆ మేడెవరిదో నీకేమన్నా తెలుసా!" అన్నాడు తనకి తెలుసునన్నట్టు:

"ఎవరిది?" అన్నాడు హరినారాయణ తనకి తెలీదన్నట్టు.

"శ్రీలేఖది!"

"శ్రీలేఖ ఎవరో తెలుసా?"

"మన ధనం!"

ఇలా—సందేహ నివృత్తిచెయ్యి, మహాశయా!—అన్నట్టు పెద్దరిక మిచ్చి హరినారాయణ్ణి కూర్చోపెట్టాలేగాని, ఏవిషయాన్ని గురించిన పుట్టు పూర్వోత్తరాలైనా బైటికీడ్చి కాని ఊరుకోడు. "ఇహ మనకి దిగులేలేదు. చెప్పుల్లో కాళ్లు పెట్టు! నీసంగీత మేదో అక్కరకొచ్చే ఘడియొచ్చింది. నాకు తెలుసు పుంజు కూత కొక్కుతుందని..." ఇలా ఒకే విషయాన్ని విపరీతమైన ఫక్కీలో అదేపనిగా చెప్పటం మొదలుపెట్టేసరికి హరినారాయణ మంచితనాన్ని గురించి వెంకట్రావులో లక్ష కుశ్శంకలు బయలుదేరాయి.

"నేను రాను" అని, వెంటనే, మళ్ళీ హరినారాయణ అడ్డదిడ్డ ప్రశ్నలకి ఆస్కారంలేకండా, "ఒరే, అబ్బీ! నిజం చెపుతున్నాను—నాకు సంగీతంలో మంచి ప్రవేశం ఉంది. మీ సినిమాల్లో నాకేదన్నా రవ్వంత అవకాశ మిప్పించమ్మా—అని అడుగుదామనే తంటాలు పడుతున్నాను...నువ్వు నన్ను వదిలెయ్యి, నీకు పుణ్యముంటుంది" అన్నాడు వెంకట్రావు.

"అహా మళ్ళీ అదేమాట!... మరిన్ని ఊహాలు కడుపులో పెట్టుకుని ఇక్కడ పడుకుంటే ఏంలాభం చెప్పు, మేడలోంచి వచ్చేపోయే వాళ్లని లెక్క పెడుతూ. వెళ్ళే నాయనా లే! నేనావిణ్ణెరుగున్నాను, నీకు పరిచయం చేస్తాను, పద..." అన్నాడు హరినారాయణ ఒక్కసుక్కలో.

"నీ పరిచయానికీ, నీకూ పదివేల నమస్కారాలు ఆవిడ మన ఊరునుంచి లేచి వచ్చినప్పుడు మనకు జరిగిన రాద్ధాంతమంతా ఆవిడముందు తిరగతోడకుండాఉంటేవా, అదే పదివేలు!" అన్నాడు వెంకట్రావు, ఒకరకంగా ప్రాధేయ పడుతున్నట్టు.

"ఎంతమాట! నడు... ఇలా మనవాడు, మంచి సంగీత విద్వత్తుంది. సినిమాఉద్యోగంకోసం వచ్చాడు అని చెప్పటంకంటె, నోరెత్తితే నాలిక తెగ్గొయ్యి!" అన్నాడు నమ్మమన్నట్టు.

వెంకట్రావుకూడా నమ్మక తప్పింది కాదు. ఇద్దరూ గేటుదాటి లోపలికి నడుస్తున్నారు. పోర్టికోలో కారు వేచివుంది. వాళ్ళిద్దరూ లోపలికి ప్రవేశించే సరికి హాండ్‌బ్యాగ్ గిరగిరా తిప్పుకుంటూ గుమ్మం మెట్లు రెండు గెంతుల్లో దిగి, ముందుచూసుకోకుండానే వాళ్ళిద్దర్నీ తాకే అంతదగ్గర్లోకి చరచరా వచ్చి కళ్ళెత్తి, ఆగి, నాలుగడుగులు వెనక్కి వేసి, "హల్లో! నమస్తే! రండి..." క్షణంపాటు నమస్కారముద్రపట్టి, టీ పాయ్‌చుట్టూ ఉన్న కుర్చీలు చూపించింది, శ్రీలేఖ.

హరినారాయణ మాట్లాడి పోతుండగానే, "రంగయ్యా... ఇప్పుడు సినిమాకివెళ్ళను. కారు షెడ్డులో పెట్టెయ్...వడితే తరవాత పోకివెడతాను!" అంది తనుకూడా కుర్చీలో జార్లపడుతూ.

సినిమాకి పోదామని అలా అలంకరించుకున్న ఆమెను చూసి పరిసరాల మార్పుతో మనిషి తరహాలో ఇంత మార్పు రావటానికి అవకాశముందా అని వెంకట్రావు తబ్బిబ్బవుతున్నాడు. కష్టమైనా, ఇష్టంలేక

పోయినా నువ్వీకాపరం వెళ్ళబెట్టాలిసిందే— అని శపించినట్టు నిర్దేశించబడ్డ ఒక స్త్రీ—తిరగబడి ఇంత దయిందంటే ఒక విధంగా మెచ్చుకోకుండా వెంక ట్రావుండలేక పోయాడు. మళ్ళీ వెంటనే, ఈ విడిలా తేచిరావటంలో తనకు తెలిసిపోని పాత్రఅంట గట్టి నందుకు హరినారాయణ తోబాటు ఈవిణ్ణికూడా తను తిట్టిన తిట్లన్నీ కూడా జ్ఞాపకంవచ్చినై.

ఇంతలో, హరినారాయణ శ్రీలేఖతో, "ఇతను నాస్నేహితుడు— వెంకట్రావని... మన ఊరి వాడే..." అంటూ ఇంకాతన సంగీతప్రావీణ్యాన్ని గురించి చెప్పకముందే పక్కున కిలకిలానవ్వి, అప్పుడే తెలుసుకున్నట్టు, "ఎవరికి? నాకేనా మీపరిచయ వాక్యాలు! ఇంకానయం! నేనే మీకాయన్ని పరి చయంచేస్తాను పట్టండి... వెంకట్రావుగారి ఆసరా వల్లనేగాదండీ.... నేను మాయింటి నరకంనించి బయటపడింది!" అంది అతనివైపు ఓరచూపులు చూసి ముసి ముసి నవ్వులు నవ్వుతూ,

వెంకట్రావు ఒక్కసారి ఉక్కిరిబిక్కిరయ్యాడు. నిజానికి, ఆమెతో తనకిదేమొదటి పరిచయం. అయినా, వెనక హరినారాయణ పుకారుపుట్టించి నట్టు, తననిలేవదీసుకు వచ్చింది నువ్వేనంటోంది వెంకట్రావుని... తనేదో పద్మవ్యూహంలో చిక్కు కున్నట్టనిపించింది వెంకట్రావుకి. శ్రీలేఖ హరినారా యణకన్న వకిలి మనిషి అనుకున్నాడు వెంకట్రావు.

"నాకు తెలీదుట్రా నీ సంగతి! లేని పోనిది పుట్టించానని పీకుక్కు తింటివే? పోనీ, చేసిందేదో మంచిపనే చేశావు!" అంటూ హరినారాయణ తీరిగ్గా అందుకున్నాడు.

"మనిషి విలువ తెలుసుకోలేనిచోట బతకటం కంటె చావటం చాలా మంచిది. అంతధైర్యంలేన ప్పుడు ఎక్కడికైనా తనదారితాను చూసుకోవటం మంచిది... నాకు తరవాత తెలిసిందిలెండి, నేవచ్చే శాక వాళ్ళెంత విచారపడ్డదీని...." శ్రీలేఖ, ఈసో త్కర్షచినేసరికి వెంకట్రావుకు ఒళ్ళుమండింది. ఆవిడ ఇంటిదగ్గరపడ్డ కష్టాలేమిటో నిజంగాతన కిప్పటికీ తేలి యదు.

వెంకట్రావు ఎంతవద్దను కుంటున్నా కథ మాత్రం వెనక్కి జరిగింది—

ఒకనాడు కంపెనీకొట్లో కూర్చుని నాటకం రిహార్సలుకి ముందు అంతా పిచ్చాపాటీ మాట్లాడు కుంటున్నారు.

"ఈ ఆడవేషాలతో వచ్చే చిక్కు ఇంతా అంతా కాదు. అసలు రిహార్సల్సుకి రావటమే అరుదు ...ఒకవేళ రావాలనుకున్నా...రత్నమ్మ చీర సింగా రించేసరికి పట్నంమాటుమణుగుతుంది..." కుర్చీలో కూర్చున్న పోజుతోబాటు గడ్డంకింద పోటీపెట్టిన చేతిని కూడా మార్చాడు ఆర్గనైజర్—హరో హరి నారాయణ.

"నెలబత్యాలింకా ముట్టలేదని ఆ రాధమ్మ ఏమన్నా అలిగిందేమో ఖర్మం?" కనితీరా అన్నాననుకున్నాడు, మొగవేషాలవేసరికి జీతం బత్యం అవసరం లేని వెట్టివాళ్లుగా భావిస్తారని గుర్రుగాఉన్న నారద వేషధారి.

ఈమాటతో హరినారాయణ స్టేజీ కృష్ణుడిపోజు లోనే చూశాడు కాని, డబ్బువిషయం గనక తను నోరెత్తి లాభంలేదని ఊరుకున్నాడు.

"రేపీపాటికల్లా తిప్పి మొహానకొడతామని చెప్పు...వెధవడబ్బు! కొస్త దానికంత గడ్డిలింటూం దేమిట్రా..." పక్కఇంట్లోనుంచి ఏడుపులు విన బడుతూ ఉండేసరికి ఇంకా ఏదో అనబోయినవాడు కాస్తా అలాగే ఉండిపోయాడు, ప్రస్తుతం తులాభారం నాటకాన్ని తెరవెనక తూస్తున్న వెంకట్రామయ్య.

హరినారాయణ మినహాగా అంతా మిడిసుడ్లు పెట్టి చెవులు రిక్కించి క్షణంసేపు నిశ్శబ్దంగా ఉన్నారు. హరినారాయణ మాత్రం ఈక్షణంసేపూ గలభాకి కారణమేమిటో దివ్యదృష్టితో చూస్తున్నట్లు తనకి సహజమైన పోజుపట్టి, "వాళ్లధనం పోయిం దిట..." అన్నాడు మామూలుగా.

"ఛా! పట్టపగలే!... నడిరోడ్డుమీది కొంప!" అన్నాడు వెంకట్రామయ్య నిర్ఘాంతపోయి.

"ఎంతలో కేమిటి? ఇలాటి వస్తు విక్కడున్న దని జాలు అందాలేగాని, ఎవరైనా ఎగరతన్నుకు పోతారు. అతల్లి ముందేమో "అబ్బాయ్! ధనముంది ట్రా అక్కడ?" అని నెత్తినోరెట్టుకుని అరిచినా అనుభవించే యోగ్యతలేని కొడుకువెధవకి తల్లిమాట లేమీ చెవికెక్కవి కావు. అట్టే కాపెట్టిఉన్న ఎవడో..." ఇలా మహానటుడు హరినారాయణ క్షేమలో సంభాషణ నడుపుగొస్తుంటే అంతా నోరు తెరుచుకు వింటున్నారు.

ఇంతలో, "పక్కింటివాళ్ల కోడలు, ధనం లేచి పోయింది టండోయ్!" అంటూ—సినిమాపేర్లుచూసి 'చంద్రమ్మ' కాస్తా ఒత్తుతీసేసి 'చంద్రమ' గాపేరు మార్చుకున్న రుక్మిణి పాత్ర ధారిణి తీరిగ్గా చోద్యం చూసొచ్చినట్టు ప్రవేశించి రసాభాస చేసింది.

ఐనా, హరినారాయణ తట్టుకుని, ఇంతవరకు తను మాట్లాడుతున్న బిగిలోనే, "ఇంతకీ నేను చెప్పా చ్చింది కూడా అదే! ఒక్కవిషయం ఆలోచించండి- నాకెక్కడన్నా మంచి ఆఫర్ వచ్చి... పోనీ, నేని క్కడ పొందతగ్గ అదనపు సదుపాయాలేమీ లేన

ప్పాడు, నేనీ కంపెనీ పట్టుకు ఎందుకు వేళ్లాడాలి చెప్పండి" అన్నాడు.

కంపెనీ అభిమాని, హార్మోనిస్టు ఆదిశేషయ్యకీ ఉపమానం ఏమీ బాగాలేదు. ధనం లేచిపోవటానికి ఇది ఏవిధంగా ఉపమాన మౌతుందో అస లెవళ్లకీ అర్థంకాలేదు.

"ఇంతకీ ఎవళ్లు తన్నుకుపోయారో!" అన్నాడు తబలిస్టు నరసింహారావు డగ్గా పైమూత విప్పుతూ.

"ఇంత ఆహారం ఇక్కడుందని ఈ కృష్ణుడికి తెలియక నే పోయెనే!"-విచారపడ్డాడు గ్రద్దముక్కు వెంకట్రామయ్య ఎకిలిగా.

"ఏం? మన వెంకట్రావుకి దక్కివుండ కూడదూ? కొద్దిపాటైన ప్రయత్నించి ఎవడి ఒళ్ళో నన్నా పడటానికి సిద్ధంగా దోరముగ్గిన పండురా, అది ...పంజరంలోచిలుక" అన్నాడు హరినారాయణ ఇద్దరికీ సమాధానంగా.

విన్నవాళ్ళంతా ఒక్కసారి ఉక్కిరి బిక్కిరయారు. హరినారాయణ తను కావాలనుకున్న విధంగా సంభాషణ నడుపుకొస్తున్నా డేమో—అతను చెపుతున్న విషయాలన్నిటికి తేలికగా పొంతనకుదరక —అందులో వెంకట్రావు ధనాన్ని లేవదీసుకు పోయాడంటే అసలేనమ్మలేక పోయారు. చివరికి నారదమహాముని లాటివాడే—"ఏమైనా అభమూ, శుభమూ ఎరుగని అమాయకపు సన్యాసి... వెంకట్రావు మాత్రం చేసుండే డీపని... చెయ్యలేడు కూడాను."

హరినారాయణ మళ్ళీ అందుకున్నాడు: "ఏం? అలా కనికరించావు వాణ్ణి? ఇవ్వాళ్ళవాడు బాపట్ల పోవాలని, ఎందుకంటే చెప్పకండా రెండురోజులు ముందు నుంచీ మోగుతుంటే కూడా నీ దివ్యదృష్టి ఎక్కడ తెలగలబడిందిరా నారదమహామునీ!" అంటూ వెళ్ళిపోదాంపద మన్నట్టు తను బయలుదేరాడు. వెంకట్రామయ్య "ఇవాల్టి రిహార్సిల్సు సత్యభామ పొట్టని పెట్టుకుంది" అంటూ తలుపు తాళం వేశాడు.

"వెంకట్రావు బాపట్లపోయింది పెళ్ళిచూపుల కటట్టా! ఈ విషయాన్ని మనకి చెప్పటానికి సిగ్గుపడి ఉంటాడట్టా" అన్నా రెవరో అక్కడికీ. ఐనా, ధనాన్ని లేవతీసుకుపోయింది వెంకట్రావేనని తన ప్రచారంమాత్రం హరినారాయణ మానలేదు. నిజానికి, ఈ విషయాన్ని గట్టిగా ఎవడూ నమ్మనూలేదు.

ఐతే, మూడురోజుల తరవాత— ధనం బాపట్లలో ఉందిట — అనేవార్తని సత్యభామ పాత్రధారిణికంపెనీ కొట్లోకి చేరవేసింది. దానితో ప్రతి వాడూ కనుబొమల ఎగరవేశాడు. "దూరదూరంగా ఉండి ఉండి భలేపనిచేశాడే... మనందర్నీ వెక్కిరించినట్టు... ఓరి పిడుగా!" అన్నాడు తబలిస్టు డగ్గానొకసారి ధమ్మనిపిచ్చినట్టు.

హరినారాయణ సమయానుకూలంగా ఈవిషయాన్ని గురించి అసలుమాట్లాడటమే మానేశాడు. వెంకట్రావు ఊళ్ళోకి వచ్చాడని తెలియగానే పని వేళాపోయి "కంపెనీకొట్టు పక్కింటివాళ్ళ ధనాన్ని లేవదీసుకు పోయావని మనవాళ్ళంతా అనుకుంటు న్నారు" అని కూడా చెప్పొచ్చాడు.

వెంకట్రావుకి అప్పుడే కాళ్ళనుంచి ఒణుకు ప్రారంభమైంది. ఇంట్లోనుంచి బయటికి రాకతీరదు. లోపలకూర్చుంటే లక్షఅనుమానాలు బయలుదేరుతై. హరినారాయణ ధర్మమాఅని, ఎవరుఎదురైనా వాడు వెయ్యబోయే ప్రశ్నలుకొంతవరకు తెలుస్తూనే ఉన్నై గనక వాటికి తగ్గసమాధానాలు ఏమిటని తీవ్రంగా ఆలోచించటం మొదలు పెట్టాడు.

రెండురోజుల కెలాగో మనసు రాయిచేసుకుని బిక్కుబిక్కు మంటూబైటి కొచ్చాడు కాని, అపూట వెంకట్రావు.ఎవరి కాసు పరీక్షనూ ఎదుర్కో వలసిన అవసరం లేకపోయింది. మర్నాడుఉదయమే హార్మోనిస్టు ఆదిశేషయ్య వచ్చి మేలుకొలుపు పాడాడు పళ్ళుతోమించి కాఫీకికూడా లాక్కుపోయాడు. ఉండపట్టలేక దార్లోనే ప్రస్తావన ప్రారంభించాడు. "ఎప్పుడొచ్చావురా బాపట్లనించి?" అంటూ.

"మొన్న"అన్నాడు వెంకట్రావు నువ్వు అడగ బోయే దంతా నాకు తెలుసు అన్నట్టు.

వెంకట్రావుచేత విషయమంతా ఎలా చెప్పించ టమని ఆలోచిస్తూ ఆదిశేషయ్య కొంచెంసేపు తటపటాయించాడు.

ఇంతలో ఇద్దరూ హోటలు చేరుకున్నారు. కాఫీతాగుతున్న వెంకట్రామయ్య పొద్దుబాగా గడుస్తుందన్నట్టు తను కూర్చున్నమూలకు వీళ్లిద్దరినీ పిలిచాడు."ఏరా,బాపట్లనించి ఎప్పుడొచ్చావ్ ప్రయాణం సవ్యంగానడిచి, వెళ్లినపని అయిందా?" అన్నాడు.

"ఏంపని?" అన్నాడు వెంకట్రావు తీవ్రంగా.

"నువ్వు బాపట్ల ఏపనిమీద వెళ్లావో, ఆపని!" అన్నాడు ఆదిశేషయ్య. వెంకట్రామయ్య వైపొక సారిచూసి.

"ఏదో పెళ్లిసంబంధమొస్తే చూచిరావటానికి వెళ్లాను ; పిల్ల నాకు బాగుల్లేదు" అన్నాడు వెంకట్రావు గింజుకుంటున్నట్టు.

"ఎలా బాగుంటుందిలే. రాణిని పతున్న కళ్లకి కాబోయే పెళ్లాన్ని చూస్తే మొత్తబుద్ధి వేసుంటుంది!" చెకిలిగా నవ్వాడు ఆదిశేషయ్య.

"ఏదో యవ్వన చాపల్యం, ప్రాణం పీకేఉండొచ్చు ... తప్పులేదు. మనలో మనకేమిటి చెప్పేయ్... ధనాన్ని ఇనప్పెట్టెలో పెట్టి తాళం వేసేచ్చావుగా?" అన్నాడు వెంకట్రామయ్య.

"ఇంకా ఎందుకురా, అలా పూసిపెడతావ్?" ఆదిశేషయ్య అంటున్నాడు.

వెంకట్రావుకి కళ్లనీళ్ల పర్యంతమయింది. పెద్ద పోట్లాటకి దిసతున్నంత రభస చెయ్యకుండా ఉండలేక పోయాడు అమాయకుడు! వ్యవహారం శ్రుతిమించి రాగానపడుతున్నదని ఆదిశేషయ్య భయపడి, "అసలీ గొడవంతా ముందు మాకు చెప్పింది, హరినారాయణ. ఇందులో పాపమెంతో పుణ్యమెంతో నీకు తెలియాలి; వాడికి తెలియాలి" అంటూ సర్ది చెప్పాడు.

హరినారాయణ ప్రవర్తన తల్చుకునేసరికి వెంకట్రావు కడుపు రగిలిపోయింది. కాని ప్రస్తుతానికి తను చేయగలిగిందేమీ లేదనుకుంటూ ఇల్లు చేరుకున్నాడు.

సాయంత్రం పార్కులో హరినారాయణ కనిపించాడు. కాళ్ళూచేతులు బారజాపి శవాసనం వేసి గడ్డిమీద పడుకుని, కళ్లు మూసుకుని, ఊపిరి బిగపట్టి ఉన్నాడు వెంకట్రావు సమీపించేసరికి "ఇంకా ఎవడికొంప తియ్యటానికిరా ఈ కొంగజపాలు? నిన్ను తగలెయ్య! ఇది నీకం పోయ్యే కాలం!...." ఫెళఫెళా కసి తీరా సుక్క అందినంతవరకు తిడుతూ చేస్తున్నాడు వెంకట్రావు.

కొద్దిక్షణాల తరవాత అప్పుడే ధ్యానముద్ర వదిలినట్టు, ఈ ప్రపంచంలోకి వస్తున్నట్టు కళ్ళు తెరిచాడు హరినారాయణ. ఈ చెకిలి వేషాలు తనని మభ్య పెట్టలేవన్నట్టు సూటిగా, "ఆ అమ్మాయిని లేవదీసుకు వెళ్లిగా నువ్వు చూశావా?" అన్నాడు వెంకట్రావు.

"తీసికెళ్ల లేదా?" అన్నాడు హరినారాయణ రెట్టిస్తూ.

"నే తీసికెళ్లానా?" అన్నాడు వెంకట్రావు.

"ఎందుకు తీసికెళ్లలా? నువ్వు తీసికెళ్లి ఉండాల్సింది. తీసికెళ్లకపోతే తీసికెళ్లు; తీసికెడితే చిక్కే లేదు..."

ఈ హరినారాయణ అడ్డగోలుధోరణి అంతం కాకుండా సాగిపోతుందని, "కొంపచెంబుల్లదగ్గిరంచుకుని మాట్లాడకురా!" అన్నాడు వెంకట్రావు ఇప్పటికైనా హరినారాయణ్ణి తనరీతిని మందలిద్దామని.

హరినారాయణ విసుగ్గా, "ఎంతసేపని దగ్గిరం చుకు చేదిరా పగవ వంటిని? కాస్సేపు నోటికివచ్చిందల్లా మాట్లాడనీ...స్కూలుపిల్లాడి కాంపోజిషన్లులాగా పూర్వాపరసంబంధాలు జ్ఞాపకముంచుకుంటూ మాట్లాడిమాట్లాడి తల చెడ్డది..." అంటూ సణగటం ప్రారంభించాడు.

"మరీఅంత అడ్డగోలువ్యవహారమైతే, నాకు నీ తల పగలగొట్టాలనుంది, కొట్టమంటావా?" అన్నాడు వెంకట్రావు కసిపట్టలేక.

"అది నీ చేతేమౌతుందిరా నాతండ్రీ!... తెగించి అంత చెడ్డపని నువ్వేం చెయ్యగలవురా... ధనానికింత దారిచూపావని పట్టెడు పెద్దరికం అంటగడితేనే ఇలా తబ్బిబ్బవుతుంటివి..."

హరినారాయణ్ణి ఏమనీ లాభం లేదని వెంకట్రావు కూర్చుని ధనాన్ని పట్టుకు చెడతిట్టటం ప్రారంభించాడు.

విని విని, చివరికి హరినారాయణ "ఎందుకలా ఆడిపోసుకుంటావు...కళ్లు పోతైరా...పెద్దవాళ్లని అన్నందుకు ఆపైన నాలిక కొరుక్కోవలసి రావచ్చును కూడా. కారణాంతరాలవల్ల బాపట్లలో ఒక చిన్న మకాంచేసి, మద్రాసుచేరి ధనమల్లా శ్రీలేఖగా మారి ఇప్పుడావిడ సినిమాల్లో నేరుగా హీరోయిన్నే అయికూర్చునేట్టుంది ... తమాయించుకో... నా మాటవిని తొందరపడకు. ఒకవ్యక్తిని అంతపైకి తీసికెళ్లానని సంతోషించుకోవటం కంటే, ఇంకేంకావాలిరా! మంచికాని, చెడుకాని ధైర్యంచేసి చేసి ఏపనీ చెయ్యలేని అర్భకుడివనీ, స్నేహితుడివికదా అనీ, ఈ ఖ్యాతిఅంతా నీకు ధారపోశాను..."

వెంకట్రావు అక్కడనుంచిలేచి వెళ్లిపోయాడు. తరవాత అసలు హరినారాయణ విషయమే వెంకట్రావుకి తెలీదు. మద్రాసులో వాడుకూడా ఉంటున్నాడని మాత్రం విన్నాడు. ఇప్పుడు తనుకూడా మద్రాసు రావటంతో తననింత రభసపెట్టటానికి వీలుగా హరినారాయణ శ్రీలేఖనిముందుగానే తయారుచేసి ఉంచాడని లోలోపల కుమిలిపోయాడు వెంకట్రావు.

శ్రీలేఖ, గతం మరిచిపోలేగ్గదన్నట్టు ఒకనవ్వు నవ్వి, రిస్టువాచి చూస్తూ, "పాతపురాణమంతా తిరగేశాం...బుజ్జి దిమ్మెక్కింది. పిక్చర్‌కిపోదాం రండి..." అంది కుర్చీలోనుంచిలేస్తూ.

వెంకట్రావు తననికాదన్నట్టు హరినారాయణ కోసం వెతుక్కోవటం మొదలుపెట్టాడు. బిక్కగా అటూ ఇటూ చూస్తూన్న వెంకట్రావుతో, "తల్లి చాటు పిల్లాడిలా అలా బెంబేలుపడతారేమండీ!... ఆయనలేందే మీరు రారేమిటి సినిమాకి?..." అంది కవ్విస్తున్నట్లు.

దార్లో మళ్లీ, "నే నే పరిస్థితుల్లో ఇల్లువదిలి వచ్చానో నిజంగా మీకు తెలీదు; మీకు తెలీకండా నే మీరు నన్నలా దూషించారని వినేసరికి నిజంగా నేను మీతో లేచివస్తే చాలా బాగుండేదనిపించిందండీ.." అంది!

హరినారాయణకంటె శ్రీలేఖ రెండాకులు ఎక్కువే చదివిందనుకున్నాడు వెంకట్రావు. వీళ్లిద్దరూ కలిసి తనపై పగతీర్చుకుంటున్నారేమోనని పించిందతనికి.

కేవలం అలా అని సినిమాలో కూర్చున్నంత సేపూ ముణగదీసుకు కూర్చున్నాడే కాని, ఆవిడలా కవ్విస్తూ మాట్లాడుతున్నప్పుడు "మీరింత పైకొచ్చారని చూశాక, మిమ్మల్ని ఇంటిదగ్గర కట్టిపడేస్తేనే బాగుండేదనిపిస్తోందండీ" అని కాని, అలాటి చమత్కారసంభాషణేమన్నా చేసివుంటే ఎంతబాగుండేది? ఊఁ...హు... అసలా ధోరణే లేదు వెట్టినాగన్నకి.

నిజంగా ఆవిడలో సమయస్ఫూర్తే ఉండివుంటే దానికి సమాధానంగా, "మీరుగనక తీసికెడతానంటే మళ్ళీ ఇంటికిపోదామని ఉందండీ" అనేదేమో!

అలా అనాలేగాని ఎంతచక్కటి సమాధానం చెప్పవచ్చు? అసలు సంభాషణ ఈ దారిపట్టందే! తనపుట్టిమునిగిపోయినట్టు ముణుచుకూర్చున్నాడు వెట్టి వెంకట్రావు.

దీనికి తగ్గట్టు శ్రీలేఖ ఎంతసేపూ హరినారాయణని పొగడటం మొదలుపెట్టింది. తను - ఊఁ-కొట్టక పోయినా ఆవిడచెపుతూ నేవుంది—మనిషిలో దాగున్న శక్తిసామర్థ్యాల్ని నిరూపించుకోటానికితగ అవకాశం కల్పించగలవాడనీ ... సినిమానుంచి వస్తుంటె దారిపొడుగునా ఇదేసొద! ఈ చిలకపలుకులన్నీ హరినారాయణ నేర్పినవేమోననుకున్నాడు వెంకట్రావు.

తనెవ్వరికీ చెందని ఒంటరిగాణ్ణనిపించింది వెంకట్రావుకి. కారులోనుంచి వట్టిగా రోడ్డుపక్కకి తొంగిచూడటం మొదలుపెట్టాడు.

"ఏం? ఇక్కడెక్కడున్నాదిగుతారా మీరు?" అంది శ్రీలేఖ.

వెంకట్రావు కొంచెం తడబడి, తెప్పరిల్లి, "కారండి ... హరినారాయణ రూంకి పోతాను." అన్నాడు.

తనతో కలిసివుంటున్న హరినారాయణకి వేరే బసంటూ లేదని తెలిసికూడా వెంకట్రావునలా నట్టేట వదిలేసిందంటే అతని మనస్తత్వాన్ని శ్రీలేఖ పూర్తిగా అపార్థంచేసుకుండనే చెప్పాలి.

ఎక్కడికిపోవాలో వెంకట్రావుకి గట్టిగా తెలీదు. ఇంతలో అదృష్టవశాత్తు హరినారాయణఎదురై "నీకోసమే వెతుక్కుంటూవస్తున్నా" అన్నాడు. ఎలాగో వీలుకల్పించుకుని, తను, శ్రీలేఖ కలిసి ఉంటున్నామని చెప్పి, దానితోబాటు, "కూడీకూడని ఆవిడ సంసారాన్ని కూలదోసి ఇంతవృద్ధిలోకి తెచ్చినందుకు నాకుదక్కిన పెద్దరికమి" దని తన సహజధోరణిలో అని ఆత్మసంతృప్తిపొందాడు.

తనతోకలిసి మేడలోకి రమ్మని హరినారాయణ ఎంతబతిమాలినా వెంకట్రావు రానన్నాడు. ఎక్కడికి వెడతావంటే మాట్లాడడు. చివరికి హరినారాయణ "దగ్గర్లోనే నా స్నేహితుడి గది ఒకటుంది ఈరాత్రికి అక్కడ నిద్రపో... తెల్లారి నేనొచ్చి కాఫీఉగ్గుపడతాను..." అన్నాడు.

"ఇక్కడెక్కడున్నాదిగుతారామీరు?" అని శ్రీలేఖ అడిగినప్పుడు దిక్కులేని పిల్లాడిలాగా "హరినారాయణ రూంకిపోతాను" అన్న వెంకట్రావు ఏనాటికీ మరచిపోలేడు... — 

# అధర్వణ వేదంలో

# లాక్షాపరిశ్రమ

★

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

కొన్ని చెట్లమీద, తీగలపైన, పొదలలోన నివసించుచు, వాటిరసము నాధారముగజేసికొని జీవించునది లక్క పురుగు. ఒక మిల్లిమీటరులో సగము పొడవున నెర్రగానుండి తన జీవితము నీ పురుగు ప్రారంభించును. వీనిలో ఆడుపురుగులు మిక్కిలి ఫలవంతములు. వీటినుంచి అనేక జీవకణములు బయలుదేరుచున్నవి. కొన్ని ఋతువులయందే ఇవి విజృంభించగలవు. అత్యుష్ణము, అతిహిమము, వెచ్చని గాడ్పులు వీటికి పనికి రావు.

లాక్షాక్రిమిని ఉద్దేశించి అథర్వ వేదమున పంచమ కాండములో ఐదవ సూక్తము కలదు. ఈ క్రిమిని యువతిగా భావించి అతిసుందరమైన భావగీతమున శాస్త్రవిషయములను ఇచ్చియున్నారు. ఈ సూక్తమును సాయనాచార్యులు వ్యాఖ్యానించలేదు.

"రాత్రీమాతా నభః పితార్యమా తే పితామహః
సిలాచీ నామవా అసి సా దేవా నామసిస్వసా." ౧.

ఈలక్క పురుగును సిలాచీ అని పిలచుచున్నారు. సిలాచీ అనగా ఎఱ్ఱగానుండు మనిశ్శిలాధాతువు. ఈ ధాతువును తినునదియగుటచే సిలాచీ అని పేరు పొందినది. పైప్పలాద సంహితలో "శిలాదీ" అని స్పష్టముగా నీ పేరీయబడినది. మనశ్శిలాధాతువు వలె నెఱ్ఱగా ఉండుటచేత నాధాతువును తినునది యని ఉత్ప్రేక్షింపబడినది. ఈ సిలాచీకి తల్లి రాత్రి, మేఘము తండ్రి, సౌమ్యప్రకాశముగల అర్యమణుడను సూర్యుడు తాత. మేఘాచ్ఛాదితమైన రాత్రివేళగల శీతోష్ణ పరిమాణము, అనగా చలికాలమందలి పగటి వేడిమి మాత్రమే ఇది వృద్ధిపొందుటకు కావలసిన సహకారులు. ఇట్టి సిలాచీ దేవతల సహోదరి. లక్క అత్యంత మవసరమైన వస్తువగుటచే నీరీతిగా ప్రస్తుతించబడినది.

"యస్త్వా పిబతి జీవతి త్రాయసే పురుషంత్వమ్
భర్త్రీ హి శశ్వతామసి జనానాంచ న్యఞ్చనీ," ౨.

లక్కతో చేయబడిన కషాయమౌషధమువంటిది అని సంప్రదాయము. ఈకషాయము నెవరుత్రాగుదురో అట్టి పురుషుని లక్క రక్షించుచున్నదట. కావుననే లక్కను పోషకురాలని "భర్త్రీ" శబ్దముతో నుద్దేశించినారు. సర్వజనరక్షకి యగుటచే తల్లి వంటిది. కావుననే తల్లి శిశువును ఒడిలోనుంచుకొని లాలించునట్లుగా సర్వ జనులకీ లక్క ఒడి (న్యఞ్చనీ) వంటిది. అనగా వారిబాధను నివారించునది. లక్క పురుగులలోని స్త్రీకణములనుండి తీయబడిన ఎఱ్ఱని రసము రక్తమువలె నుండును.

"వృక్షం వృక్షమారోహసి వృషణ్యంతీవ కన్యలా
జయంతీ ప్రత్యతిష్ఠంతీ స్పరణీ నామవా అసి". ౩.

వృక్షములకొమ్మలపైన స్థావరముగా నిలబడిపోయియున్న లక్క పురుగుల సముదాయమునుగూర్చి చెప్పబడినదీ వాక్యము. ప్రియుని ఆలింగనము చేసికొని అతనిని జయించినట్లు కన్పించుచున్న కన్యవలె నీ పురుగులు కొమ్మల నాశ్లేషించుకొని యున్నవని ఉత్ప్రేక్షించబడినది. అట్టి లాక్షాక్రిమిని "స్పరణీ" యనినారు. స్పరణీ అనగా జయించినదని, రక్షించునదని, కాపాడునదని వ్యాఖ్యాతలు చెప్పియున్నారు. కాని స్పరణీ శబ్దమునకు శ్లిష్టమైయున్నదని నిరుక్తి చేయవలెను. వాయు వేగమునకు కొట్టుకొని వచ్చు ఈ క్రిములు చెట్లపైవ్రాలి, కొమ్మలను ప్రాకి అందలి సారమును గ్రహించునవగుటచే చెట్టుచెట్టును ప్రాకునవని మొదటిపంక్తిలో చెప్పబడినది.

"యద్దండేన యదిష్వా యద్వారుర్హరసాకృతమ్
తస్యత్వమసి నిష్కృతిః సేమం నిష్కృధిపూరుషమ్" ౪.

ఈ లక్క దండముచే గాని, బాణముచే గాని, అగ్నిచే గాని కావింపబడిన గాయమును మాన్పునది. ఇట్టి గాయముకల పురుషుని కారోగ్యమును చేకూర్పుమని ప్రార్థింపబడుచున్నది.

"భద్రాత్ప్లక్షాన్నిస్తిష్ఠ స్యశ్వత్థాత్ఖదిరాద్ధవాత్
భద్రాన్న్యగ్రోధాత్పర్ణాత్సాన పహ్యారుంధతి." ౫.

లక్కకు దోహదమిచ్చు వృక్షములు అరువదియైదు గలవని శాస్త్రజ్ఞులు నేడు చెప్పుచున్నారు. ప్లక్ష, అశ్వత్థ, ఖదిర, ధవ, న్యగ్రోధ, పర్ణ, వృక్షములు వీనిలో విశేషంగా శుభములని తెలియనగును. లాక్షా రసమును తయారుచేయు సిలాచీని దేవతల సోదరిగా చెప్పినప్పుడీ ముఖ్యవృక్షముల నేతదాశ్రయముల నుగా చెప్పుట సమంజసము. కావుననే ప్లక్ష, అశ్వత్థ, ఖదిర, ధవ వృక్షములిట పేర్కొనబడినవి. కొమ్మలపై ప్రాలియుండు లక్క పురుగులు క్రమక్రమముగా నచటనే పెరుగుటచే "నిస్తిష్ఠసి" అను క్రియాపదము ప్రయోగింపబడినది. లక్కపూతచే నివి రక్షింపబడు చున్నవి. కాగా నీ నాలుగు వృక్షములు భద్రవంతము లైనవి. లక్క పురుగు అరుంధతి; అనగా గాయము లను నయముచేయునది.

"హిరణ్యవర్ణే సుభగే సూర్యవర్ణే వపుష్టమే
రుతం గచ్ఛాసి నిష్కృతే నిష్కృతిర్నామ వా అసి" ౬.

యౌవనమునందిన లాక్షాక్రిమి సూర్యవర్ణముతోనుండు గృహమున శుభప్రదయై, బంగారుఛాయతో, అత్యంత సౌందర్యవతియై ఒప్పుచున్నది. ద్రవరూపమున రోగార్తునకీయబడి, రక్తప్రసరమార్గమునపోవుచు గాయము వద్దకు జేరి నయముచేయవలెనని అర్థింపబడు చున్నది.

"హిరణ్యవర్ణే సుభగే శుష్మే లోమశవక్షణే
అపామసి స్వసా లాక్షే వాతో హాత్మాబభూ వతే." ౭.

అగ్నివలె ప్రకాశించు బంగారుఛాయతోనున్న లాక్షా క్రిమికి పైన, క్రిందిభాగమున నూగువలె వెంట్రుక లుండును. ఇందుచే "లోమశవక్షణా" అనబడు చున్నది. లాక్షారసము ద్రవమగుటచేతను, నీటిలో కరగుటచేతను ఇది జలముల సోదరియని ఉద్దేశింపబడి నది. వాయువుయొక్క వేగమునబడి ఈక్రిములు వృద్ధి పొందుటవలనను, వృక్షమునుంచి వృక్షమునకు నివి తీసుకొని పోబడుటవలనను, లాక్షాక్రిమియొక్క ఆత్మయే వాయువని చెప్పబడినది. వాయువీ ఉపకారము చేయనిచో నివి నశింపగలవు.

"సిలాచీ నామ కానినో౽జబభ్రూ పితా తవ
అశ్వో యమస్య యః శ్యావస్తస్య హాస్నాస్యు క్షితా" ౮.

లక్క పురుగులలో మగది అత్యంతము చిన్నది యగుటచే "కానీనః" అనినారు. దీనివలన లక్క మిక్కిలిగా ఉత్పత్తి కాదు గనుకనే ఈ వాక్యమున నిరసనభావముతో నుద్దిష్టమైనది. లక్కకు కావలసిన ఎర్రరంగు ఈమగ పురుగుచే రానేరాదు. మేకవంటి బభ్రువర్ణముగల ఈమగ పురుగుయొక్క కుమార్తెయే సిలాచీ. యముని నల్లని అశ్వముయొక్క నెత్తురు నీ అజపురుగుపై చల్లుటచే నిది ఎర్రనై, ఎర్రని లక్క నిచ్చుచున్నదట. ఈ ప్రోక్షణక్రియద్వారా ఇది ఆశీర్వదింపబడిన దన వచ్చును. యముని వాహనము మహిషము; కాని అశ్వవాహన మిచట చెప్పబడినది.

"అశ్వస్యాస్నః సంపతితా సావృక్షాఁ అభిసిష్యదే
సరాపతత్రిణీ భూత్వాసాన పహ్యారుంధతి" ౯.

రక్తముచే ప్రోక్షించబడిన లాక్షాక్రిమి నెత్తురు వంటి లాక్షారసముతో చెట్లకొమ్మలను ప్రోక్షించుచు న్నది. యమునివాహనమైన నశ్వముయొక్క నెత్తురు నుంచి ఉత్పన్నమైనట్లు కన్పించుచున దిది యట! చెటుపై తీగవలె ప్రాకుచు, పక్షివలె పోవుచు చెట్లను లాక్షా రసమయముగా చేయుచున్నది. అట్టి ఈపురుగు గాయములను మాన్పునది కావున అరుంధతి. ప్రమాద కరమైన గాయముతో బాధనొందుచున్న మానవుని నయముచేయుమని ప్రార్థింపబడుచున్నది.

లక్కను, పాలను కలపి కాగబెట్టి రోగార్తున కీయవలెనని కౌశికసూత్రము చెప్పుచున్నది. రక్తక్షీణము గలవారికీ రీతిగా రక్తమువంటి ద్రవమునిచ్చుటతో శక్త్యుత్సాహములు చేకూరగలవని అభిప్రాయము.

# కొక్కొండ వెంకటరత్నం పంతులు



(గత సంచిక తరువాయి)

★

శ్రీ నిడదవోలు వెంకటరావు

పంతులుగారు క్రీ. శ. ౧౮౫౪ సంవత్సర ప్రారంభమున చెన్నపురికి వచ్చి స్థిరనివాసము గావించుకొనిరి. కాని యడుగు పెట్టుటతోడనే పిడుగు పడినట్లుగా, పంతులుగారి తల్లి రామాయమ్మగారు చనిపోయిరన్న వార్త వారికి తెలియవచ్చెను. ఆమె మధ్వమతమునకు కేంద్రస్థానమగు 'ఉడిపి' క్షేత్రమును దర్శింపబోవుచు మార్గమధ్యమున బెంగుళూరిలో మృతినొందెను. పంతులవారు తండ్రి నెఱుగకపోవుటచే, తల్లిగారియందపారమైన భక్తిప్రపత్తులు నెఱపెడివారు. మఱియు 'మాతృదేవో భవ' అను సూక్తిని స్థిరీకరించునట్లుగా నామె కంత్యక్రియలు గావించిరి.

పంతులుగారి కప్పటికి సంస్కృతాంధ్రముల యందు మంచి పాండిత్య మున్నను, నాంగ్లేయభాష యందు ప్రావీణ్య మున్నను సరియగు నుద్యోగము లభింపలేదు. 1855 సంవత్సరమువరకును వారచ్చటచ్చట లేఖకులుగాను, గుమాస్తాగాను, పనిచేయుచు ధనాభావమున నెంతయు కడగండ్లు పడిరి. సాధారణముగ చదువుకొనిన పండితులకు కవులకు నీ దరిద్ర బాధ తప్పనిసరిగ కలుగుచునే యుండును. అయినను దైవభక్తి, ఆత్మశుద్ధి, ఆత్మస్వాతంత్ర్యముగల పంతులుగారు, మిగుల ధైర్యముతో నాకాలము నంతయు గడపిరి. లేఖకుడు, గుమాస్తా మొదలగువారు చేయు పని "శ్వవృత్తి" అని వారు నిరసించియున్నారు. అట్టి పరిస్థితులలో గ్రంథరచన కెట్లవకాశము లభించును? ఆనాటివారి చిత్తప్రవృత్తి యీ క్రింది పద్యమువలన తెలియగలదు.

సుఖముగఁ దిండి నిద్దురలు
 చొప్పడవయ్యె శ్వవృత్తి నత్తరిన్
సఖుఁడు గురుండు లేడట, ప్ర
 సక్తియు జీవనమందె, నెమ్మి స
మ్ముఖమున గ్రంథముల్గనగ
 ముఖ్యములైనవి యేవి కానరా
వఖిలనుతంబుగం గృతిన
 హా! రచియింపఁ దరంబె లేవడిన్.

(బిల్వేశ్వరీయము, ప్రథమ బింబము. ౧౦౨ ప)

ఇట్టిపరిస్థితు లున్నను పంతులుగారు, 'పడయ నొకతోడు నేనిన్, విడువదు బాల్యంబు శక్తి వెలయదటంచున్, జడియక, మనుగడ నమ్మక, బిల్వేశుకరుణ గలదని త్రికరణశుద్ధిగా నమ్మి,' గ్రంథరచన చేయుచునే యుండెడివారు. సత్పురుషులకు దైవము తోడ్పాటు సంఘటిల్లుచునే యుండును. క్రీ.శ. 1866 ప్రారంభము నుండి మంచిదినములు రాసాగినవి. ఆకాలమున చెన్నపురి రైవిన్యాసక సభ (*Revenue Board office*) కార్యస్థానమున శిరస్థదారగు శ్రీ సుంకు జయరామ శ్రేష్ఠిగారు పంతులుగారి పాండిత్యవిశేషముల నెఱింగి, రైవిన్యాసకసభవారి నిలుకడయుత్తరువులను (*Standing orders*) నాంగ్లేయభాషనుండి తెనుగునకు బాషాంతరీకరించుటకు నియమించిరి. పంతులవారా కార్యమును నతిశ్రద్ధతో నెరవేర్చిరి. మొదటినుండియు నాంగ్లేయభాష నేర్చినను, దేశభాషలమూలమున నా భాషావిశేషములను ప్రచారము చేయు నిర్మాణాభిప్రాయముగల పంతులుగారికి పారిభాషిక పదముల ఋణమున కీపని యెంతయు సహాయకారియయ్యెను— శ్రీ జయరామ శ్రేష్ఠిగారి సహాయమువలన పంతులుగారి యిబ్బందులు తొలగి గ్రంథరచన కనుకూలించు పరిస్థితు లేర్పడెను—

## వచనరచన-విగ్రహతంత్రము

పంతులుగారాకాలమున కోడంబాకములో నివసించుచుండిరి. ఆనాటి కది యొక చిన్నపల్లె— అచ్చటనే, క్రీ. శ ౧౮౭౭ చివర కాలములో వారు నీతిచంద్రికలోని విగ్రహతంత్రమును, సంధిని రచియించి పూర్తిచేసిరి. నీతిచంద్రిక యధునాతన వచన వాఙ్మయమున నగ్రస్థానము వహించుటచే దానిని గూర్చి యించుక నివేదించెదను. పందొమ్మిదవ శతాబ్దిని ప్రఖ్యాత పండితుడగు పరవస్తు చిన్నయసూరి, పంచతంత్ర హితోపదేశ కథలను రెండింటిని సమ్మేళనము చేసి నీతిచంద్రిక యనుపేర నొక వచనగ్రంథము సంకల్పించి దానిని, మిత్రలాభము, మిత్రభేదము, సంధి, విగ్రహము అను నాలుగుభాగములుగా విభజించి, మిత్రలాభము, మిత్రభేదములను మాత్రము రచించి క్రీ. శ. ౧౮౫౩లో 'నీతిచంద్రిక' యనుపేర ప్రకటించెను. చిన్నయసూరి, రాజధానీ కళాశాలయందు ప్రధానాం

ధ్రోపాధ్యాయుడై, మదరాసు విశ్వవిద్యాలయము పేర్పడిన వెనుక, విశ్వవిద్యాలయమున తొలి యాంధ్రపండితుడై కీర్తినిగన్న మహావిద్వాంసుడు. కడచిన శతాబ్దిని, ప్రశస్త గ్రాంథికరచనకు మార్గదర్శకమని పేర్వడసిన, సూరి నీతిచంద్రికా భాగమునుగూర్చి ప్రస్తావించుట యనావశ్యకము—చిన్నయసూరి క్రీ. శ. ౧౮౬౨ సంవత్సరమున కీర్తిశేషుడయ్యెను. వేంకటరత్నము పంతులుగారు, సూరి గ్రంథమును, మఱి నాల్గేండ్లకే, యాతని శైలితో సమానమగు రీతిని సంధి, విగ్రహతంత్రముల రెండింటిని పూర్తిచేసిరి—వీనిలో సంధి ముద్రితము కాలేదు—ఈ విగ్రహతంత్రము క్రీ. శ. ౧౮౭౨ లో ముద్రితమైనది—ఈ విగ్రహతంత్రమె కాక సంధినిగూడ, గద్యతిక్కన కందుకూరివీరేశలింగము పంతులుగారును రచియించి ప్రకటించిరి—కాని వేంకటరత్నముపంతులుగారి విగ్రహతంత్రము[1] ప్రకటితమైన కొంతకాలము వెనుకనే వీరేశలింగము పంతులుగారి గ్రంథము ప్రకటితమైనది. వేంకటరత్నము పంతులవారి విగ్రహతంత్ర మాకాలమున తెలుగుదేశమున చాల ప్రసిద్ధవడసిన 'పురుషార్థప్రదాయిని (బందరు) పత్రిక చెన్నపురియందలి పత్రిక (స్వదేశీజన ప్రసిద్ధాభిప్రాయిని (*Native Public opinion*) మిక్కిలిగా ప్రశంసించినవి. మదరాసు విశ్వవిద్యాలయమున తెనుగుపరీక్షాధికారిగనున్న రివరెండు జాన్క్లే (*Rev john clay*) దొరగారు నీ గ్రంథమునందలి సంస్కృతాంధ్ర పదరచనారీతిని మిక్కిలి శ్లాఘించిరి.[2] పంతులుగారు పూర్వవచనరచనవలెగాక, చిన్నయసూరి సంప్రదాయము ననుసరించి, తమ రచన నుత్తమ సాహితీనిర్వాహకముగా వెలయింపజేసిరి. కేవలము నిత్యవ్యవహారమునందే గ్రాంథికభాష లుపయోగించు పంతులుగారు, సులభశైలిని, వ్యావహారికరీతిని గ్రంథరచన నెట్లు గావింపగలరు? కాబట్టియే తరువాతి వచనరచన లే నూతన వాఙ్మయశాఖలకు సంబంధించినను, నందలి శైలి గ్రాంథికమై విలసిల్లినది.

## అజామిళోపాఖ్యానము- యక్షగానము.

సంగీత సాహిత్యములయందు సమాన పాండిత్యముగల పంతులుగారు, సంస్కృతమున గీతమహానటనాది కావ్యముల రచించినను, నవి మార్గపద్ధతి నుండుటచేత, దేశిపద్ధతిని తెలుగున ప్రాచీన యక్షగాన సంప్రదాయమును పునరుజ్జీవింప జేయుటకు, అజామిళోపాఖ్యానము యక్షగానముగా రచించిరి. ఇది మిక్కిలి భక్తిరసమయమై యొప్పుచున్నది. దరువులు, ఏలలు, అర్ధచంద్రికలు మున్నగురచనా భేదములిందు గలవు- ఇది యముద్రితము.

## మహాశ్వేత- నవల

పైనాని యన్నింటికన్న ముఖ్యమైనది మహాశ్వేతనవలారచన. పంతులుగారు క్రీ. శ. ౧౮౬౭ సంవత్సరమున రచించిరి — తెనుగున, [3]నవలారచనకు పంతులుగారు ప్రథములు. ఈ నవలలో కొంతభాగము ౧౮౯౬ సంవత్సరమున 'వైజయంతీ' పత్రికయందు ప్రకటితమైనది— ఇది వీరేశలింగము పంతులుగారి రాజశేఖరచరిత్రకన్న యిరువదిరెండేండ్లు ముందుగ వెలసినది.

ఈ గ్రంథరచనయైన వెనుక పంతులుగారు క్రీ. శ. ౧౮౬౮ ప్రారంభమున, ఈనాము కమీషనరుగారి కార్యస్థానమున భాషాంతరీకరణము చేయు నుద్యోగమున నియమితులైరి. ఈ యుద్యోగము సుఖప్రదమై—గ్రంథరచన కనుకూలముగ నుండెను. క్రీ. శ. ౧౮౬౯ సంవత్సరమున, పంతులవారి తొలి సంస్కృత రచనలు, బిల్వనాథ శతకము, గీతమహానటనము ముద్రితములైనవి. ఈ రెండును—శ్రీ తిరుమల స్వామినాయుడు గారను వైద్యశాఖోద్యోగి సహాయమున ముద్రితమైనవి. ఆవెనుక వారు రచించినవి—

## తనుమధ్యాగీతరత్నము

ఇది సంగీత సంస్కృత కృతి—పంతులుగారు మాతృస్వరూపముగ భావించెడి తనుమధ్యమహాదేవి స్తుతి పరముగ వెలసినది — ఇందు పెక్కు రాగములతో గేయములు కలవు. భక్తిరసభరితము—

## హిందూభాషాసంజీవని

ఇది యొక తెనుగు చంపూకావ్యము—హిందూదేశమున భాషల వ్యుత్పత్తి క్రమ పరిణామములను దెలుపునది—అముద్రితము—

ఇవి రచించిన వెనుక క్రీ. శ. ౧౮౭౦ లో యినాము కమీషనరు కార్యస్థానము మూసివేయబడినది—దీనితోకూడ పంతులుగారు శ్వవృత్తిగ భావిం

---

1. ఈ విగ్రహతంత్రవిమర్శనముగూర్చి రాబోవు 'ఆంధ్రభాషాసంజీవనీ' పత్రికయను శీర్షిక క్రింద తెలుపబడును. అప్పు డందుండి వాక్యములు కూడ నుదాహరింపబడును.

2. గ్రంథవిస్తరభీతిచే నీ యభిప్రాయముల నిందు చేర్చలేదు—ప్రత్యేకగ్రంథముగా నిది ప్రకటితమగునపు డందు సంపూర్ణముగా నీయబడును.

3. ఈ నవలారచన చరిత్ర పరిణామ వికాసమునుగూర్చి 'తెలుగువచనరచన' యను గ్రంథము రెండవభాగమున చూడనగును.

చిన, సమాస్థాపనికి స్వస్తియైనది—వారు తత్క్షణమే, హిందూప్రొప్రయిటరీ పాఠశాలలో తెలుగుభాషోపాధ్యాయుడుగా నాహ్వానింపబడి యందు ప్రవేశించిరి- అప్పటినుండి వారు పండితులై, సాహిత్యరంగమున దినదినప్రవర్ధమానులైరి.

ఈ పాఠశాలయందున్నప్పుడే, పంతులుగారు రచించినవి,

## తనుమధ్యాశతకము.

ఇది తనుమధ్యాదేవీస్తుతిపరమగు నూఱుశ్లోకములుగల శతకము— సరళమైన రచనగలది. ఇది ముద్రితమైనది.

## విదుషీవిలాసము

సనాతనాచార పరాయణులగు పంతులుగారు, సంఘసంస్కారరూపమున నాకాలమున నప్పుడే పొడచూపుచున్న యుద్యమములను బరిహసించుచు వ్రాసిన పద్యకృతి— దీనినిగూర్చి వారి యాంధ్రభాషాసంజీవనిపత్రికలో కొంత కలదు. ఇది యముద్రితము.

## నరకాసుర విజయవ్యాయోగము
## మొట్టమొదటిభాషాంతరీకరణనాటకము

క్రీ. శ. ౧౮౭౧ ప్రారంభమున పంతులుగారు మహామహోపాధ్యాయ బిరుదాంచితుడు, సాహిత్యరత్నాకరగ్రంథకర్తయు ప్రసిద్ధాంధ్రదేశీయాలంకారికుడును నగు వారణాసి ధర్మసూరి విరచిత నరకాసుర విజయవ్యాయోగమును, శ్లోకమునకు పద్యమును వచనమునకు గద్యమును రచించి, భాషాంతరీకరణ నాటకములకు మార్గదర్శకులైరి. ఇంతకుముందు దృశ్యములగు నాటకములు శ్రవ్యమగు చంపూపద్ధతినే యనువాదములగుచుండెడివి— మంచన కేయూరబాహుచరిత్ర— (విద్ధసాలభంజిక) శృంగారశాకుంతలము (అభిజ్ఞానశాకుంతలము) ప్రబోధచంద్రోదయము (సంస్కృత ప్రబోధచంద్రోదయనాటకము)ను నీతరగతికి జెందినవి.

ఈ భాషాంతరీకరణమువలన పంతులువారు నవ్యవాఙ్మయప్రపంచమున నొక విశిష్టశాఖకు ప్రాథమికులైనారు. ఈ నాటక భాషాంతరీకరణరచన నేటివరకు సాగుచునేయున్నది. క్రీ. శ. ౧౮౮౩ లో కీ. శే. వావిలాల వాసుదేవశాస్త్రిలవారు (౧౮౫౧-౧౮౯౭) ఉత్తరరామచరిత్రను తెనిగించి యాగ్రంథపీఠికలో తమ గురువర్యులగు బ్రహ్మశ్రీయుత కోరాడ రామచంద్రశాస్త్రిగారు, నాటకరచనకు ప్రాథమికులనియు వారు వేణీసంహారమును భాషాంతరీకరించిరనియు వ్రాసియున్నారు. కాని వారి అభిప్రాయము సరికాదని నరకాసుర విజయవ్యాయోగముపై యాకాలమున పండితులును పత్రికలును నొసగిన యభిప్రాయములు ఘోషించుచున్నవి. పంతులవారే భాషాంతరీకరణనాటకమునకు ప్రాథమికులని యీక్రింది పండితాభిప్రాయములను మాత్రముదాహరించి, యీ ప్రస్తావన చాలించెదను. ఈ పండితులు మువ్వురును మహాప్రసిద్ధులు—చిన్నయసూరిగారి వియ్యంకులై, వారి వెనుక పండితపదవి వహించిన శ్రీరేకము రామానుజసూరిగారు. (౧౮౨౦-౧౮౭౮) వీరే తొలుత యప్పకవీయమును ప్రకటించినవారు—శబ్దరత్నాకర నిఘంటుకర్తలు సీతారామాచార్యులుగారును (౧౮౨౮-౧౮౯౧) శ్రీ చదలువాడ సీతారామశాస్త్రి గారును (౧౮౩౨-౧౮౯౫) జగమెఱిగిన పండితులు.

"శ్రీమద్ధర్మసూరివిరచిత మూలగ్రంథముతోడ దాని ఆంధ్రీకృత నరకాసుర విజయవ్యాయోగమును, గొంతవఱకు జదివిచూడ దఱుచుగా మూలాభిప్రాయము చెడకుండ నున్నది— ఒక్కొకచోట నెక్కుడుగ నున్నది— ఒకభాషలోని యభిప్రాయములు యథావస్థితముగ భాషాంతరమున గూర్చుట యెంతయు దుష్కరము—మీరు కీర్తిదక్క వేరొండు ప్రయోజనమేమి లేకున్నను, మిగుల నోపికతో నిట్టి కార్యము నిర్వహించుట కెంతయు సంతసించితిని. ఇదివరకు సంస్కృతానుసారిగ దెలుగున నాటకగ్రంథమెద్దియు లేదు. దానికి మీరు ప్రాథమికులైతిరి."

రాజధానీకళాశాల: చెన్నపురి—

౮-౩-౧౮౭౨ శ్రీ రేకము రామానుజసూరి.

"తెనుగున నింతవఱకు నిట్టిగ్రంథము లేమింజేసి, తెనుగువారికి నాటక మిట్టిదనుటయు దద్భేదములును, దత్సంప్రదాయములును సాధారణముగ దెలియకయుండెను—ఇప్పు డిది (తెనిగింపబడిన నరకాసుర విజయవ్యాయోగము) గలుగంబట్టి వారింక గ్రమక్రమముగా నన్నింటిని సులభముగ దెలిసికొందురనుటకు సందేహము లేదు. దీనిం జూచినవారెవ్వరేనియు నితఃపర మిట్టిగ్రంథముల విరచింప బూనుకొని నన్మానుకొందురు గాక! మొట్టమొదట యీపూనిక తమదిగా నేర్పడినది మిక్కిలి గౌరవావహమని తలంచుచున్నాము—"

బహుజనపల్లి సీతారామాచార్యులు, గవర్నమెంటు నార్మలుస్కూలు, తెలుగుపండితుడు.

చదలువాడ సీతారామశాస్త్రులు ప్రెసిడెన్సీ కాలేజి తెలుగుపండితుడు.

౧౦-౮-౧౯౭౨. (సశేషము)

# నారాయణభట్టే భట్టనారాయణుఁడా!



శ్రీ బులుసు వెంకటేశ్వర్లు

శ్రీమంత మగు సంస్కృత సారస్వతా కాశమున వేణీసంహారనాటక ధ్రువతారను నిలిపి సుప్రసిద్ధి గన్న భట్టనారాయణుఁడే ప్రాంతమువాఁ డన్న విషయ మిదమిత్థ మని యింతవఱ కెవ్వరును నిర్ణయింపఁజాలరైరి. ప్రత్యక్ష ప్రమాణము లేమియు లభింపని కారణమున వంగదేశమున విననైన యొక గాథనుబట్టి యా గాథ కాకరమైన "క్షితీశవంశావళీ చరితము"ను బట్టి భట్టనారాయణుఁడు కన్యాకుబ్జదేశమునకుఁ జెందిన యొక విద్వద్బ్రాహ్మణుఁ డనియు, నాతనిని వంగదేశరా జగు నాదిశూరుఁడు తన దేశమున కాహ్వానించి గౌరవించె ననియుఁ గొందఱు విమర్శకులు పేర్కొనిరి. జర్మను పండితుఁ డైన గ్రిల్లుదొర క్రీ. శ. ౧౮౭౧ లో లీప్జిగ్గునఁ దాను ప్రకటించిన వేణీసంహారనాటకము పీఠికలోఁ దొలుత నీ విషయముఁ దెలిపెను. దీనిని వంగీయుఁ డగు యల్. ఆర్. వైద్యా బలపఱిచెను. ప్రొఫెసరు విల్సను వంటి విమర్శకు లెందఱో దీనితో నేకీభవింపఁ జాలకపోయినను వేఱు నిదర్శనములు కానరాని కారణమున మూకీభావము వహించిరి.

కాని, వంగదేశీయ గాథలోను "క్షితీశవంశావళీ చరితము"నను—ఆదిశూరుఁ డను వంగరాజు భట్టనారాయణుఁ డను వాని యాధ్యాత్మికసేవకు మెచ్చి యైదు గ్రామము లిచ్చె నని యున్నదే కాని భట్టనారాయణుఁడు కవి యనియు వేణీసంహారాది నాటక కర్త యనియు నెక్కడ నుల్లేఖింపఁబడలేదు. పైఁగా, కన్యాకుబ్జదేశ చరిత్రమునఁ గాని తత్సారస్వత చరిత్రమునఁ గాని భట్టనారాయణుఁ డను వాని స్మృతియే లేదు. ఏది యెట్లున్నను భట్టనారాయణుఁడు వంగీయుఁడు కాఁ డనియు నట నివసించిన యన్యదేశీయుఁ డనియుఁ బై గాథయే మనకు దెలుపుచున్నది.

ఇఁక, వేణీసంహార మందలి యాంతర నిదర్శనము లేమైన లభించునేమో యన్న: "తదిదం కవేర్మృగరాజ లక్ష్మణో (లక్షణో) భట్టనారాయణస్య కృతిం వేణీసంహారం నామ నాటకం ప్రయోక్తు ముద్యతా వయమ్. తదత్ర కవి పరిశ్రమాను రోధాద్వా ఉదాత్త కథావస్తు గౌరవాద్వా నవనాటక దర్శన కుతూహలాద్వా భవద్భి రవధానం దీయమాన మభ్యర్థయే." అను సూత్రధారోక్తి తప్పఁ గవిని గుఱించి యేమియుఁ గానరాదు.

ఈ సూత్రధారోక్తి యందలి "మృగరాజ లక్ష్మణో భట్టనారాయణస్య" యన్న మాటలకుఁ గొందఱు "మృగరాజ బిరుదాంచితుఁ డగు భట్టనారాయణుఁ" డనియు, "మృగరాజు (అను బిరుదాంచితుని?) వలన శ్రీమంతుఁ డైన వాఁ"డనియు, "మృగరాజనఁగాఁ జంద్రుఁ డగుటచేఁ జంద్రునివలెఁ గళానిధి యగు భట్టనారాయణుఁ" డనియు నూహించి యుండిరి.

ఈ సందర్భమున నాంధ్ర భారత రచనమున నన్నయభట్టారకునకుఁ దోడ్పడిన నారాయణభట్టారకుఁడు మనకు స్ఫురింపకమానఁడు. "న్రైహూ పండితుఁడు: పండిత న్రైహూ" యన్న రూపాంతర స్ఫూర్తిచే "నారాయణభట్టు: భట్టనారాయణుఁ" డన్న నామాంతరగ్రహణము సమంజసము కాకపోదు. "భట్ట శ్చతుర్దశ కలాభిజ్ఞః" అని లక్ష్మణసూరి చూడామణి వ్యాఖ్య. దీనిని బురస్కరించుకొని నారాయణభట్టే భట్టనారాయణుఁ డని నిర్ణయింపఁ బెద్దలు సమర్థు లనియే నా విశ్వాసము.

రాజరాజనరేంద్రుఁడు నారాయణభట్టునకు నందంపూఁడిగ్రామ మగ్రహారముగా నిచ్చినట్లు నందంపూఁడి శాసనమున నన్నయభట్టారకుఁడు లిఖించియున్నాఁడు. నందంపూఁడి శాసనమునందలి యీ క్రింది వాక్యములు పరిశీలనార్హములు:

"........తత్పుత్రో విజయాదిత్య భట్టారకో ష్టాదశ. తత్తనుజో విష్ణువర్ధన షట్త్రింశతం. తత్సూనుః

ర్విజయాదిత్య నరేంద్ర మృగరాజశ్చ అష్టా చత్వారిం శతం............

స సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజాధిరాజో రాజపరమేశ్వరః పరమ భట్టారకః... శ్రీ రాజరాజదేవో...ఇత్థమాజ్ఞాప యతి. యథా :

హారీత గోత్రే హరిమూర్తి రాప
స్తంబ ద్విజశ్రేష్ఠ విభుర్వినీతః
సదా పురోడాశపవిత్ర వక్త్రో
విద్వాన భూత్కొంచేన సోమయాజీ.

తస్య శ్రీమాన్ హిమకర కర
ప్రస్ఫురత తీక్ష్ణ కీర్తి రాశే
రాసీ త్సూనుః సకల విదుషా
మంచితః కంచెనార్యః.

యం మన్యంతే యమ మరిగణాః
కామధేనుం కవీంద్రాః
క్రీడారామం పరమ సుహృదో
జీవితం బంధువర్గాః.

తస్మాత్మజో మహాత్మా సమజని
కౌచాంజనేయ ఇతి విదితః
ప్రజ్ఞాజిత వాచస్పతి రకలంకో
శంకనాఖ్యాకః.

తస్య చ సుధర్మ పత్న్యాశ్శ గుణశాలిన్యాశ్చ
సామి కొంబాయాః
అభవ దనుష్ఠిత జగదుపకరణో
నారాయణ స్తనయః.

యః సంస్కృత కార్ణాట ప్రాకృత
పైశాచి కాంధ్రభాషా సు
కవి రాజశేఖర ఇతి ప్రథితః
సుకవిత్వ విధ వేన

కవి వ్మనీషాలవ దుర్విదగ్ధాన్
మనోహరాభిర్నిజ సూక్తిభిర్యః
కుర్వన్న గర్వా న్పటు భిర్బిభర్తిన్
కవీభ వజ్రాం కుశనామ సార్థమ్.

తస్మై సకల జగదభి గుణశాలినే సరస్వతీ కర్ణావతం సాయాష్టా దశావధారణ చక్రవర్తినే భట్ట(నన్ని) నారాయణాయ భవద్విషయే నందముపూణ్ణి నామ గామొగ్ర హారీకృత్య సోమగ్రహణ నిమిత్తే ధారా పూర్వక మస్మాభిస్సర్వకర పరిహారేణ దత్త ఇతి విదిత మస్తువః......"

ఈ శాసనమున మనము గ్రహింపవలసిన విషయము లివి : రాజరాజనరేంద్రుని పూర్వుఁడొకఁడు మృగరాజ బిరుదముఁగాని నామముఁగాని తాల్చియుండె నన్నది మొదటిది. భట్టు, భట్టారక శబ్దములు చిరకాలమునుండి రాజులకుఁ గవులకుఁ బ్రయుక్తములగుచునే యుండుట రెండవది. నన్నయ ప్రశంసించిన నారాయణభట్టునకు నారాయణ, నన్ని లేక భట్ట నారాయణ నామాంతరము లున్న వనియు నాతఁడాముష్యాయణుఁ డనియు స్పష్ట మన్నది మూఁడవది. నారాయణభట్టు సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచిక భాషలలో మహాపండితుఁడు. మహాకవి యగుటే కాక "కవిరాజశేఖర" "కవీభ వజ్రాంకుశ" "అష్టాదశావధారణ చక్రవర్తి" మున్నగు బిరుదములు ధరించియుండె నన్నది నాల్గవది.

విష్ణువర్ధన మహారాజునకు రాజరాజు, రాజమహేంద్రుఁడు, రాజరాజనరేంద్రుఁడు నన్నవి బిరుదనామములే కాని వ్యక్తినామములు కానట్లే మృగరాజ శబ్దము బిరుదవాచియే కావచ్చును. రెండవ విజయాదిత్యునకు మృగరాజ బిరుదము కలదు. ఆతఁడాతని పేరితోడనే కాక యొక్కొక్కచో కేవలము మృగరాజనియే పేర్కొనఁబడినాఁడు. రాజరాజునకు మృగరాజ బిరుదము సైతము పూర్వులనుండి వచ్చియున్న నుండవచ్చు ననుట యసమంజసము కాదు. భట్టనారాయణుఁడు రాజరాజు కతన శ్రీమంతుఁడైన కతమున నా యర్థముననే మృగరాజ లక్ష్మణుఁ డని వాడియుండె నన్న సాహసము కానేరదు.

నారాయణభట్టు కన్నడమున భారతమును రచించె నని కన్నడ వాఙ్మయచరిత్ర వలన విదితము. ఆంధ్రభారత రచనమున నీతఁడు చేసిన సాయ మత్యంతమని నన్నయయే యుద్ఘోషించినాఁడు. పైఁగా నీతని తండ్రి తాతలు మహాపండితులు. కవిలోక చక్రవర్తులు. ఇట్టిచో నీతఁడే తన కత్యంతప్రియ మగు భారతగాథను సంస్కృత ప్రాకృత భాషా ప్రాగల్భ్య విప్నసిత మగునట్లు వేణీసంహార మను సంస్కృత నాటకముగా రచించియుండు ననుట సంగతమే యగు. ఇఁక, కవిలోకాగ్రణి యగు నీతఁడే కన్యాకుబ్జాది దేశ

ములకు నట నుండి వంగదేశమునకు వేఁగి సత్కృతు లందియుండె ననుటయు దోషములు కాఁజాలవు. పైఁగా నీతని యీ దేశాంతర గమనమే యీతని చరిత్ర మనకు స్పృశ్య మగుటకు హేతువై యుండును. సంస్కృత ప్రాకృత పైశాచిక భాషలలోఁ గల నిజ పాండితి నీతఁడు చూపినాఁ డనుటకు వేఱు గ్రంథ మేదియు లేదు గాన, వేణీసంహారము రచించిన దీతఁడే యనఁ జెల్లునేమో కదా!

మఱియు నన్నయకాలము క్రీ. శ. ౧౦౫౦ ప్రాంత మని పెక్కురు విమర్శకు లంగీకరించిన విషయము. నారాయణభట్టు కాలముకూడ నీ ప్రాంతమే కావలయుఁగదా! భట్టనారాయణుని కాలము నిర్ణయించుచు విమర్శకు లీ క్రింది విషయములు పేర్కొనిరి. మమ్మటాచార్యుఁడు తన "కావ్యప్రకాశమున" భట్ట నారాయణుని వేణీసంహారమునుండి పెక్కు శ్లోకము లుదాహరించి యున్నాఁడు. మమ్మటాచార్యుని కాలము క్రీ. శ. ౧౧౫౦ - ౧౨౦౦ ప్రాంత మన్నది నిర్వివాదాంశము. కావున, భట్టనారాయణుఁ డంతకుఁ బూర్వుఁడై తీరవలయును గాన నాతఁడు ౧౦౫౦ - ౧౧౦౦ ప్రాంతమువాఁ డనుట సమంజసము. మఱియు క్రీ. శ. ౧౦౩౦ ప్రాంతమువాఁ డగు భోజదేవుఁడు తన "సరస్వతీ కంఠాభరణమున" వేణీసంహారమును పేర్కొనెను. క్రీ. శ. ౧౦౬౦ ప్రాంతమునకుఁ జెందిన దశరూపకము కూడ వేణీసంహారము నుదాహరించుటచే - భట్టనారాయణ నన్నయభట్టారకుల కాల మొకటే యని నిర్ణయింప వీలు చిక్కుచున్నది.

ఈ కారణములచే నారాయణభట్టే భట్టనారాయణుఁడేమో యని భ్రమ కలుగుచున్నది. సరియగు పరిశోధనమే సక్రమ నిర్ణయమునకు దారి చూపును గనుక విద్యావివేకనిధు లగు పెద్ద లీ విషయమున సముచిత నిర్ణయము నొనరింతురుగాక యను నాశతో నిట్లు నివేదించితిని. నా యూహ బలపడి మన నారాయణభట్టే వేణీసంహార నాటకకర్త యగు భట్టనారాయణుఁ డన్న విషయమే ధ్రువపడిననాఁడు మన యాంధ్రావళి యమందానంద మందఁగల దనుట నిక్కువము.

---

# వెలుగుతెరువు

**శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి**

అందరాని చక్కఁదనము
అందిన సౌందర్యలవము
కడలపిలుచు ఆనందము
కౌఁగిలిలో అనుభవమ్ము
నా పాటకు జీవనమ్ము!

మనసులో[illegible]లో మరుగుఁ అలలో
వయసు సుడుల పొరలు కేఁలో
చివికిన బ్రతుకుల తలపో
ఉబికే తలఁపుల బ్రతుకో
నా పాటల తళుకు నడకు!

చేనిగట్టు చిన్నిపూవో
చిన్నదాని సిగమలపో
కట్టుకొయ్య మనికి నిలుపో
కాలినడక వెదకు తెరువో
నా పాటలో వెలుఁగు తెరువు!

---

# వచన గీతికలు

మూలం :
టూర్జినీవ్

అనువాదం :
శ్రీనివాసచక్రవర్తి

## పుర్రెలు

దేదీప్యమానంగా దీపాలతో వెలిగిపోతున్న హాలు; హాలులో చాలామంది స్త్రీలు, పురుషులు.

అందరి ముఖాలలో ఉత్సాహం తాండవిస్తున్నది; హుషారుగా సంభాషణ నడుస్తున్నది... ఒక సుప్రసిద్ధ గాయకిని గురించి సంభాషణ గట్టింతుగా సాగుతోంది. ఆమెను దివ్యమూర్తి, అమరమూర్తి అని అంటున్నారు. వారంతా...ఓ, నిన్న ఆఖరి సారి ఆమె రాగం ఎంత అందంగా ఆలపించింది!

అకస్మాత్తుగా — ఇంద్రజాలకుడు మంత్రదండం విసరినట్లు—ప్రతి శిరమునుంచీ, ప్రతి ముఖం నుంచీ పల్చటి చర్మం జారిపడిపోయి పుర్రెల అతి తెలుపునూ, అక్కడక్కడా బోసినోళ్లా, చిగుళ్లా నిండు కాంతినీ బహిర్గత మొనరించింది.

అమిత భయంతో ఆ నోళ్ల కదలికను, చిగుళ్లకదలికను, ఆ దీపాల, ఆ కొవ్వొత్తుల కాంతిలో ఎముక బంతుల కదలికను, ఆ బంతులలోని చిన్న బంతుల—భావ రహిత నేత్రాల—కదలికను తిలకించాను.

నా ముఖం తాకడానికి నాకే ధైర్యం లేకపోయింది. అద్దంలో నన్ను నేను చూచుకోవడానికీ ధైర్యం లేకపోయింది.

అదివరలాగే పుర్రెలు అటూ ఇటూ కదలాడుతున్నాయి...పెద్దగా నవ్వే దంతాల చాటునుండి ఎర్రటి గుడ్డపేలికల్లా తొంగి చూస్తూ, పూర్వంలాగే గట్లంతు చేస్తూ నాల్కలు— ఎంత అద్భుతంగా ... ఎంత అద్వితీయంగా ఆ అమర ... అవును అమర ...గాయకి ఆఖరిసారి రాగం ఆలపించిందంటూ గబగబా - అస్పష్టంగా మాట్లాడ సాగాయి.

---

## నీలు!

నీలు! ఇదే ఆకృతితో శాశ్వతంగా నాస్మృతి పథంలో నిల్చిపో!

నీ చిరు పెదవులనుంచి అంతిమావేశ జనిత స్వరం వెలువడింది. నీ నేత్రాలలో కాంతి లేదు, తళుకూ లేదు. సౌందర్య మహదానంద భావసౌఖ్యంతో కుంగి కాంతి విహీనమైపోయాయి నీ కళ్లు. విజయంతో అలసిన నీ హస్తాలు, కాంతుతో కూడిన నీ హస్తాలు ఆ సౌందర్యంకోసం తడుములాడుకున్నాయి. దీన్ని ప్రకటించుకో గల్గడమే నీ అదృష్టం!

సూర్యుని కాంతి కంటే పవిత్రమై, గొప్పదై నీ సర్వాంగాలచుట్టూ, నీ దుస్తుల ముడుతలలో వ్యాప్తమై ఏ దివ్య కాంతి ప్రకాశిస్తున్నది?

భగవానుని ఏ ముద్దుటూర్పులు నీ ఉంగరాల జుట్టును కదలాడించాయి?

చలువరాతిలా తెల్లనైన నీ నుదుట ఇప్పు డాతని చుంబనం వెలుగుతోంది.

ఇదే బహిర్గతమైన కవితా రహస్యం, జీవిత రహస్యం, ప్రేమ రహస్యం.

ఇదే, ఇదే అమరత్వం! ఇంతకంటె అమరత్వం లేదు.; ఉండ నవసరమూ లేదు. ఈ క్షణంలో నువ్వు అమర జీవివి.

ఇది గడిచిపోతుంది. మళ్ళీ నువ్వో రేణువవు, స్త్రీవి, పసికందువవు ......... .. కాని ఎందు కంత భయం. బుద్బుద ప్రాయమూ, అశాశ్వతమూ అయినవా టన్నిటికీ ఈ క్షణంలో నువ్వు అతీతుడవు. ఈ నీ క్షణం ఎన్నటికీ అంతంకాదు.

నిలు! నీ అమరత్వంలో నన్నూ భాగస్వామిని కానీ, నీ అమర జ్యోతిని నా ఆత్మలోనూ వెలిగించు.

---

## ఇంకా పోరాడుతాం

ఒకొక్కప్పుడు నలుసంత విషయం మనిషిని మనిషినే ఎలా మార్చివేస్తుందో! వ్యాకుల భావంతో ఒకనాడు హైరోడ్డు వెంట నడిచి వెడుతున్నాను.

విషాదంతో కూడిన సందేహ భారంతో హృదయం కుంగిపోయింది. నిరుత్సాహం నన్ను ముంచివేసింది. తల యెత్తాను... నా ముందు, ఎత్తయిన బూరుగు చెట్ల వరుసలు రెంటి మధ్యగా దూరానికి రోడ్డు దూసుకు పోతున్నది.

దీని కడ్డంగా, ఈ రోడ్డు కడ్డంగా, నాకు రెండడుగుల్లో, మిరుమిట్లు గొలిపే వేసవి పసిమి ఎండలో, పిచ్చుకల కుటుంబం ఒకదాని వెను కొకటి దుముకుతున్నవి. పెంకెగా, వేడుకగా, ఆత్మవిశ్వాసంతో దుముకుతున్నవి.

ముఖ్యంగా అందులో ఒకటి, తన చిన్న రొమ్మును ఉబికిస్తూ, ఎవరన్నా తనకు భయం లేదని చెప్ప దలచినట్లు వెరపు లేకుండా కిచకిచ మంటూ ఉన్మత్త శక్తితో అటూ యిటూ దూకుతున్నది. బాలవీరుడు, నిజం!

ఇంతలో పైన ఆకాశాన ఆ బాల వీరుని మింగివేయడానికి కాబోలు ఓ డేగ తిరుగుతున్నది.

చూచాను, నవ్వాను, వొళ్లు విదుల్చుకున్నాను. వ్యాకులభావం యిట్టే ఎగిరి చక్కాపోయింది. తిరిగి కొత్త జీవితం కోసం పోరాట, ధైర్యం, పట్టుదల మొలకెత్తాయి.

నాపైన కూడా నా 'డేగ' నూ గిరున తిరుగనీ, ఇంకా పోరాడుతాం, నాశనం చేస్తాం.

## రాతిబండ

వసంతపు టెండలో, సముద్రపు టొడ్డున, పోటువేళ, అన్ని వైపులనుంచీ సజీవ కెరటాలు బూడిదరంగు పాత రాతిబండ మీద విరుగుతూ, ఆడుతూ, లాలిస్తూ నాచుతో కప్పిన దాని తలమీద మెరిసే నురుగు తరకలు వెదజల్లడం ఎన్నడైనా చూచారా?

ఆ రాతిబండ పూర్వపు రాతిబండే కాని మకమకలాడే దాని పై తట్టు గాఢ వర్ణాలలో వికసిస్తున్నది.

కరిగిన శిలాద్రవం కరుడుగట్టుతూ నిప్పు రంగులతో మండిపోయిన ఆ అలనాటి రోజులను తెల్పుతున్నవా వర్ణాలు.

అలానే ఇటీవల నా ముసలి గుండెను నవ వధూ జీవశక్తి చుట్టు ముట్టి బ్రద్దలు చేసింది. వారి లాలనాస్పర్శలో-ఆరిపోయిన నా కాంతుల ఛాయలు——ఎన్నడో వెలసిపోయిన రంగులతో నాహృదయం ఉప్పొంగిపోయింది.

కెరటాలు వెనక్కి మళ్ళాయి....కాని రంపంలాంటి గాలిలో ఎండిపోతున్న రంగులు మాత్రం మాసిపోలేదు.

---

## రేపు ! రేపు !

ఎంత మందకొడిగా, ఎంత నిరర్థకంగా, ఎంత పాడుగా రోజులకు రోజులు గడిచిపోయాయి! బహుకొద్ది గుర్తులనే అవి వదలిపోతాయి! ఒకటి తర్వాత ఒకటి ఆ గంటలు ఎంత అర్థవిహీనంగా, ఎంత తెలివితక్కువగా జరిగిపోయాయి.!

అనగా అస్తిత్వమే మానవ కాంక్ష. జీవితం అమూల్యమనే వాని భావన. దాని మీదా, తనమీదా, భవితవ్యంమీదా, ఆశ పెట్టుకుంటాడు!......

ఓ! భవిష్యత్తులో సౌభాగ్యశ్రేయస్సుల కోసం ఎదురు చూస్తాడు.

కాని అప్పుడే గడిపిన రోజుల్లాంటివి రాబోయే రోజులు కావని ఎందు కూహించుకోవాలి?

కాదు, ఊహించనైనా ఊహించడు అసలు ఊహించాలనే అభిలషించడు. బలే!

“ఆ-రేపు! రేపు!” అనుకుంటూ ఆ ‘రేపు’ మృత్యువాత నాతని బడద్రోసే వరకూ తన్ను తా నూరడించుకుంటాడు.

సరే, మృత్యువాత బడిన తర్వాత యిక గత్యంతరమూ లేదు, ఆలోచించే అవసరమూ లేదు.

---

## ముసలి వగ్గు

చీకటి రోజులు, ఏడుపుగొట్టు రోజులు వచ్చేశాయి ... నీ దౌర్బల్యాలు, నీకు ప్రేమాస్పదులైన వారి కష్టాలు, ముసలితనపు చీకూ, చింతా- నీ సర్వస్వం అర్పణ చేసి నువ్వు ప్రేమించిన వన్నీ ముక్కలు ముక్కలుగా కూలిపోతున్నాయి. ఇక బాట దిగువకే!

ఏం చేయగలవ్? ఏడ్పు, గొణుగుడు! ఆ మార్గం నీకూ సహాయకారి కాదు, ఇతరులకూ సహాయకారి కాదు.

వంగి, మోడైపోతున్న చెట్టుమీద ఆకులు చిన్నవీ, బహుకొద్దీ, అయినా వాటి ఆకు పసిమిరంగు మారిపోలేదు.

నువ్వుకూడా నీ లోకి, నీ పూర్వస్మృతులలోకి ముడుచుకుపో. అక్కడ, లోలోపల, ఆత్మోన్ముఖమైన నీ ఆత్మలోతులలో నవనవలాడుతూ సువాసనలతో నీ వసంత కాలపు శోభాశక్తులతో నీపూర్వ జీవిత మందిరం - దాని బీగం నీ చేతిలోనే వుంది— తిరిగీమహత్తరంగా ప్రకాశిస్తుంది.

తస్మాత్ జాగ్రత... ముందుచూపు చూడకు, ముసలివగ్గా!

---

# విజ్ఞాన శాస్త్ర పరిశోధనలు



శ్రీ వసంతరావు వెంకటరావు

గత శతాబ్దాలలోకంటె ఈ శతాబ్దంలో విజ్ఞానం పొందిన వికాసం అద్భుత మంటే అతిశయం గాదు. సుమారు పదునారవ శతాబ్దంలో ప్రారంభమైన యథార్థ విజ్ఞానం భౌతిక ప్రపంచంలోనున్న బహుళ వస్తుజాలాన్ని, జీవరాశిని పరిశీలించి వాటి వాటి లక్షణాలను అవగాహన చేసికొనడానికి 3½ శతాబ్దాలు పట్టింది. శక్తి ద్రవ్యముల స్వభావాన్ని గ్రహించి, సామాన్యదృష్టికి నిరుపయోగంగా కనిపించు వివిధవస్తువులను జనోపయోగాన్నికై వినియోగించు విధానాలను అన్వేషిస్తూండిన విజ్ఞానులు గత ఏబది సంవత్సరాలలో సాధించినంత విపులంగా పందొమ్మిదవ శతాబ్దాంతం వరకు గతించిన మూడు వందల యేండ్లలోను సాధించలేకపోయే రని గుర్తించినప్పుడు, నేటి విజ్ఞాన ప్రాముఖ్యం స్పష్టమౌతుంది. సిద్ధాంత విజ్ఞానంతో ఉపయుక్తవిజ్ఞానం మొదటి నుండి పెంపొందుచుండినప్పటికి, రానురాను ఉపయుక్త విజ్ఞానమే ముందంజ వేయజొచ్చింది. కోట్ల కొలది మైళ్ళు దూరంగానున్న నక్షత్రాల విషయమైతే నేమి, సూక్ష్మాతిసూక్ష్మమై అగోచరంగానున్న పరమాణు సందర్భమైతే నేమి, జీవులలో పారంపర్యంగా సిద్ధించు సహజలక్షణాల కాధారభూతమైన జీన్లగురించైతే నేమి, లభ్యమైన జ్ఞానంవల్ల మానవునికి వినూత్న శక్తులు అలవడ్డాయి. విజ్ఞానపురోగతిలో కొన్ని ఘట్టాలు విమర్శిద్దాము.

ఏ వస్తువునైనా జనోపయోగానికై పూర్తిగా వినియోగించు మార్గాన్వేషణం ఉపయుక్త విజ్ఞాన (*Applied science*) ముఖ్యలక్షణాలలో ఒకలక్షణం. జీవితావసరాలకు ఆవశ్యకమైన మందులు, సబ్బులు, రంగులు, నూనెలు, బట్టలు మొదలగు వస్తువులను తయారుచేయడాని కవసరమగు పదార్థములకై మృగాలు, చెట్లు, చేపలు, లతలు, మూలికలు, పళ్లు మొదలైన సజీవాలమీద సాధారణంగా మానవుడు చాలవరకు ఆధారపడుచుండేవాడు. జనాభా పెరుగుతూన్నకొద్దీ సంకులంగా వృద్ధిపొందుతూన్న నేటి జీవిత విధానాలకు, సహజంగా లభ్యమయే పదార్థాలు చాలకపోవుటచేత, అట్టి పదార్థాలను సేంద్రియ రసాయనికపద్ధతులపై కృత్రిమంగా తయారుచేయడానికి ప్రయత్నాలు జరిగేయి. ఉన్నపదార్థాలవంటివి ఉత్పత్తిచేయడమే కాక, విజ్ఞానులు, క్రొత్తరకాలు కూడ సృష్టించేరు. సహజ పదార్థాలకన్న మిన్నయైన రబ్బర్లు, ప్లాస్టికులు, సువాసన ద్రవ్యాలు, రంగులు విపరీతంగా వాడుకలోనికి వచ్చేయి.

ఒక తరగతికి చెందిన ఇట్టి కృత్రిమ పదార్థాలకు మూలాధారులు కర్ర, నేలబొగ్గు, పెట్రోలియము మొదలైనవి. కర్రను విచ్ఛేదక స్రావణపద్ధతి (*Destructive distillation*) కి లోను గావించుటచేత టర్పెంటీను, కర్రనూనె మొదలైనరకరకాల నూనెలు లభ్యమౌతున్నాయి. నేలబొగ్గునుండి సంపాదించగల పదార్థాలు అనేకమున్నాయి. వాటిలో కొన్ని బెంజీను, నేఫ్తలీను, మిథైల్ ఆల్కహాలు మొదలైనవి.

అనేక హైడ్రోకార్బన్ల మిశ్రమైన పెట్రోలియము రసాయనప్రక్రియల మూలంగా, వివిధరసాయనిక యౌగికాలు (*Compounds*) నియ్యగలదు. మూలభూతమైన పెట్రోలియంతో, భూమిలో కలుగు సహజవాయువును ఉష్ణవిశ్లేషపద్ధతులచే ఉదజనిగా మార్చి, ఉదజనినుండి అమోనియాను, దానినుండి అమోనియం సల్ఫేటును తయారు చేస్తున్నారు. సహజవాయువునే క్లోరినుతో రసాయనప్రక్రియ నొందజేసినయెడల క్లోరొఫార మేర్పడుతుంది. ఇక స్రావణ (*distillation*) చే సహజమైన పెట్రోలియంనుండి లభించేది మోటారుస్పిరిటు, కిరసనాయిలు, గేసుఆయిలు, ఫ్యూయల్ ఆయిలు. గేసుఆయిలును స్రావణచేయగా భంజితవాయువు (*Crackedgas*), మోటారుస్పిరిటు, ఫ్యూయలుఆయిలు లభిస్తాయి. పృథక్కరణంవలన భంజిత వాయువునుండి వచ్చు రసాయనికాలను వేర్వేరు రసాయన ప్రక్రియలకు గురిచేయగా రకర

కొల ఆల్కహాలులు, క్లోరైడ్లు స్రవణ్ణంవల్లవస్తాయి. ఫ్యూయల్ ఆయిలునుండి తయారయేదిత్తైగ్ధ స్ధిలాలు; వాటినుండి ఆల్కహాలులు. ఈవిధంగా ఒక్క పెట్రోలియంవల్ల తయారుచేయగల యౌగికాలు వందలకొలది ఉన్నాయి. దైనందిన జీవితంలో ఈ యౌగికాలు అత్యంతోపయోగమైనదే!

ద్వితీయ ప్రపంచసంగ్రామంలో, విజ్ఞానం, మహావేగాధికంతో పురోగమించింది. విధ్వంసక శక్తులకై తీవ్రమైన అన్వేషణ జరిగింది. దానిఫలితంగా ఎటామిక్ బాంబు జనించడం, రెండు పెద్దపట్టణాల వినాశంతో యుద్ధం సమాప్తం కావడం లోకవిదితమే! ఊహామాత్రంగాను సిద్ధాంతరీత్యాను సాధింపవచ్చు నను కొన్న పరమాణుశక్తిని ప్రాయోగికంగా విడుదలచేసిన విజ్ఞానులు మానవచరిత్రలో నూతనశకాన్ని ప్రవేశపెట్టేరు. వినుక్త పరమాణుశక్తి కేవల హాలాహలసన్నిభంగానుంది. పరమాణుగర్భంలో బందీకృతమైయున్న ఆ శక్తిని విడిపింపగలిగిన విజ్ఞానులు ఆ మహాశక్తి నిర్మాణపథాలలోకి మళ్ళించు విధానాన్నింకా కనిపెట్టలేకున్నారు.

పరమాణుశక్తిని మానవుడు విడిపించులోగా అనేక శాస్త్రశాఖలలో పెంపొందిన జ్ఞానాన్ని సమీకరించవలసివచ్చింది. పరమాణుస్వభావం పూర్తిగా తెలిసికొనడానికి దాని నిర్మాణంగూర్చి సమగ్రజ్ఞానాన్ని సంపాదించేరు. విద్యుత్తుయొక్క మూలరూపాలైన ఎలక్ట్రానులు ప్రోటానులతో ఏర్పడిన పరమాణువునకు ఒక కేంద్రకం (*nucleus*) గలదని, బరువైన ప్రోటానులన్నీ వాటి ధనావేశంతో ఆ కేంద్రకంలోనే ఉండగా, దాని చుట్టు ఎలక్ట్రానులు తిరుగుతుంటాయని మొదటి చిత్రంలో ఊహించేరు. ఆవేశమే లేని కణం న్యూట్రాను కనుగొనబడిన పిదప కేంద్రకంలో దానికి స్థానం చూపించవలసివచ్చింది. కేంద్రకం చుట్టు తిరుగుచున్న ఎలక్ట్రానులను సులభంగా విడదీయగలిగినప్పటికి కేంద్రకం చాల బలవత్తరంగా నుందనిన్ని, దానిని సామాన్య శక్తితో భేదించడానికి సాధ్యం కాదనిన్ని తెలియవచ్చినతరువాత కేంద్రకాన్ని భిన్నంచేయడానికనువైన శక్తిని ఉత్పత్తి చేయగల యంత్రాలను నిర్మించవలసివచ్చింది.

రసాయనిక శక్తికి పరమాణుశక్తికి గల భేదం బోధపడింది. రసాయనిక ప్రక్రియలలో రెండు పదార్థాలు పాల్గొన్నప్పుడు, వాటి అణువులు చెదరి, తిరిగి ఒక క్రమంలో ఏర్పాటౌతాయి. ఒకవిధంగా నున్న అణునిర్మాణం మరొక విధమైన అణునిర్మాణంగా పరివర్తన మొందినప్పుడు ఆ అణువులను బంధించు శక్తిలో కొంత విడుదల కావడంగాని, ఆ అణువులు కొంత శక్తిని తీసికొనడంగాని సంభవిస్తుంది. అట్టి సందర్భంలో రసాయనికరంగంలో ప్రవేశించు శక్తిమాత్రమే మనకు లభిస్తుంది. అట్టి శక్తి, అణువులను పరమాణువులం బంధించిన శక్తిమాత్రమే. అందుచేత దాని పరిమాణం స్వల్పం. ఆశక్తి ఎంత స్వల్పకాలంలో విడుదల కాగలిగితే అంత ఆర్భాటం చేస్తుంది. మందుగుండు సామానులలోను, బాంబులలోను విడుదల అయే శక్తి అత్యల్ప కాలంలో బహిర్గమిస్తుంది.

కాని, ఏటంబాంబులో అణుగర్భశక్తి వెలువడుతుంది. పరమాణుకేంద్రకం భిన్నమైనప్పుడు కొంత ద్రవ్యం శక్తిగా రూపాంతరం పొందుట సంభవిస్తుంది. మన పరిశోధనాగారాలలో సామాన్యంగానుండు తాప క్రమంలోను, ఒత్తిడిలోను పరమాణువు భిన్నమయే అవకాశం లేదు. సీసంకంటె ఎక్కువ పరమాణు భారం గల మూలతత్త్వాలు యాదృచ్ఛికంగా విచ్ఛిన్నమై వాటి పరమాణు కేంద్రకాలనుండి కొంత శక్తి పైకి వస్తూన్నప్పటికి అదెందుకు సంభవించాలో తెలియదు. కాని, పరమాణుకేంద్రకం అభేద్యం కాదని ప్రత్యక్ష నిదర్శనాలు రేడియోధార్మిక మూలతత్త్వాలు.

పరమాణుగర్భస్థమైన కేంద్రకాన్ని భిన్నం చెయ్యడానికి విశేషశక్తి అవసరమని, అట్టి శక్తిని సంపాదించడానికై విజ్ఞానులు యంత్రాలను నిర్మింప మొదలెట్టేరని గమనించేము. ప్రోటాను, న్యూట్రానులవంటి పరమాణు లోకమందలి గుండ్లతో మూలపదార్థాలను ఎదుర్కొనేసరికి, క్రమంగా, ఒక్కొక్క మూలపదార్థం తన ప్రత్యేకతలను గోల్పోయి, వేరొక మూల పదార్థంగా మారజొచ్చింది. ఆ ప్రక్రియలలో అధికంగా శక్తి విడివడినప్పటికీ అదంత ప్రమాదకరంగా లేదు. కాని, ఎప్పుడైతే, భారతరమైన పరమాణు భారంగల మూలతత్త్వాలపై అట్టిప్రయోగాలు చేసేరో, అప్పుడు ప్రళయోద్ధండంగా పరమాణుశక్తి వెలువడింది.

అంతకంటె మహత్తరమైన దొకటి సంభవించింది. విశ్వంలో నున్న పదార్థాలన్నీ ౯౨ మూల పదార్థాలతోనే ఏర్పడుచున్నట్లు విజ్ఞానులు విశ్వసిస్తూండేవారు. ఏమంటే, గతశతాబ్దమధ్యంలో, మూలతత్త్వాల రసాయనిక లక్షణాలను బట్టి వాటిని వర్గీకరించి, ఆవర్తపట్టిక, (*Periodic table*) ను మెండెలైఫు తయారుచేసినప్పుడు, అప్పటికి తెలిసినవి సుమారు అరవై మూలతత్త్వాలే ఐనప్పటికి, వాటిని క్రమంగా ఏర్పాటుచేసి ఆవర్తపట్టికలో ఖాళీలు విడిచి, ఆ ఖాళీల నాక్రమించగల మూలతత్త్వాల గుణాలెట్టివో జోస్యంచెప్పేడు మెండెలైఫు. తదనంతరం క్రొత్త మూలతత్త్వాలు కనుగొనబడ్డాయి; అవి సరిగ్గా ఆవర్తన పట్టికలోనున్న ఖాళీ గళ్లలో నిమిడి పోయేయి. మూలతత్త్వాలు ౯౨ అనే నమ్మకానికి వ్యతిరేకంగా యురేనియం కంటె ఎక్కువపరమాణు భారంగల మూలతత్త్వం మన ప్రపంచంలోగాని, దూరతమ నక్షత్రాలలోగాని కనిపించలేదు. కాని మూలపదార్థాల సంఖ్యకు ౯౨ అవధి కాదని గత శతాబ్దంలో నిరూపింపబడింది.

పరమాణుసంఖ్య ౯౨ గల యురేనియం పరమాణువును న్యూట్రానుతో మర్దించగా, అది యురేనియం కేంద్రకంలో చిక్కుకొని, ఒక ఎలక్ట్రానును ఎగజిమ్మి, పరమాణుసంఖ్య ౯౩ గల మూలతత్త్వంగా పరివర్తన మొందింది. ఆ తత్త్వాన్ని నెప్ట్యూనియం అన్నారు. యురేనియం పరమాణువులను డ్యూటరానులతో మర్దించగా ఏర్పడినది పరమాణుసంఖ్య ౯౪ గల ప్లూటోనియం. యురేనియమునే అధికశక్తివంతమైన హీలియం కేంద్రకాలతో ఘట్టించినప్పుడు ఒక న్యూట్రానును, తదుపరి, ఒక ఎలక్ట్రాను విడిచిపెట్టి పరమాణుభారం ౨౪౧ గల మూలతత్త్వం ఏర్పడుతుంది. అదే అమెరీషియము. అమెరీషియమును న్యూట్రానులతో ఘట్టించినప్పుడు ఆ పరమాణు కేంద్రికం ఒక న్యూట్రానును పొట్టనిడుకొని, ఒక ఎలక్ట్రానును విసర్జించి పరమాణు సంఖ్య ౯౬ గల క్యూరియం ఏర్పడుతుంది. అపరం యురేనియం మూలతత్త్వాలీ నాలుగు కాక బెర్కిలియము, కేలిఫోర్నియం అను మరి రెండు మూల తత్త్వాలు, క్రమంగా పరమాణు సంఖ్య ౯౭, ౯౮ గలవికూడ కనుగొనబడ్డాయి. కాని, యీ పరమాణు లేవీ స్థిరమైనవి కావు. అవి త్వరగా యాదృచ్ఛికవిచ్ఛిత్తి నొందుటచే మానవుడు పరిశోధనకు పూనుకొనకముందే పూర్తిగా విచ్ఛిన్నమై యుండవచ్చు. జగత్తులో లేని మూలతత్త్వాలు ఆరింటిని—నెప్ట్యూనియం, ప్లూటోనియం, అమెరీషియం, క్యూరియం, బెర్కిలియం, కేలిఫోర్నియం—విజ్ఞానులు పరిశోధనాగారాలలో సృష్టించేరన్నది సామాన్యవిషయం గాదు.

పరమాణుదుర్గంపై దండయాత్ర గావించడం మరొక విధంగాకూడ లాభించింది. అనుక్షణం విపరీతమైన శక్తిని శూన్యాకాశంలోనికి ప్రసరిస్తూ సూర్యుడు నక్షత్రాలు క్షీణించిపోతున్నాయి. అట్లు యుగాలతరబడి క్షీణిస్తూన్నప్పటికీ, సూర్య నక్షత్రాలలో ఎన్నదగిన మార్పు కనిపించదు. ఏ వస్తువైనా మండుతూన్న కొద్దీ కృశించుట సహజమైనప్పుడు, సూర్యునిలో మార్పు కనిపించకపోవడానికి కారణ మేమైయుంటుందో గ్రహించడానికి విజ్ఞాను లూహిస్తూనే ఉన్నారు. ౧౦ ఏండ్ల క్రిందటివరకు వారి కృషి ఫలించలేదని చెప్పవచ్చు. పరమాణువులను మూలకణాలతో ఘట్టించి కేంద్రక పరివర్తన మప్పుడు బహిర్గమించు శక్తిని పరిశీలించినప్పుడు సౌరజ్వాలల రహస్యం బోధపడింది. భారతరమైన పరమాణు భారంగల యురేనియం, థోరియం వంటి మూలతత్త్వ పరమాణువుల స్ఫోటనంతో వెలువడు పరమాణు శక్తి వంటిదే, స్వల్పపరమాణు భారంగల కేంద్రకాలు సమ్మేళన మొందినప్పుడుసైతము విడివడుతుందని తెలిసికొన్నారు. కాగా, సౌరగర్భంలో ఆ విపరీత తాపక్రమ ప్రేషస్థితిలో, ఉదజని పరమాణు కేంద్రకాలు హీలియంగా రూపాంతర మొందుతున్నాయని, ఆ సమ్మేళనంలో, నాలుగేసి ఉదజని కేంద్రకాలు కలిసి ఒక హీలియం కేంద్రకమైనప్పుడు కొంత ద్రవ్యరాశి శక్తిగా మారుతూందని విజ్ఞానులు సహేతుకంగా నిర్ణయించడానికవకాశం కలిగింది. ఆ సమ్మేళనకు తోడ్పడుతున్నవి నత్రజని కేంద్రకాలు, కర్బన కేంద్రకాలు. ఇవి, ఉదజని కేంద్రకాలను ఒక్కొక్కటిగా పొట్టనిడుకొని, ఆ క్రియలో కొంత శక్తిని గామాకిరణ రూపంలో ప్రసరిస్తూ, నాలుగు ఉదజని కేంద్రకాలు చేరగానే వాటి నొక హీలియం కేంద్రకంగా బంధించి, పైకి నెట్టుతాయి; అవి యథా స్థితిని చేరుకొంటాయి. ఈవిధంగా, ఉదజని రూపాంతరంచేత సూర్యు డెంత

కాలమై మండుచున్నప్పటికి, వడివడి క్షీణించక దీపిస్తున్నాడు. పరమాణువుద్వారా నక్షత్రజీవిత రహస్యాల నన్వేషించడానికి విజ్ఞానులకు సాధ్యమైంది.

సూర్యుడెంతో దూరంగా నున్నప్పటికి, సూర్యునికి మనకుగల సన్నిహిత సంబంధాన్ని హెచ్చరిస్తూంటాయి, భూమి నాదరించుకొన్న అయన పొరలు. వాతావరణంలోని వాయువు సూర్య రశ్మిచే అయనీకరణ మొందుతుంది; అనగా, వాయువు, అణువులు విద్యుదావేశ పూరితము లౌతాయి. అవే అయనులు. ఈ అయను పొరలు భూమిచుట్టూ ఉన్నాయి. ప్రసార కేంద్రంనుండి వెలువడు రేడియో తరంగాలను, ఈ అయనుపొరలు పరావర్తన మొనరించి మన రేడియో సెట్లకు అందజేస్తాయి. సూర్యునిలో కల్లోలాలెక్కువయి, మచ్చలు పెరిగినప్పుడు, సూర్యునినుండి వచ్చు తీక్ష్ణ కిరణజాలానికి అయనపొరలు భగ్నమై రేడియో గ్రహణానికి అంతరాయం కలిగిస్తాయి. సూర్యునిలో మచ్చల గమనాన్నిబట్టి ఏ కాలంలో ఏ దేశమందలి రేడియో గ్రహణం చెడుతుందో విజ్ఞానులు చెప్పగలరు. రేడియో ఎంతదూరమైనా వ్యాపించగలదు. టెలివిషను ౫౦ మైళ్లకంటె ఎక్కువ దూరం వ్యాపించదు. కాని, గత ఫిబ్రవరి నెలలో ఇంగ్లండులోని టెలివిషన్ ఆపరేటర్లు ౧౩౮౦ మైళ్ల దూరంలోనున్న లెనిన్‌గ్రాడులో ప్రసారమౌతున్న బొమ్మలను గ్రహించారని, ౯౦౦ మైళ్ల దూరంలోనున్న స్టాకోమ్‌నుండి ప్రసారమౌతున్న శబ్దాన్ని విన్నారని వార్త. ఆనాడు సూర్యుడు అయన జ్వాలలతో దీపిస్తూ, మన అయన పొరలను తీవ్రంగా భగ్నం చేస్తున్నాడు; సూర్యునిలో మచ్చలు హెచ్చుగా నున్నాయి. ఆనాడు ఇంగ్లండుకి ఆస్ట్రేలియాకి గల రేడియో, ప్రసారం భగ్నమైంది. అయినప్పటికి టెలివిషన్ చిత్రాలు గ్రాహ్యమయే యున్నది, అన్వేషణకు మరికొన్ని మార్గాలు చూపింది.

రెండవ ప్రపంచ సంగ్రామంలో అభివృద్ధి చెందిన రాకెట్లు మన వాతావరణంగూర్చి విశేషజ్ఞాన మార్జించడానికి అవకాశమిచ్చేయి. వైమానిక రహితంగా, రేడారు మూలంగా నడుపుచున్న నేటి రాకెట్లు గ్రహాలకు కాలక్రమాన మానవుని తీసికొని పోగలవంటే ఆశ్చర్యం లేదు. ఈ మధ్య ఫ్లారిడాలో చేసిన ప్రయోగాలకు ముఖ్యులు కొందరు. జర్మనులు ప్రయోగింపనెంచిన వి. టూ. రాకెట్టు ౧౪ టన్నుల బరువున్నదా? మూతిలో ౭౦౦ పౌనులు బరువుగల చిన్న అమెరికను రాకెట్టుంచి, ఈ జతను కొకా క్రీటు విరామస్థానంనుండి ఆకాశంలోనికి విడిచిపెట్టేరు. వాటి గమనాన్ని దిద్దడానికి రెండింటిలోను గైరాస్కోపులున్నాయి. ఎగరవేయబడిన రాకెట్టు అట్లాంటిక్ మహాసముద్రం మీదుగా తూర్పునకుసాగి ౬౩ సెకండ్లలో ౯ మైళ్ల ఎత్తు చేరుకొంది. దాని గమనవేగం గంటకి రెండువేల ఏడువదల ఇరవై ఏడు మైళ్లు. అప్పుడు మూతిలోనున్న చిన్న రాకెట్టు విడిపోయి గంటకు మూడువేల ఆరువందల మైళ్ల వేగంతో దూసికొనిపోయింది. మరొక ౨౨ సెకండ్లలో పెద్ద రాకెట్టు 3౦ మైళ్ల ఎత్తు చేరుకోగా, విరామస్థానం వద్దనున్న రక్షాధికారి ఒక బొత్తాము నొక్కేడు. వెంటనే ఆ ౧౪ టన్నుల బరువున్న 'వి-టూ' రాకెట్టు తుత్తునియలై అట్లాంటిక్ తీరానికి ౫౦ మైళ్లు దూరంగా సముద్రంలో పడింది. చిన్న రాకెట్టు విషయం ఇంకా రహస్యంగా నుంచేరు. అది సుమారు ౫౦౦౦ మైళ్ల వేగాన్ని అందుకోగలదని అనధికారవర్గపు అంచనా.

గంటకు ౬౦౦ మైళ్ల వేగాన్ని మించిన వేగంతో ఆకాశయానానికనువైన 'జెట్' విమానాలను రాకపోకలకుపయోగించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. సామాన్యవిమానాలకి గాలిమార్గ మవసరము. గాలి లేని నిర్వాత ప్రదేశాలలో విమానం నిరుపయోగమే! కాని, జెట్ విమానాలకా ఇబ్బంది లేదు. శూన్యాకాశంలో నైతము ప్రయాణంచేయగల సామర్థ్యం వాటికుంది. జెట్ విమానాలే వాడుకలోనికి వచ్చినప్పుడు ఒక్క రోజులో భూప్రదక్షిణం చేసిరావచ్చును. దూరాన్ని ఉన్మూలించి, మానవదృష్టిలో ప్రపంచాన్ని సంకోచింపచేయగల అనేక యంత్రాలు చూచాయగా గోచరిస్తున్నాయి.

ఈ విధంగా విజ్ఞానం పురోగమిస్తూ నూతన రంగాలలో పరిశోధనలు చేయడానికి అవకాశం కలిగిస్తూంది. ఆ అవకాశాన్ని పురస్కరించుకొని, మానవాభ్యుదయానికి మాత్రమే విజ్ఞానాన్ని వినియోగిస్తూండినవరకు విజ్ఞానుల కృషి ఫలిస్తూంటుంది. మానవుడు మానవత్వాన్ని గోల్పోయిననాడు విజ్ఞానం యావత్తూ మానవక్షయానికే దారితీస్తుంది.*

* ఆలిండియా రేడియో, మద్రాసు వారి సౌజన్యంతో.

కథానిక:

# స్వంత ఇల్లు

●

శ్రీ పంతుల శ్రీరామశాస్త్రి

ఎవరయినా మనస్తత్వ పరిశోధకుడు ఫ్రీఎసోసియేషను మెథడు ప్రకారం (అంటే ఏదో ఒక మాట చెప్పి, వెంటనే తడుముకోకుండా ఏమాట నోటికివస్తే అది చెప్పడం) నన్ను పరీక్షిస్తూ 'చలమయ్యపంతులు' అంటే, తక్షణం నా నోటివెంట వచ్చేమాట 'స్వంత ఇల్లు'. అంతేకాదు, జ్యామెట్రీలో థీరమూ (సిద్ధాంతము) దాని కాన్వెర్సు (వ్యతిరేక సిద్ధాంతము) కూడా చాలా సందర్భాలలో నిజమయినట్టు, "స్వంతఇల్లు" అన్నమాటవిన్నా నాకు వెంటనే స్ఫురించేమాట 'చలమయ్య పంతులు' అనే. అంతగా అవి నా భావసంబంధం కలిగి ముడిపడి ఉన్నాయి నా మనసులో. ఈ రెండు మాటలున్నూ. కాబట్టే నేను ఇంత కాలమూయి, ఏదో యథాశక్తి డబ్బు ఆర్జిస్తూ, ఖర్చుపెడుతూ కూడా స్వంతఇంట యజమానిని కాలేకపోయేనేమో. అంటే ఆర్థికమయిన అశక్తి ఎల్లాగూ ఉందిగాని, దానిని అతిక్రమించడానికి తగినంతటి సంకల్పబలమూ, నిర్వహణ దీక్షా లభించకపోవడానికి కారణాలు బేరీజు వేసుకొని చూస్తే 'చలమయ్య పంతులు' 'స్వంత ఇల్లు' అన్న మాటలకి సంబంధించిన స్పష్టాస్పష్ట భావ పరంపరకి ఉంచుకొన్న స్థానం ఏమీ స్వల్పమయినది కాదు. అసలిప్పుడిది రాయడానికి పూనుకోడం కూడా, ఆ రెండు మాటలకీ నా మెదడుకీ ఉన్న అనవసరపు లావాదేవీలను ఎల్లాగో పరిష్కరించుకొని, ఎప్పటికయినా ఒక స్వంత ఇంటిదారుణ్ణి (ఇంటివాణ్ణి కాదు, అదయి చాలాకాల మయింది) కావాలనే సదుద్దేశంతోనే.

ఒకే సంఘటన ఒక్కొక్కరికి వాళ్ల దృక్కోణాల భేదంవల్ల ఒక్కొక్కవిధంగా అర్థం కావచ్చునన్న విషయాల్ని నాకు చిన్నతనంలోనే ఒక మాదిరిగా అర్థమయేలాగు చేసినకీర్తి చలమయ్య పంతులుకీ ఆయన స్వంతయింటికీ దక్కవలసిఉంది.

నేను పుట్టినది ఆ యింట్లో కాదటగాని, నేను మనుష్యులనూ, వస్తువులనూ జ్ఞాపకం చేసుకోగలిగినంత మట్టుకు ఆ యింటికి సంబంధించనివి లేవు. నా రెండవయేడు వెళ్లి మూడవఏడు వస్తూండగా ఆ యింట్లో ప్రవేశించారట మావాళ్లు.

అప్పటినుండి ఆ యింటినిగూర్చి నేను ఆడిన మాటల్లోనూ, తలచిన తలపుల్లోనూ 'మా యిల్లు' అన్న స్వకీయమయిన ధోరణితప్ప వేరేమీ ఉండేది కాదు. రానురాను ఏడెనిమిదేళ్ల వయస్సులో, ఇళ్ళల్లో అద్దెయిళ్ళూ స్వంతయిళ్లూ అంటూ ఉంటాయనీ, అద్దె యిళ్ళలోవాళ్లు, ఇళ్ల స్వంతదారుల ఇష్టాయిష్టాలనుబట్టి నడుచుకోవలసి ఉంటుందనీ, చూచాయగా తెలియడమే కాదు, మా యిల్లుకూడా అద్దెదేకాని స్వంతంకాదని తెలిసినా, రెంటికీ పెద్ద భేదం కనిపించేదికాదు. మనం ఉండడానికి బాధ లేనప్పుడు ఇల్లు ఎవరిదైతే మనకేం అని. అసలు లోపల్లోపల మా యింటినిమాత్రం, అద్దెదయినా, మేముఎన్నటికీ విడిచిపెట్టవలసిన అవసరం వస్తుందన్న ఊహ సైతం వచ్చేదికాదు.

సామాన్యంగా చిన్నతనంలో ఒక ఊరినుండి ఇంకొక ఊరువెళ్లడమన్నా, ఒక ఇంటినుండి ఇంకొక ఇంటికి మారడం అన్నా ఎంతో ఉత్సాహం కలుగుతుంది ; నాకూ కలిగి ఉండవలసిందే కాని అందుకు ప్రతికూలంగా కొన్ని కొన్ని పరిస్థితులు ఏర్పడ్డాయి. లేకపోతే నాపన్నెండవ పుట్టినదినం జరిగిన వారంరోజులనాడు మేము ఇల్లు మారవలసి వచ్చినందుకు నేను అంతక్లేశపడి ఉండకపోదును.

మాయింట్లో, అంటే చలమయ్యపంతులుగారి స్వంతయింట్లో ఒక అద్భుతమయిన జామిచెట్టు ఉండేది. చెపితే మీరు నమ్మరు, అసలిప్పుడు నేనే నమ్మలేకుండా ఉన్నాను, ఆ చెట్టు పళ్లూ వేరే ఏపళ్లు లేనంతటి తీపిని కలిగిఉంటాయని. అయినా అప్పుడు మరినాకు ఇప్పటివంటి సంశయగ్రస్తమయిన జ్ఞానం లేదుకదా, నమ్మినదేదో హృదయపూర్వకంగా నమ్మడమే. సరే మీరూ, పూర్తిగా కాకపోయినా, ఇప్పటి నామాదిరిగా అయినా, ఆ చెట్టుపళ్లు, తక్కిన చెట్లమాటకేం, చాలా మధురమయినవి అని ఒప్పుకొందికి ఏమీ అభ్యంతరం లేదనుకొంటాను.

అసలు నాకు ఆ చెట్టంటే ఉండే అభిమానం కేవలం దాని పళ్ళతీపికి సంబంధించినదే కాదు; చిన్నతనంలోని స్నిగ్ధమయిన స్నేహమే కారణమనుకుంటాను. మేము ఆయింటిలో ప్రవేశించేసరికి అది ఇంకా బాగా కాపుపట్టని చిన్నమొక్క. దాని సంరక్షణ బాధ్యత యావత్తూ మా చిన్నక్కయ్య తనమీద వేసుకొంది. నాకు కొంచెం బాగా మాటలు అర్థంచేసుకోడం వచ్చిన దగ్గరనుండీ, మా అక్కయ్య నాచేత ఎన్నో నాకు ఇష్టంలేని పనులను చేయించగలిగేది. ఆ చెట్టును తనతోపాటు అత్తగారింటికి తీసుకొని పోకుండా, నాకోసం ఉంచివేసే షరతుమీద. అటువంటి చెట్టును విడిచిపెట్టడం అంటే అంత తేలికయినపనా?

అంతే కాదు, మా పెరట్లో పెద్ద మామిడిచెట్టొకటి ఉండేది. దాని కొమ్మలు కేవలం మాకోసమే పుట్టినయ్యన్నట్టు, నేలకి అయిదారడుగుల ఎత్తున సమానాంతరంగా ఉండేవి; చక్కగా నిలబడి పగుగత్తడానికి వీలుగా. నేనూ మా మేనల్లుళ్ళిద్దరూ, (మా పెద్దక్కయ్య కొడుకులు, ఒకడు నాకంటె ఒక సంవత్సరం పెద్ద, ఇంకొకడు ఒకసంవత్సరం చిన్న) ఇంకా మావీధిలోని మరి అయిదారుగురు సహాధ్యాయులూ కలిసి, కోతి కొమ్మచ్చి ఆటలో, వేసవి కాలపు రెండు నెలల శలవుల్నీ రెండున్నర రోజులుగా గడిపేసే వాళ్లం. శివరాత్రికి చింత సిక్కంటే, అంటారు మామిడి పిందెలగురించి. మా చెట్టుకింది గింజలం తేసి పిందెలు పెట్టినది మొదలు శివరాత్రిలోపుని అంతచెట్టునీ, చిట్టచిగురు కొమ్మని సైతం ఒక్క పిందయినా మిగలకుండా దూసేసేవాళ్లం. అయితే పెద్దదయిఉండేవరకు ఉన్నా, భరించరాని పులుపు గనక మావాళ్లుకూడా ఏమీ అనేవారుకారు. ఒకవేళ అన్నా లక్ష్యపెట్టి ఉండేవాళ్ళం కామనుకోండి.

అక్కడితో ఆగినా బాగుండును. నాకాయింటితో అనుబంధాన్ని మరీ బలపరచే ఇంకొక అంశం కూడా ఉంది. 'మా యింట్లో, నాగదిలో (మా అన్నయ్య పెద్ద చదువుకి వెళ్లిపోయేక వాడికి శలవులేని కాలం వాడిగది నా చదువు గదిగా ఉపయోగపడేది) మేము స్థాపించిన "వేణుగోపాల్ సినీమాథియేటరు' మాట ఏమిటి చెప్పడం? మేము మామూలు సినీమా థియేటర్లలాగ పూర్తిగా అధునాతన నాగరకతలో పడక, సినీమాలతోపాటు ప్రాచీన నాగరకతా సూచకంగా 'చర్మనాటకాలు' (తోలుబొమ్మలాటకి అప్పుడేదో గొప్పపేరుగా అంటూ ఉండేవారు) కూడా ఆడిస్తూ ఉండేవాళ్లం. అసలు మా బొమ్మలన్నీ అట్టముక్కలతో చేసినవే అయినా తక్కిన అన్ని లక్షణాలూ ఉన్నాయిగనుక మాదిమాత్రం తోలుబొమ్మలాట కాకతప్పదుకదా!

సరే, ఇంతమాత్రంలో మునిగిపోయిం దేమిటి, ఇంకొక యింటిలోమాత్రం ఈ వ్యవహారాలు జరిపించకూడదా అంటారేమో. అక్కడ ఇంత ప్రత్యేకంగా ఇంట్లోని పెద్దవాళ్లతో సంబంధం లేకుండా ఒక గది ఉండవద్దూ? ఉంటేమాత్రం......

ఒకమారు మా నాన్నగారి స్నేహితుడు చంద్రశేఖరంగారని ఆయన మాఊరు ఏదో పనిమీద వచ్చి ఒక వారంరోజులున్నారు. ఆయన గీసిన చిత్రాలు అప్పుడప్పుడు పత్రికల్లో వస్తూ ఉండేవి. అవి చూసి మావాళ్ళంతా ఎంతో గొప్పగా చెప్పుకొని, ఇంటికి వచ్చిన పెద్దవాళ్లందరికీ చూపించేవారు. నిజం చెప్పవద్దూ, నాకుమాత్రం అవేమిట్లో అలికేసినట్లుగా, వంకలువంకలుగా ఉన్నట్లుండేవి. అంతకంటె మా హైస్కూలు డ్రాయింగుమాష్టరుగారు వేసే బొమ్మలు ఎంతో ముచ్చటగా ఉండేవి. అయితే మావాళ్లు, మీ మేష్టరుగారు వంటి వాళ్ల బొమ్మలకంటె, ఎంతో గొప్పవి చంద్రశేఖరంగారి బొమ్మలంటే నమ్మాలని ఉండేదికాదు.

ఆయన ఒకనాడు మధ్యాహ్నం నిద్ర పట్టక ఊసుపోక, మా కళాప్రదర్శనాన్ని విలోకించడానికి

ఏ తెంచేడు. చూసి, చూసి, చివరకు, "ఏమోయి సూర్యం, మీ సినీమాథియేటరు పే రేమిటి?" అన్నాడు. 'అదుగో చూడండి సార్, వేణుగోపాల్ సినీమా' అని గోడమీద నేను పెన్సిల్‌తో, రాసిన పేరు చూపించాను. ఆయన 'ఛా, ఇలా నీ హాలుంటే ఎవళ్లు చూడడానికి వస్తారు? నేను రాస్తాను పేరు' అన్నాడు. రంగులు లేకపోతే, నల్లసిరా, ఆకుపచ్చసిరా, నాదగ్గ రున్నాయి. మా నాన్నగారి టేబిలుమీదనుండి ఎఱ్ఱ సిరా తీసుకొనివచ్చాను. ఇంతా చేసి ఆయన పేరు అక్షరాలతో రాస్తా రనుకొన్నాను.......తరవాత నేను పెద్దవాణ్ణయి చిత్రాల విలువలు కొంత తెలుసుకొన్నా ఆనా డాయన చిత్రించిన వేణుగోపాలుడి బొమ్మమీద ఉండే ప్రత్యేకాభిమానం పోలేదు. అప్పట్లో మా స్నేహితు లందరి లెక్కా ప్రపంచ చిత్రకారు లందరిలోనూ చంద్రశేఖరంగారు అగ్రగణ్యుడు; ఆయన చిత్రాలలో మకుటాయమానమయినది మా సినీమాహాలు గోడమీద ఆయన చిత్రించిన వేణుగోపాలుడి చిత్రము. పరధ్యానంగా ఉంటే, బొమ్మలతోపాటు వేణువునాదంకూడా వినబడినట్టయేది మా చెవులకు. ఆ తరవాత బొమ్మలలోనూ నిజంగానూ, ఎన్నెన్నో ఆవులను చూసేను. కాని, అంత అందమైన ఆవులుమాత్రం మరి కనబడలేదు. కృష్ణుడలా మురళి మ్రోయిస్తూఉంటే, అతనికి కనబడకుండా, మనకి కొంచెం కనబడేలాగ, ఒక చెట్టు ప్రక్కను దాగొని వింటూండేది, రాధ. మరిన్ని మాట లెందుకు, మా ప్రదర్శనాలకు మేము నియమించుకొన్న కాణీ టిక్కెట్టు కేవలం ఆ బొమ్మని తనివితీరా చూడ్డానికి ఇచ్చినా సబబే ననిపించేది. అటువంటి అద్భుతమయిన సినీమాథియేటరును విడిచిపెట్టి, ఇంకొక ఇంటికి పోవాలన్నప్పుడు, నాకు ఉత్సాహం కలగలేదంటే అందులో అసందర్భం ఏముంది?

మా ఆటపాటలంటే తరుచు మండిపడే మా నాన్నగారికికూడా అంత మంచి బొమ్మని విడిచిపెట్టడం కష్టంగానే తోచింది. కాని, ఆయన అట్టే విచారించనక్కర లేకుండా అదంతా నా తెలివి తక్కువగానే జమకట్టేరు. "ఓరే సూర్యం, నువ్వు వెఱ్ఱి వెధవవిగాని, ఆయన చంద్రశేఖరంగారు బొమ్మ రాస్తానంటే, అమ్మ నడిగి ఒక మంచి తెరగుడ్డో, కేన్వాసుముక్కో తెస్తావు గాని, వట్టి గోడమీద బొమ్మ రాయించుకోడం ఏమిటి? ఇదేం మన స్వంత ఇల్లా? కాకపోయినా, నీ మొగం గాని, చదువూ సంధ్యా మానుకొని, సినీమాలు బొమ్మలాటలూ ఏమిటి?" అని వెళ్ళిపోయేరు. నేను ఏమీ సమాధానం చెప్పకపోయినా, ఆయన చెప్పినంతగా నాలో తెలివి తక్కువ ఉందనిపించలేదు. కాక, అదివర కెప్పుడూ నేను 'ఆ యింటిని మరొకళ్లయిల్లు' అన్నదృష్టితో చూడనేలేదు. ఇన్నాళ్ళు ఉండి, ఇప్పు డింతలా పుట్టిమునిగిపోయినట్టు మారిపోవలసిన అవసరం ఏమి వచ్చిందో నాకు అర్థంకాలేదు.

పైగా, మేము అవతల వెళ్లవలసిన ఇంటిలో చెట్లమాట అటుండగా పెరట్లోగాని, పెరట్లోగాని, సిమెంటుగచ్చు చేయబడని భాగం ఒక అంగుళం అయినా లేదు. ఇల్లంతా సన్నంగా ఒక పొడవు గొట్టంలా గుంది. నాకు వేరే గది ఎల్లాగూ లేదు. అయినా మా నాన్నగారికిమాత్రం ఆ ఇల్లు చాలా బాగానే ఉందిట. తన ఆఫీసుకీ, తక్కిన యింటికీ సంబంధంలేకుండా ఉండడం తనకు ప్రశాంతంగా పని చేసుకుందికి వీలుగా ఉంటుందట. ఆయన పని ఏమిటో అప్పుడు తెలియకపోయినా తరవాత తరవాత తెలిసింది. ఇల్లస్ట్రేటెడ్ వీక్లీపజిల్సు సాల్వ్ చెయ్యడమూ, ప్రపంచంలోని గొప్పగొప్పవాళ్ల జాతకచక్రాలన్నీ వేసి ఫలితాలు రాస్తూఉండడమూ, ఇంకా ఇటువంటి మరికొన్ని పనులే ఆయన ముఖ్యమయిన ఆఫీసుపని అని తెలుసుకోగలిగేము. ఏమయితేనేం, అప్పటిమట్టుకు, నాన్నగారిపని పిల్లలగోలవలనగాని, ఆడవాళ్ల కబుర్లవల్లగాని చెడిపోకపోవడం చాలా ముఖ్యమయినదికదా. అంతే కాదు, మా నాన్నగారు చూసిన సదుపాయము. అప్పుడు మా యింటికి ఇస్తున్న అద్దెకంటె కొత్తయింటికి అయిదు రూపాయలు అద్దె తక్కువట. అంటే ఇప్పుడు హెచ్చిస్తామన్న అయిదూ, అక్కడ తగ్గినఅయిదూ కలిపి నెలకి పదిరూపాయలు నెలకయే ఖర్చులో కూడిక జరుగుతుందని, మా అమ్మకి బోధపరిచేడు. అసలు మా అమ్మకి కూడిక చేయడం ఒకరు చెప్పనక్కరలేదు; అది ఆమెకు జన్మతః వచ్చిన విద్య.

ఆయీ కారణాలవల్ల ఇల్లు మారడం నిశ్చయం అయిపోయింది. కాని, నాకు మాత్రం ఉండబట్టక,

అమ్మ నడిగేను, మార్పునుగురించి. అప్పుడు అమ్మ చెప్పిన మాటలనుబట్టి నాకు మొట్టమొదట చలమయ్య పంతులును గురించి తెలిసింది. తెలియడమేమిటి, నాకు చలమయ్య పంతులుమీద కలిగినంతటి ఆగ్రహం కీచకుడిమీద భీముడికికూడా కలిగివుండదు. అయితే, ప్రదర్శించడానికి ఎదుట మనుష్యులు లేని, పరోక్షమయిన సాత్త్వికాగ్రహమయిపోయింది నాది.

కొత్త ఇంట్లోకి మారిన తరవాత కూడా ఎటునించేటు చూసినా, నా ఆటపాటలలోని ఆనందాన్ని అపహరించిన నేరానికి నాకోపానికి గురికావలసిన మనిషి ఒక్క చలమయ్యపంతులే కనిపించేవాడు. ఏమంటే ఎంతగా అనవసరంగా చీవాట్లు పెట్టినా కట్టుఖాయిదా చేసినా అమ్మా నాన్నా మీద బాగా కోపం తెచ్చుకోబడదుకదా; ఇక మరి నన్ను నా ఆటలనుండి, స్నేహితులనుంచి దూరం చేసిన ఘోరపాతకానికి ప్రతిఫలంగా నా మనస్సులో నేను వేసిన ఎన్నెన్నో చిత్రవిచిత్రములయిన శిక్షలకు పాత్రుడు కాక తప్పేది కాదు చలమయ్యపంతులుకు.

అలా ఒంటరిగా కూర్చొని, నేను చదివిన, విన్న, కలల్లోనూ, చూసిన సినీమాల్లో నాయకులలోకి నేను పరకాయప్రవేశం చేసి, ప్రతినాయకులలోనికి చలమయ్యపంతులును ప్రవేశపెట్టి ఊహామాత్రంగా నడిపే కథలూ నాటకాలూ పూర్తి తృప్తి నివ్వలేకపోయేవి. కదలిక అమితంగా కావలసిన ఆ వయస్సులో.

అప్పుడప్పుడు అన్నయ్య శలవులకి రాకపోతాడా, అప్పుడు వీడిపని పట్టించకపోతానా అని అనుకొనేవాణ్ణి. అంటే నా ఉద్దేశం మా అన్నయ్య, అనంత భుజబలశాలి కావడమే కాకుండా, నేనిలా సూచనమాత్రంగా అనేసరికల్లా ఎవరినంటే వారిని చితగ్గొట్టి వచ్చేస్తాడని—అంతేకాదు, మా అన్నయ్య అదివరకు శలవులకి వచ్చినప్పుడు అంటూ ఉండేవాడు, ఎవడో ఒక కాఫీహోటలు యజమానినిపట్టుకొని, వాళ్ల కాలేజీ పత్రికలో తెగ ఏకేసేనని. అదేమిటో నాకు స్పష్టంగా అర్థంకాకపోయినా, ఆశిక్ష ఏదో, ఈ చలమయ్యపంతులుకు ఎందుకు వెయ్యకూడదా అనీ. అప్పుడు అతను, పశ్చాత్తాపపడి చేసిన తప్పుక్షమించమనివచ్చి, మళ్లీ, బాబూ మీరుహాయిగా మీయింట్లో ఉండండని అంటాడనీ ఎన్నెన్నో ఊహిస్తూ ఉండేవాణ్ణి.

అయితే ఇవన్నీ నన్ను నేను సమాధానపరచుకొందికి చేసే ఊహలే అని నాకూ కొంత తెలియక పోలేదు. మావాడువచ్చినా వాడితో ఇటువంటి సంగతులు మాట్లాడుతానా? వాడు పరీక్షలవగానే వాళ్ళ స్నేహితుల ఊళ్లూ, మా పెద్దక్కయ్యగారి ఊరు, మా చిన్నాన్నగారి ఊరు అన్ని ఊళ్ళూ తిరిగి తిరిగి వచ్చేడు. వచ్చిన మర్నాడే వాళ్ల పరీక్షాఫలితాలు పేపర్లలో వచ్చేయి. వాడు, మరికొన్నాళ్లు రాకపోయినా బాగుండిపోవును. పరీక్షపోయినందుకు, మా నాన్నగారు అగ్నిరుద్రుడై పోయేరు. మావాడు కూడా ఏమీ తక్కువ వాడుకాడు. పరీక్షపాసయితే గాని యీ యింట్లో మరి అడుగుపెట్టనని కాగితం రాసిపెట్టి వెళ్ళిపోయేడు. ఆ వెళ్లడం అంతే. మరి ఇంటికి ఉత్తరమయినా రాయలేదు. ఎవరినీ తెలియని కొత్త ఊరుకివెళ్లి, అక్కడ నానారకాల అవస్థలూ పడి, పరీక్షకి తయారయాడట. కాని, తీరా వేళకి బ్రహ్మాండమయిన జ్వరం. అయినా అలాగే వెళ్లి రాయడానికి ప్రయత్నిస్తే, కాలేజీ ప్రిన్సిపాలు బలవంతంగా హాస్పిటలులో ప్రవేశపెట్టారట. మళ్లీవారు పరీక్ష ఏమో రాశాడుగానీ, మరి మాయింటికి రాలేదు. అప్పుడు వాణ్ణి పరీక్షచేసిన డాక్టరుగారు క్షయ చాలా బాగా నాటుకొందని టెలిగ్రాము ఇస్తే, అమ్మా నాన్నా పరుగెత్తుకొని వెళ్ళేరు. కాని, అప్పటికి వీళ్లు వెళ్లి చేయగలిగినస్థితి దాటి పోయినది. తరువాత వాడు శానిటోరియంలో వీలయినంత బాగా ఉండడానికి మా నాన్నగారు ఏమాత్రమూ వెనుదియ్యకుండా ఖర్చుపెట్టేరు. ఆ పెట్టిన ఖర్చులో నాలుగవవంతు పరీక్ష నిమిత్తం వృధా అయిందని, బాధపడి, వాణ్ణి బాధపెట్టి ఉండకపోతే, వాడికి క్షయ వచ్చి ఉండేది కాదని నా నమ్మకం. చాలా మంచి పరిస్థితుల్లో ఉన్నవాళ్లకి కూడా సంపర్క దోషంవల్లగాని, వారసత్వంగాగాని, వ్యాధివస్తే రావచ్చును గాని, సరిఅయిన గాలి, వెలుతురూ, భోజనమూ విశ్రాంతి లేనివాళ్లకి మాత్రం ఇది ఏ స్వల్పసంపర్కంవల్ల నయినా అతి సులభంగా సంక్రమించగలదు అని డాక్టర్లు చెప్పేమాట నాకు నిజంగా వేదవాక్యమే.

మావాడు అలా పోయినతరవాత నా చదువు సంధ్యలను గురించిన కట్టు ఖాయిదాలు కొంతవరకు సడలేయి. మా నాన్నగారు ఏ కొంచెమో పూర్వపద్ధతిని నడపబోయినా మా అమ్మ పూర్తిగా నా పక్షాన ఉండేది. మా నాన్నగారికికూడా లోపల్లోపల భయమే, నేను ఎక్కడ ఇల్లువిడిచి పారిపోతానని.

కట్టు ఖాయిదాలు సడలడం మూలాన, నా స్కూలు, కాలేజీ మార్కులు కొంత తగ్గడం తప్ప విశేషించి ఏమీ నష్టపోలేదని అనుకొంటున్నాను

వయస్సుకి తగిన స్నేహితులు లేకపోవడంవల్ల బలవంతంగా కలిగిన ఒంటరితనమూ, మా వాడి అకాల మృతిని గూర్చిన వ్యథా, తరవాత కొంత కాలానికి నన్ను ఒక మాదిరి రచయితగా చేసే యనుకొంటాను. ఆ కొత్త ఉత్సాహంలో (ఉబలాటమే) మాఅన్నయ్య ఉండిఉంటే చేసి ఉండవలసినపని, చలమయ్య పంతులు గారిని, ఆయన దౌష్ట్యాన్ని ప్రపంచానికి అద్దంలో చూపించినట్లు ప్రతిఫలించేలాగ చెయ్యాలని. అంటే అప్పుడు నేను అనుకొనే భాషలో, బాగా మరి తలెత్తుకోలేనట్లు ఏకాలని, ఎన్నెన్నోమార్లు అనుకొన్నాను. అయితే ఆ ఉబలాటాన్ని ఎలా నిగ్రహించుకో గలిగేనో నాకే ఆశ్చర్యంగా ఉంది. అయితే అందుకు కారణం ఒకటిమాత్రం స్పష్టంగా కనిపిస్తుంది. తక్కిన చిన్నచిన్న కథలలాగ నాటికలలాగ దాని విషయంలో నేను తృప్తిపడదలచుకోలేదు. అవతల అతగాడికి దుర్భరమయిన అవమానం కలిగించడమే కాకుండా, అతణ్ణి గురించిన రచన, నా రచనల్లో వాస్తవికతకీ, వ్యంగ్యానికీ, ఆదర్శాలకూ, ఇంకా ఇంకా నేను వాంఛించే అన్నిటికీ మేలుబంతిగా ఉండాలన్న అత్యాశవల్లనే కథానికగా రాయాలనుకొన్నప్పుడు, అంతకంటె నాటకమయితే, సమర్థులయిన నటులు ఉచితమైన హావభావవిచేష్టలతో ప్రదర్శించినప్పుడు, పండితపామరులు యావన్మందికీ నేను ఇవ్వదలచిన సందేశాన్ని సక్రమంగా ఇవ్వడం జరుగుతుందనిపించేది. తీరా నాటకం మొదలు పెట్టేసరికి, అందులో పాత్రల ఆంతర మనోభావాలనూ, సంఘర్షణలనూ విపులీకరించి రచయిత వ్యాఖ్యానం చెయ్యడానికి సావకాశం తక్కువ కావడంవల్ల, నాటకంకంటె కథే శ్రేష్ఠతరమని అనిపించేది. ఇంకా, మరికొన్ని సమయాల్లో ఈ అభిప్రాయాలనే కేవలం కథ, నాటకం అన్న బురఖాలు లేకుండా స్వచ్ఛమయిన వ్యాసరూపంలో ప్రకటించాలని కూడా అనుకోకపోలేదు.

తరవాత తరవాత ప్రపంచం నాకూ చలమయ్య పంతులుకూ సంబంధించినదే కాక చాలా విశాలమయినదన్న అభిప్రాయం ఏర్పడిన తర్వాతకూడా, మా, అంటే, నా మనస్సులోని మాయిద్దరి మధ్యాగల విభేదము ఒక తరహానుండి ఇంకొక తరహాకి మారింది తప్ప, పూర్తిగా అంతరించిపోలేదు. ఇల్లులేని, ఇళ్లనుండి బలవంతంగా వెళ్లగొట్టబడిన పీడిత తాడిత అధఃపతిత అద్దెయిళ్ల నివాసుల ప్రతినిధిని నేను, డబ్బు సేకరణ తప్ప ప్రపంచమే లేని, క్షుద్ర, సంకుచిత, కఠిన కర్కశ గృహయజమానుల వర్గానికి ప్రతినిధి చలమయ్యపంతులు. ఇవి మా అంతస్థులు.

అంతదృఢంగా అనుకోగలిగి కూడా ఆరోజుల్లో నేను ఆయన్ను గురించి కథ రాయలేకపోయేను. ఇక ఇప్పుడు రాసి మరి ప్రయోజనం లేదని తెలిసీ, ఏదో ఈ విడని బంధాన్ని తెంపుకోవాలన్నట్లుగా రాస్తున్నాను.

ఆయనగురించి, ఆయన ఇంటిని గురించి అనుకొంటూ ఉండడమే తప్ప, ఆయనతో నాకు వ్యక్తిగతంగా పరిచయం ఏమీ లేదు ; ఏదో రెండుమూడు మార్లు కలిసేను. అయితే, ఆ వెడల్పు తక్కువపంచ, ఆ ఒక ప్రక్కదారంకట్టిన సులోచనాలు, తనకంటె ముసలిదయిన కోటు—ఆయన్ని తెలియని వారెవరు గనక ?

ఆయన వక్తే కాదు, ఆయన ఇంటిలో దిగబోయే వారిని ఇంటికి ఉన్న సదుపాయాలగురించి ఒక్కొక్క అమరిక ఏర్పరచడానికి ఎంతెంతఖర్చు అయినది అన్న విషయాన్నిగురించీ, ఆయన ఉపన్యసించే ధోరణికూడా చాలా మందికి సుపరిచితమే. ఏ కుమార్తె తండ్రికూడా తన కుమార్తె గుణగణాలను కాబోయే అల్లుడివద్దా అతడి బంధుసముద్రులవద్దా అంతటి పరవశత్వంతో వర్ణించిఉండరు; ఏ కవిపుంగవుడూ సానుభూతిమంతులయిన శ్రోతలవద్ద తన కావ్యంలోని పద్యాలను అంతకంటె అభిమానంతో చదివి, ఆసక్తితో వాచ్యవ్యంగ్య పరమార్థాలను ఉద్బోధించిఉండడు; అంతటి తన్మయత్వం కలిగి

స్తుంది, చలమయ్యపంతులుకు తన స్వంత ఇంటిని గురించిన ప్రస్తావన. అవతలి మనుష్యులు ఇదంతా విని ఆనందిస్తున్నారా లేదా అన్నదానితో ఏమీ సంబంధం ఉండదు ఆ ధోరణికి; కొందరు కొందరు మహోపన్యాసకులు వేదిక ఎక్కే సరికి తమ చుట్టూ ఉన్న విశ్వాన్నే మరచి, శ్రోతల ఇష్టాయిష్టాలను అర్థం చేసుకోనే శక్తినీకూడా లక్ష్యం చేయకుండా కేవలం ఉపన్యాసకళకోసమే అన్నట్టుగా ఉపన్యసించే పద్ధతికి కొంత దగ్గరగా ఉంటుంది ఆయన ధోరణి.

అయితే నిజానికి కూడా ఆ యింటివంటి వసతి గలది మా ఊళ్లో మరొకటి లేదనిపిస్తుంది. అంతకంటె బలమూ, దళమూ ఎత్తూ కలిగి, ఎక్కువ విలువచేసేవి చాలా ఉన్నాయి. కాని, ఎక్కువమంది పిల్లలూ పాపలూ కలిగిన గృహస్థులు హాయిగా జీవించడానికి మాత్రం దానితో సమానమయినది ఇంకొకటి లేదు అన్నమాట ఇప్పుడు నే ననుకొంటున్నదే.

అయితే ఆయీ అంశాలు అందరికంటె బాగా చలమయ్యపంతులుకే తెలుసును. ఆయన అంటూ ఉండేవాడు, "నేథవ గదుల కేముందండీ, అంగుళం జాగా విడిచిపెట్టకుండా అంతా సిమెంటుగచ్చు చేసి, పిచికగూళ్లలాగు, జైలుగదులలాగ, ఎన్నెన్నో కట్టేవచ్చును. అంతలోనే సదుపాయమూ, సౌఖ్యమూ వచ్చేమాటయితే, మన ప్రాచీనులలోనే కాదు ఇప్పటి పాశ్చాత్యులలో కూడా ఇంతగా వాస్తుశాస్త్రం అభివృద్ధి పొందడం దేనికి? మనపాటి గదులు కట్టడం తెలియకా, వాళ్లు అన్నిరకాల ప్లానులు తయారు చెయ్యడం?" అని. చలమయ్యపంతులుకి ఇంగ్లీషు కూడా వచ్చును. రావడమంటే ఆయన పూర్వపు మెట్రిక్యులేటు. కాగా, తత్ఫలితమయిన ఇప్పటి బియే లకంటె మాకే ఎక్కువ ఇంగ్లీషు వచ్చు నన్న గర్వం కూడా ఆయనలో మిక్కుటంగానే ఉండేది. గర్వం మాట ఎలాఉన్నా ఆయన, అవసరంవస్తే, అంటే ఆయనకు కాస్త ఉత్సాహంగాని ఉద్రేకంగాని కలిగితే మరి తెలుగు పనికి వచ్చేదికాదు; రాజభాష అయిన ఆంగ్లేయంలోనే పడపడపడ మాట్లాడేవాడు.

అయితే ఇంటిని చూపట్టే సమయంలోని ఆయన ప్రసన్నమూర్తిని చూసినవాళ్లెవళ్లూ ఆయన తలుపుకోంటే, బలవంతంగా ఇంటిని ఖాళీచేయించే సందర్భాల్లో ధరించగల ఉగ్రమూర్తిని ఊహించలేరు.

తెలిసినవాళ్లకి కూడా పోనీ, తరవాత ఏమయితేనేం, కొంతకాలం ఆ యింటిలో ఉండగలగడంచాలు నన్నట్లనిపించేది. అసలు నేనే, ఆయిల్లు రెండువాటాలుగా ఇయ్యబడేయడల ఒక వాటా తీసుకొందామని ప్రయత్నించాను; కాని చలమయ్యపంతులు మాత్రం కంఠంలో ప్రాణం ఉండగా మరి పదిహేను రూపాయలు ఎక్కువవస్తూ రావడానికి సావకాశం ఉన్నా, ఇల్లువాటాలు చేసి అద్దెకిచ్చే పద్ధతికి అంగీకరించలేదు. "నేనుఅది ఒక్కకుటుంబం ఉండానికి అన్న ఉద్దేశంతో కట్టేను, రెండువాటాలకి తగినట్లుగా కట్టలేదు, ప్రజలని ఇరికించి బాధపెట్టడం నాకు ధర్మంగాతోచదు; నాకు ధర్మంగా తోచని పని నాచేత ఎవ్వరూ చేయించలేరు" అంటూ ఉండేవాడు. ఆయన కేవలం డబ్బుదాహం మూర్తీభవించిన షైలాకుఅనుకోందికి నాకుఇదే ఒక ప్రతిబంధకంగా ఉండేది. అంతేకాదు, ఒక్కొకప్పుడు పట్టుదలకోసం ఒకటి రెండు నెల్లు ఇల్లుఖాళీగా అయినా ఉంచేవాడుగాని తనకి ఇష్టంలేని రకంవాళ్లు దిగడానికిగాని, తను ధర్మము అనుకొన్న అద్దెకు దమ్మిడీ తగ్గడానికిగాని అంగీకరించేవాడు కాదు.

* * * *

చలమయ్యపంతులుకు మొదట్లో ఏ ఒకదాన్ని నమ్ముకొన్నా గడవదన్నట్టుగా ఉండేది, వారసత్వంగా సంక్రమించిన భూమిన్నీ, స్వయంశక్తివల్ల చేస్తున్న ఉద్యోగమున్నూ. భూమికోసం ఉద్యోగం విడిచిపెట్టబడదుకదా, అందులో ముందుముందు హెడ్ క్లర్కు అయేసావకాశం కూడా ఉంటున్నప్పుడు. అలాగని ఇందులో కూరుకొని ఉండిపోతే, అక్కడ 'పండబారినపొలం మెంపుబారక పోయినా, ఎప్పటికంటె బాగానే పండుతున్నా, తనకి వచ్చే సిస్తు మాత్రం అతి సామాన్యుడయిన విద్యార్థికి పరీక్షలో వచ్చేమార్కుల కాతనులాగే వచ్చేది.

అందుచేత అది అమ్మివేయడం నిశ్చయం. అయితే ఆడబ్బుతో ఏం చెయ్యడం? చాలా రోజులు ఆలోచించాడు. కంపెనీలు మొదలయివాటిలో షేర్లయితే, కొన్నేవరకే గాని తరవాత మన ప్రమేయం ఏమీ ఉండదు. బాగుపడినా, చెడినా, మనకి మాత్రం

ప్రతినిత్యమూ మన ఆస్తిమీద హక్కు ఉన్నట్టు కనబడదు. కాక, అటువంటివన్నీ నడిపే, మనుష్యులకు లాభాలు చేకూర్చే వేగాని, సామాన్యులకు వీటివల్ల పెద్ద లాభం ఏమీ ఉండదు. ఇక వడ్డీవ్యాపారం చెయ్యాలంటే అది బాగానే ఉంటుంది గాని, సమయాసమయాల్లో చాలా కఠినంగా ఉండవలసివస్తుంది; కాక, ఏవయినా మొండిపద్దులుంటే కోర్టులకికూడా వెళ్ళవలసివస్తుంది; ఇంతాచేసి మానవదేహం శాశ్వతం కాదు, తాను రేపొద్దున్న హఠాత్తుగా గాని పోతే, రావలసిన పద్దులన్నీ సక్రమంగా వసూలు కావన్నది నిస్సంశయం.

ఇక, మన హక్కు ఎప్పటికీ పోకుండా, ఉందని ప్రతినిత్యమూ సాక్ష్యంగా కనిపిస్తూ, శాశ్వతంగాఉంటూ, దానిమీద నెలనెలా జీతంలాగ కొంత నికరమయిన రాబడి వచ్చేందుకు అనుకూలమయిన పద్ధతి స్వంత ఇల్లుకట్టుకోడమే అనే నిర్ధారణకు వచ్చేడు.

ఇల్లుకట్టిచూడు, పెళ్ళిచేసిచూడు అన్న లోకోక్తిలో మొదటి దానిలో ఉన్న కష్టంలో దశాంశమయినా రెండోదానిలో లేదని చలమయ్య పంతులు విశ్వాసం. ఏమంటే అతడా విషయాన్ని అనుభవపూర్వకంగా తెలుసుకొన్నాడు. ఇక మరెవరయినా తమ అనుభవాలు వేరేవిధంగా ఉన్నాయన్నా నమ్మే మనిషికాడు చలమయ్య పంతులు. ఏదో ఒక కంటికి కనబడే వాస్తవికమయిన పరిమాణం అంటూ లేకుండా, మానసికములయిన అనుభవాలను అభిప్రాయాలను తూచి తారతమ్యం తెలుసుకోడం సులభంగా తేలేపనా? ఒకరికి బ్రహ్మాండంగా కనిపించేది ఇంకొకరికి అతిక్షుద్రంగా కనిపిస్తుంది. చలమయ్య పంతులు తన ముగ్గురు కొడుకులకీ, ఒక్కకూతురికీ పెళ్లిళ్లు చేసేడు; గాని, ఆయా సందర్భాలలో పడిన శ్రమ అతనికి శ్రమ అని అనిపించ నేలేదు.

కాని, ఇల్లుకట్టడంలో మాత్రం అంతసులువుగా బైటపడలేక పోయేడు. భూమిఅమ్మగా వచ్చిన డబ్బు, అదివరకుకొద్దిగా తాను నిలవచేసిన బాపతు, స్థలంలోని, ఇల్లుకట్టడంపని సగంవరకు నడపడానికి మాత్రమే సరిపడ్డాయి. సగంలో అటూ ఇటూకాకుండా విడిచిపెట్టిస్తాడా? పనిపూర్తిచేయలేక పోయేమన్న విచారానికితోడు నలుగురిలో అవమానం ఒకటి బాధపెడుతుంది కదా, పెద్దఎత్తుని ఇల్లు కడతానని బయలుదేరి, నిక్షేపంలా ఉన్నభూమి తగలబెట్టుకొన్నాడని ఎందుకూపనికిరాని చవటలుసైతం తన్ను హేళన చెయ్యరూ? ఇంకా అనుమానమేమిటి? ఈ పాటికిచేస్తూనే ఉంటారు, తాను ఇంటిపనిమధ్యలో ఆపుచేయించి నందుకు. అటువంటిది తాను ఇప్పట్లోపూర్తిగా విడిచిపెట్టుకొన్నా, లేక ఈ స్థితిలో అమ్ముకొన్నా ఆజన్మాంతమూ అవమానంతో క్రుంగి పోవలసిందే. ఒకపని ఆరంభించి మధ్యలో విడిచిపెట్టడం ఉత్తమ పురుషుల లక్షణం కాదు. సంశయాత్మా వినశ్యతి అన్నాడు. అయితే, ఇందులో తనకుఎటువంటి సంశయమూ లేదు. అంతా నిశ్చయమే. కాని, కావలసినదల్లాడబ్బు. అది లేందే పని కొనసాగించడమెలాగ? భార్య మెళ్ళోపుస్తెల నానుతప్ప మరేమీ లేదు; అది తీసేకంటే ఆత్మహత్యమేలు.

వీలయినంత మట్టుకు ప్రోమిసరీనోట్లమీద డబ్బు తెచ్చి, మరికొంతకడుతున్న ఇంటినే కుదువపెట్టి తెచ్చి, మళ్ళీపని ఆరంభించాడు ద్విగుణీకృతమయిన ఉత్సాహంతో.

"అప్పుచేసి పప్పుఅన్నం తినగా నేసరా? ముందు సంగతి కాచుకోవద్దూ. 'ఇల్లుపూర్తియిన క్షణంలోనే అప్పులకింద అన్యాక్రాంతం కాకపోతే కావికదపా ఇస్తా" మన్నారు, దినదినమూ కొత్తగారెండేసి చెవులుపుడుతున్నా కదపా ఇవ్వడానికి చాలనన్ని కబుర్లుచెప్పే సాహసికులు కొందరు. మరికొందరు సంస్కృత ప్రియులు ఋణంకృత్వాఘృతం పిబేత్ అన్నపద్ధతిని, పోనీ నెయ్యితాగిన తృప్తైనా ఉంటుంది. ఇలా శరీరమూ మనస్సూకూడా సున్నమయిపోయేలాగ పనిచేసి చేసి సాధించేదేమిటి? అంతే. కొందరు, హాయిగా కుడిచి కూర్చోలేక, కొరతను పడ్డట్టు, దారినిపోతున్న గంప నెత్తికెత్తుకొన్నట్టు, ఇటువంటి తలపెంట్రుకలచిక్కు ఏదో ఒకటి పెట్టేసుకొని అది విప్పుకోలేక, నానా అవస్థా పడుతూ ఉంటారు. వాళ్ళకు మనం ఏం చెప్పినా లాభంలేదు. వాళ్లకు వాళ్లపనిలోనే ఆనందం కనిపిస్తుంది" అన్నారు.

మరికొందరు 'కంపునోటివాడు గణిస్తే మ్మని నోటివాడు అనుభవించేడని, విత్తొకడు వేస్తే ఫల

మొక డనుభవిస్తాడనీ అన్నట్టు, చలమయ్యపంతులు కేవలం కష్టపడ్డానికే పుట్టేడు; ఈ కష్టంయొక్క ఫలం ఎవ డనుభవించడానికి రాసి పెట్టిఉందో" అన్నాడు...

ఆ యీరకపు విమర్శనలు చాలాభాగం అంతరించేయి, గృహప్రవేశంనాడు చలమయ్య పంతులు ధారాళంగా చేసిన సమారాధనతో నే.

కాని, అప్పటికీ ఇంకా కొందరు అనుమాన ప్రియులు లేకపోలేదు. "ఇప్పుడిలా వైభవం వెలిగించినంతలో ఏముంది? ఈ చేసిన అప్పులు సక్రమంగా తీర్చుకొని, అప్పటికి ఇల్లు నిలబెట్టుకోగలిగితే అదీ ప్రజ్ఞ" అన్నారు, లోపల్లోపల చలమయ్యపంతులు కొన్నాళ్లకయినా ఇల్లు అప్పులుతీర్చుకోనే నిమిత్తం అమ్ముకోక తప్పదన్న నమ్మకంతో.

కాని, ఆవిషయంలోకూడా లోకుల ఊహలు అపోహలు కాక తప్పలేదు. అందువల్ల చలమయ్య పంతులు మీద కోపం తెచ్చుకోడానికి బదులులోకం అతన్ని ఆదర్శపురుషుల్లో ఒకడుగానే లెక్క వేసింది.

ఆహారనిద్రాదులు సైతం అలక్ష్యంచేసి శ్రమించి, ఇంటికి సంబంధించిన అప్పులు తీర్చేడు. మొదట్లో ఇంటిమీద వచ్చే అద్దెమాత్రమే కాకుండా, నెలనెలా జీతంలో ప్రావిడెంటుఫండు నిమిత్తం కొంత వసూలు చెయ్యబడినంత నిక్కచ్చిగాను కొంత వేరే తీసి, ఒక అర్ధపుష్కరంకాలంలో అప్పులన్నీ తీర్చేసి, ఇంటిని యద్వ్యాఘమయిన, అనుమానాలులేకుండా స్వకీయం చేసుకొన్నాడు. మొదట్లో ఒకమాదిరి పిచ్చిగా చూడబడే చలమయ్యపంతులు ఇంటిమీది విపరీతాభిమానం తరువాత తరువాత ఒకమాదిరి విశిష్ట గుణాల్లో ఒకటి క్రింద లెక్కకువచ్చింది లోకుల నోళ్లలో.

సంఘంలో గ్రహణ విముక్తరాకా శశాంకబింబ సదృశంగా ప్రకాశించగలిగిన చలమయ్యపంతులుకు, ఇంటిలోనే ప్రతిఘటన పొడచూపింది. కొంతకాలం తమలో తాము పరోక్షంగా అనుకొనే కొడుకులూ, భార్యా, బాహాటంగానే ఆయనను విమర్శించ సాగారు: పోనీ, అప్పులున్నంతకాలం అవి తీర్చడం అంటే తప్పని సరి. అయినా అవి మాత్రం ఎందుకు చెయ్యవలసివచ్చింది? మనశక్తికీ, తాహతుకీ తగని పనులు మొదలుపెడితే ఎప్పుడయినా ఇంతే. పోనీ, అయిపోయిందేదో అయిపోయింది. ఇన్నాళ్లూ పడ్డకష్టం చాలదా? ఇంకా ఎన్నాళ్లూ ఎదురు చూస్తూఉండడం? ఇంటికీ ఒంటికీ చేస్తున్నకొద్దీ ఉంటూనే ఉంటుంది. ప్రతిసంవత్సరం వచ్చిన అద్దె కంటె ఎక్కువగా, ఏవేవో హంగులు, చేసి పెంచుతూ ఉంటే, దానికి అంతుఅంటూ మరి ఉండనక్కర లేదా? ఈ ఇంటిని గురించిన వెఱ్ఱిలో సగంకొడుకుల చదువులమీద ఉండినా బాగుండును. అల్లా అయితే, ఈదరిద్రపు ఉద్యోగాలు పట్టుకొని దేవురించనక్కర లేకుండా ఇంకా బాగా చదువుకొని, మంచిఉద్యోగాలు చేసుకొందికయినా వీలుండేది...అబ్బే, అసలు ఇంట్లో మనుష్యులెలాపోయినా బాధలేదు. ఎంతసేపూ ఇల్లు ఇల్లు ఇల్లు—అదొక వ్యసనమయిపోయింది. ఎప్పటికీ, ఆయింటి క్రింద ఖర్చు పెట్టడమే కాని, దానివల్ల అనుభవించేది మరేమీ ఉండదు కాబోలు"—ఇది, ఇంట్లోని విమర్శనా వైఖరి.

కాని చలమయ్యపంతులుమాత్రం చలించ లేదు. "నా యిల్లు, నా యిష్టం, నా కెవళ్ళూ సలహా చెప్పనక్కర లేదు" అన్నాడు.

అప్పటిమట్టుకు నోళ్ళు కట్టిపోయేయి. తరవాత కొన్నాళ్లకి గుసగుసలు గా ఆరంభించి క్రమంగా బైటికే అనగలిగేసేరు కొడుకులు "అయితే భూమి అమ్మి కట్టించినది కదా ఇల్లు, అందులో మాకుమాత్రం వంతు లేదా?" అని.

చలమయ్యపంతులు ఈ మాట వినీ వినడంతో అగ్గిరుద్రు డైపోతాడనుకొన్నారుగాని, అటువంటిదేమీ లేదు; ఆ సాయంకాలమూ, రాత్రీ ఏమీ మాట్లాడకుండా ఊరుకొని, మర్నాడు భార్యను పిలిచి అతిశాంతంగా ఆరంభించాడు. "నిజమే, పితృపితామహార్జితమయిన భూమిలో వాళ్లకి కొంత హక్కుంది. అది అమ్మి కట్టినటువంటి ఇంటిలో కూడా వాళ్లకి హక్కు లేకపోలేదు. అయితే, ఇంటిని కట్టడానికి అయినదాంట్లో ఎంత భూమి అమ్మగా వచ్చిందో, అంతా స్పష్టంగా లెక్కలు ఉండనే ఉన్నాయి. ఇక అందులో తక్కినదంతా నా స్వార్జితమేగాని మరొకటి కాదుకదా. నేను ఈ యింటికింద కాకపోతే, వాళ్ల చదువులక్రిందా పెళ్లిళ్లక్రిందా ఆ భూమి కాస్తా అమ్మిఉంటే ఏ తగవూ లేకపోయేదన్న సంగతి వాళ్లకూ నీకూ బాగా

తెలిసినదే. బాగుంది, నా కొడుకే ఘోష అంటే ఎలాగు? నేను చెప్తే వాళ్లు మేము పెద్దవాళ్ళమయినా మమ్మల్ని ఇంకా నాన్న తిడుతున్నా డనుకొంటారు. నువ్వు నేను చెప్పినమాటలన్నీ శ్రద్ధగా విని, వాళ్లకి నెమ్మదిగా చెప్పాలి—అందుచేత ఉండే, వింటు న్నావుకదూ, మరి నేనూ రిటైరయిపోదును కదా నాకూ మరి నెలజీతం అంటూ లేదు. అందుచేత వాళ్లు, వాళ్లక్రింద నేను ఖర్చు పెట్టినదానికి, నాకేం వడ్డీ అక్కర్లేదు, అసలిచ్చేస్తే భూమి అమ్మగా వచ్చిన డబ్బులో వాళ్ల వాటాలు వడ్డీ సహితంగా ఇచ్చేస్తానని చెప్పు. అదంతా నీ కెందుకు, ఎలాగో లాగు తెస్తాను డబ్బు - ఇల్లు అమ్మటం తప్ప గత్యం తరమే లేదా? ఏమో నా అనంతరం వాళ్లఖర్మం, ఎలా కావలిస్తే అలా ఏడవనీ, అంతేకాని, నా కంఠంలో ప్రాణం ఉండగామాత్రం ఆ ఇల్లమ్మటా నన్నది కలలోమాట. అంతగా వాళ్లకి దరిద్రం తగలడిపోతూ ఉంటే, ఈ తాతలనాటి ఇల్లు ఇది కాస్తా అమ్ముకొని అప్పులు తీర్చుకోమను. అంతేకాని, అదిమాత్రం అమ్మనుగాక అమ్మను. అయినా, అడిగే వాడు లేడుగాని, అప్పుడు నాజీతం ఎంతగనక. అందులోనే ఇంటిఖర్చులన్నీ సమకూర్చుకొనివచ్చి, పైగా వీళ్ల చదువు సంధ్యలకి, బోలెడేసి డబ్బు ఖర్చు పెట్టేను. నే నేం, నా క్రింద ఎన్నడూ ఒక దమ్మిడీ దుర్వినియోగం చెయ్యలేదు. ఆ యింటికింద వీళ్ళ తాతగారి ఆస్తి కలిసిపోయిందని వెధవ ఏడుపే గాని, దానిక్రింద నేను ఎంత కష్టపడ్డానో, అది తీర్చే ఒక్కడికీ కలగదేమి చెప్మా? పునాదులు తవ్వినదగ్గరనుండి దగ్గరుండి చేయించడమే కాదు, ఇద్దరు కూలివాళ్లకంటె ఎక్కువ పనిచేసేవాణ్ణి.— ఏమిటే? అందుకే నాకు అంత కష్టాన్ని కలిగించిన ఇంటిని అమ్ముకొందామా? అబ్బబ్బ, ఏమి పితృభక్తి పరాయణులు. కాబట్టే, నాకే ముసలికాలంలో ఏ కొంచెం తృప్తి మనశ్శాంతీ ఉన్నాయో వాటిని మూలచ్ఛేదం చేస్తున్నారు." అని మరి మాట్లాడలేక పోయాడు.

విశిష్టమయిన చిత్రాన్ని చిత్రిస్తున్నంతకాలం ఇంత మూల్యం వస్తుంది, అంత మూల్యం వస్తుంది అని ఆశపడిన చిత్రకారుడికి చిత్రం పూర్తిఅయిన తరువాత, తాను కోరినదానికంటె, ఊహించినదానికంటె ఎక్కువ మూల్యం వచ్చినా చిత్రాన్ని విడిచిపెట్టడానికి కష్టం కలిగినట్టే, ఇంటిని అమ్ముకోడాన్ని గూర్చిన తలంపే బాధగా ఉండేది చలమయ్యపంతులకు. చిత్రకారుడికి తన అభిమానచిత్రాన్ని విడిచిపెట్టడం కష్టంగా తోచినా, ఇంకా ముమ్మందు ఇంతకంటె ఉత్తమమయిన కళాసృష్టి చేయగలనన్న ఆశ ఉత్సాహము పట్టుదలా ఉంటాయి. కాని చలమయ్యపంతులకు అటువంటి సావకాశం ఏమి లేదే. ఒక బాహ్యవస్తువుమీద ఇంతగా మమకారం పెంచుకోడం పొరపాటే కావచ్చును కాని, తాను హఠాత్తుగా ఇప్పుడు మారిపోగలడా? కాకపోయినా ఇందుమూలంగా ఎవరికీవచ్చేనష్టం ఏమీలేదే? పదేళ్ల క్రితంకంటే, చుట్టుపక్కల ఇళ్లధరలు మూడింతలు ఎక్కువయేయి. మరి పదేళ్లలో ఇంకా ఎంత హెచ్చుతాయో? ఎప్పుడయినా సరే స్థిరాస్థిని అమ్ముకొని, చరచర ఖర్చు పెట్టిస్తే మరి మిగిలేదేమిటి? ఉన్నదానిని ఒక ఆకారంనుండి ఇంకొక ఆకారానికి మార్చుకోవాలి; అంతేకాని, పొదుగే కోసేస్తే పాలుంటాయా?

తరవాత మళ్లీ కొంతకాలం కొడుకు లేమీ అనలేదు.

క్రమంగా పోనీ, తామే కొంత సర్దుబాటు మార్గానికి వచ్చే ఉన్నట్టుగా "అంతగా, తనకి అమ్మటం ఇష్టంలేకపోతేమాని పోయె. మా యిబ్బందులు ఎప్పుడూ ఉండేవే. అందుకని, తను చెప్పినట్టు, స్థిరాస్థి అమ్ముకోడం తెలివితక్కువే. అయినా, చుట్టూ పెద్ద బంగాళాలాగు అంత ఖాళీజాగా ఎందుకు వృధాగా విడిచిపెట్టడం? అందులో ఏవో మాదిరి కుటీరాల్లాగ కట్టించినా చాలు ఇప్పుడు వచ్చే అద్దెకు, రెండింతలు వస్తుంది. డాబామీదకూడా, ఒక మూడో నాలుగో గదులు కట్టేసి, వాటాలుగా చేసి, ఎప్పటికయినా మూడువంతులు కావలసినదే కదా, అద్దెలకిస్తే, కావలసినంత అద్దె వస్తుంది. మనకు అమ్ముకోడం ఇష్టంలేనప్పుడు, దానిని మనకు లాభదాయకంగా చేసుకోవాలిగాని, ఇల్లా వృధాగా విడిచిపెట్టుకొంటే ఏంలాభం? ఒక్కరికిస్తే, ఎంతటివాళ్లకయినా, అద్దె ఎక్కువయినట్టుగానే ఉంటుంది. ఆయన ఒప్పుకొంటే, ఏ మాసిగలో పడి, డబ్బుతెచ్చి, పనులు మొదలు పెడతాము" అన్నారు పెద్దవాళ్లిద్దరూను. చిన్నవా డెప్పుడూ డబ్బు పంపమని రాయడమేతప్ప,

ఇటువంటి గొడవ ఏమీ పెట్టుకోడు. ఏడిచేదాని మొగుడొస్తే నా మొగుడూ వస్తాడన్నట్టు, ఏమీ మాట్లాడకుండా సద్యః ఫలమేమిటో చూసుకో నేరకం, వాడిది.

ఈ రకపు ఇంటిని అభివృద్ధిపరచే పథకానికి వెనుకటంత బలంగా అడ్డునిలవలేకపోయేడు చలమయ్యపంతులు. ఆత్మాభిమానపూరితుడయిన యువకకవితో నీ పద్యంలో ఫలానా ఫలానా పదాలు వ్యాకరణ దుష్టములే కాదు, వ్యవహార దుష్టములు కూడాను. కాబట్టి వాటిని ఈ యీ తీరులను సరిదిద్దుకోవలసింది" అని నిష్కర్షగా చెప్పినప్పుడు ఆ కవికి కలిగినంత కష్టం కలిగింది చలమయ్య పంతులుకు.

"మంచో, చెడ్డో, లాభమో, నష్టమో దానిగురించి, నా బ్రతుకంతా ధారపోసి నేను ఆనాటికి ఎంతో అందంగా నివాసయోగ్యంగా ఉంటుందనుకొన్న పద్ధతిని కట్టించాను. అది, ఈ నాటికి మీదృష్టికి బాగుండక పోవచ్చును. నిజంగానే, అది ఈనాటి అధునాతనపద్ధతులకు అనుగుణంగా లేకపోవచ్చును. దినదినమూ శాస్త్రము అభివృద్ధి చెందుతూనే ఉంటుంది; కొత్తకొత్త పంపిణీలు వస్తూనే ఉంటాయి. అయినా, దానిని మార్పుచేయడం నాకెంత మాత్రం ఇష్టంలేదు. నేనూ ఇంక బ్రతికినంతకాలం బ్రతకనుకదా. ఎప్పటికయినా ఏమిటి, ఇప్పుడయినా అది మీదే. దానిని మీరు ఏవిధంగా ఉపయోగించుకొన్నా, అమ్ముకొన్నా పూచీలేదు. ఇన్నాళ్లు మీరు మీ యిష్టాలు కాదనుకొని, ఈ ముసలివాడి ఇష్టాన్ని గౌరవిస్తూవచ్చేరు ఈ అంశంలో. ఇంక మరొక నాలుగయిదేళ్ళకంటె ఎక్కువ ఉండను ఎంత ఆలస్యమైనా అంతవరకూ ఆగలేరా? మరి నేను చెప్పవలసిన దేదో చెప్పేను. పైన, మీ యిష్టం, అంతగా మీరు కాదు, తప్పదు అంటే అడ్డు తగులుతా ననుకోకండి మాత్రం" అన్నాడు.

బ్రహ్మాండమయిన సన్నాహంతో, విపరీతమైన రణగుణధ్వనితో యుద్ధానికి వస్తాడనుకొన్న మనిషి, రాజీమాటలకు వచ్చేసరికి మరికఠినంగా మాట్లాడ్డానికి సావకాశం లేకపోయింది కొడుకులకు. "పోనీ ఆయనమాటేకాని అమ్మా, ఇన్నాళ్ళూ ఆయన మాటమీద నడిచి, ఇప్పుడు ఒక్కమారు తిరగబడ్డారని ఎందుకు; మరొక పది సంవత్సరాలలో మహా మనం చెడిపోయేది ఏముందిగనక? ఏమయినా, ఈ ముసలి కాలంలోని ఆయనతృప్తికంటేనా?" అన్నారు కొడుకులు.

అంతటి సామరస్యం కాకపోయినా, పరస్పర సహృద్భావం తండ్రికొడుకుల నడుమ కుదిరి, రోజులు నెమ్మదిగా గడిచిపోతున్న సమయంలో, చలమయ్య పంతులుకు తగలవలసిన దెబ్బ కాదది.

రెండవకొడుకు వెంకటేశ్వర్లు కోఆపరేటివు బ్యాంక్ సెక్రెటరీ. మొదట్లో తక్కినవాళ్ళిద్దరికంటె తక్కువగా ఉన్నాడనిపించినా, రానురాను వాళ్ళిద్దరికంటె తానే బాగుపడినట్టు కనిపించేవాడు. తక్కిన ఇద్దరూ కొత్తసైకిళ్ళు కొనుక్కోలేక ఆ పాత వాటితోటే అవస్థలు పడుతూఉంటే, తానొక సెకండుహేండు కారు కొనుక్కోగలిగేడంటే, అతని స్థితినిగురించి ఎవరయినా సంకోచించవలసిన అవసరం ఏముంటుంది?

అమాంతంగా అటువంటివాడు ఒక్కనాడు వచ్చిపడి,

"పదివేల రూపాయలయినా కావాలి, మత ప్రవేశమయినా కావాలి" అని కూర్చుంటాడని ఎవళ్ళనుకోగలరు? వాళ్ల బ్యాంకు డైరెక్టర్లు లోటు వచ్చిన పదిహేను వేలూ భర్తీచేస్తే, పిల్లలవాడని కనికరించి ఊరుకొంటామన్నారట.

"ఏమయింది ఆ డబ్బు, పోనీ నువ్వు తినలేదుకదా, నీకేం భయం," అంటే "నాఖర్మం ఇలాగుంది. నే నేమయినా ఎవళ్లకీ అక్కర్లేదు, వెధవ క్రాసెగ్జామినేషనుకి మాత్రం లోటులేదు. నేను ఏ రైలు క్రిందో పడి చస్తే అప్పుడు చచ్చినట్లు నా పెళ్లాన్నీ పిల్లల్నీ పోషిస్తారు" అని, నెత్తి కొట్టేసుకొంటాడు.... మరి ఇల్లమ్మక గత్యంతరం కనిపించలేదు, చలమయ్య పంతులుకు.

అమ్మబోతే అడివి, కొనబోతే కొరివి అన్నట్టు ఎంత మంచి వస్తువయినా మనకు విపరీతమయిన అవసరంఉండి తొందరగా అమ్ముకోవాలంటే, ఖరీదు తక్కువ వస్తుంది. కాని, కొనదలచినవారిలో పోటీలురావడంమూలాన, ఆశించినదానికంటె ధర ఎక్కువగానే నిర్ణయమయినది కాని, అతృప్తిఅంతా తక్కినవాళ్లకే. ఎంత మంచి అల్లుడికిచ్చినాసరే, కూతుర్ని అత్తవారింటికి పంపేటప్పుడు తండ్రికి వచ్చేదుఃఖం

అంతా అతడికి పురోణీ కాగితంమీద సంతకం పెడుతూఉంటే కలిగింది. తరవాత నెల్లాళ్లలోగా రిజిస్ట్రేషను జరిపించవలసిఉంది. కాని, చచ్చిఅయినా తన పట్టుదలను సాధించాడు చలమయ్యాపంతులు. రిజిస్ట్రేషను వేళకు అతను ఈ లోకపు అంచులనే దాటిపోయేడు.

ఒక ప్రత్యేకమయిన జబ్బూ అదీ ఏమీ లేదు. మామూలుగా ఉండే అతి నీరసమూ అంతే. ఆ వేళ డాబామీద పడకకుర్చీ వెయ్యమంటే, చలిగాలి వేస్తుంది వద్దని భార్య అన్నా లక్ష్య పెట్టలేదు. "అయితే మీరు వెయ్యకపోతే నేనే వేసుకోవాలి" అన్నమాటతో తప్పనిసరి అనుకొని, మనుమడు సుబ్రహ్మణ్యం కుర్చీ వేసి వచ్చి, నెమ్మదిగా పట్టుకొని మెల్లెక్కించేడు. డాబామీదనుండి, అవతలవీథిలోని, తను కట్టించిన ఇల్లు, తన స్వంతఇల్లు, మరొక్క నెల్లాళ్లలో పూర్తిగా తనకి కాకుండాపోయే ఇల్లును తనివితీరా చూస్తూ కూర్చున్నాడు. అంతే. అశ్వాసాంతమే. రాత్రి పాలు తాగమని, తీసుకొనివచ్చిన భార్యమాటకు మరి సమాధానం లేదు. కోట్లకొలది డబ్బు వ్యయించి, రెండు దశాబ్దులుపైగా అనేక వేలమంది శ్రమప్రయాసలకు ఫలితంగా కట్టించిన తాజమహలును చివరిఘడియలలో చూసుకొంటూ పోయాడట షాజహాను. అతడికి ఆ మధురస్వప్నసదృశమయిన ఆ మహాభవనంలో భార్యాస్మృతి అనే రసమయభావన మిళితమయి ఉన్నట్టే, చలమయ్యాపంతులుకు, తన బహుకాల శారీరకమానసిక పరిశ్రమలకు ఫలితమిదే అన్న తృప్తి ఆకట్టడంలోని ప్రతిస్వల్పభాగంలోను అంతర్లీనమయిఉంది. అంతే, ఆ తృప్తిలవము తప్పితే చలమయ్యాపంతులు తానెన్నడూ ఆ యింటిలో ఉండలేదు. అసలు అతనికి కొన్నికొన్ని సందర్భాలలో, ఎవరు ఇంటిని ఏవిధంగా ఉపయోగించినా, కష్టంగానే ఉండేది. కాని, అటువంటిమాట బైటికి స్పష్టంగా అంటే తనను పిచ్చివాడుగా జమకట్టేస్తారేమో నన్న సామాన్యజ్ఞానం మాత్రం అతన్ని ఎన్నడూ విడిచిపెట్టలేదు. కాని లోపల్లోపలమాత్రం ఒక సుకుమారమయిన పుష్పాన్ని, రేకు లూడదీసి, నలిపి చిందరవందర చేస్తున్నట్లుండేది. తమఇంట్లో అద్దెకున్నవాళ్ల ప్రవర్తనచూస్తూ ఉంటే. ఏమయితే నేం ఆఖరి తురుఫుముక్క చలమయ్యాపంతులుదే అయింది. తన కంఠంలో ప్రాణం ఉండగా తన స్వంతఇంటిమీది హక్కును పూర్తిగా వదులుకోలేదు.

*    *    *    *

మొదట నాగురించి అంతగా చెప్పకొని, చివరికి తటస్థంగా ముభావంగా తప్పుకొంటే మీ రేమనుకొంటారు ? నాకు, ఒక్కటే భయం—స్వంత ఇల్లు అంటూ లేకపోయినంతలో ఉండడానికి ఇళ్ళు లేక పోలేదు కదా. ఇక స్వంతము అన్న మమకారం పొడసూపిందంటే అది ఎంతవరకూ వ్యాపిస్తుందో ? చివరికి, చలమయ్యాపంతులులాగ కేవలం అదొక కళాస్వరూపమయికూర్చొని, దానిని, కేవలం దేవాలయాలను, చిత్రప్రదర్శనాలను చూసినట్టుగా ఆనందించడమో, లేక లోకుల (అంటే ఇంట్లోవాళ్ళు) బాధపడలేక, అద్దెలకిచ్చి, అద్దెలవాళ్లు, ఇంటిని సరిగా, అంటే నామనసులో ఉన్న ప్రకారం ఉపయోగించుకోలేని, మార్దవరహితులని అనుకొని బాధపడేస్థితి నాకు చాలా భయంకరమయినదిగా గూపిస్తుంది. కాక స్వంతము అని ఒకవస్తువు ఉంటే, దాన్ని మనం ఉపయోగించుకొందికి అనర్హులమని అనుకొని, అన్యులకు ఉపయోగించుకొందికి ఇవ్వడంలో ఆర్థికలాభం ఎంత ఉంటున్నా, స్వార్థమయిన అనుభవకాంక్ష నన్ను విడిచిపెట్టదని నా అనుమానం. పోగా, ప్రస్తుతానికి చలమయ్యాపంతులును, ఇంకా అతనిలాగే, తాము ఉపయోగించుకొంటే, తమ ఆస్తిని కొలదిపరచినట్లవుతుందన్న నమ్మకంతో, కేవలం ఇతరుల ఆనందంనిమిత్తం సర్వమూ సమకూర్చి భద్రపరచి, తమది అన్న స్వార్థం కోసం తమ అనుభవాలను త్యాగం చెయ్యగలిగిన కళాప్రియులను సంస్మరించుకొంటూ, "మళ్ళీ నెలలో మాతమ్ముడి కొడుకు కుటుంబంతో వస్తాడట. అందుచేత, మరి, చూసేరుకదూ, నాకు ఇష్టంలేదుగాని, మీరుమాత్రం ఖాళీచెయ్యవలసి ఉంటుంద"న్న గృహయజమాని, ఆదేశానుసారంగా నూతనగృహాన్వేషణార్థినై బయలుదేరుతున్నాను.

# శిల్పకళలో సూచనలు



శ్రీ దేవీ ప్రసాద్ రాయ చౌదురి

ప్రతిపనీ, ఒక ఫలితం ఆసిస్తూ, ఒక ఉద్దేశంతో ప్రారంభ మవుతుంది. కళకూడా అల్లాంటిపనులలో ఒకటి. మహోద్రిక్తమైన భావతీవ్రతలో సలసల క్రాగిన ఊహాసంచయాన్ని, ప్రకటీకృతమైన ప్రస్ఫుటవిధానపు మూసలో వెలువర్చటమే, చిత్ర, శిల్పకళల సంకల్పోద్దేశము. ఈ 'విధానం' ఒక సందేశ మిచ్చేదై ఉండాలి. తద్రీత్యా దానికి విశిష్టత ఉంది. ఈ విశిష్టత, ఒక వస్తువు కళాకారునిలో కల్గించిన అనుభవవిజ్ఞానానికీ, చిత్రరూపంలో అతను వెలువర్చిన భావప్రకటనకూ సంబాధీకమై ఉంటుంది. కాబట్టి కేవలం, 'వ్యక్తిగతం' కాకతప్పదు.

ఇల్లా స్వరూప మందుకొన్న భావప్రకటన, అది అర్థంచేసుకోవలెనన్న కుతూహలమున్న రసపిపాసికి సందేశ మందచేయగల్గి, ప్రయోజన యుతమై యుండాలి.

ఇక్కడ, ఈ సందేశ మందచేసే పద్ధతికి, ఒక ప్రత్యేకభాష ఉంటుంది. ఈ భాష, అర్థమయ్యేదిగా ఉండటమే కాకుండా, సందేశంలోని రహస్యరూపం, దుర్భేద్యమై చిక్కుపడిపోకుండా, శక్తిమంతంగా వెలువడగల సామర్థ్యం కలదై ఉండటం, అత్యవసరం. సందేశవిధానంలో ఈ సామర్థ్యం లోపించినప్పుడు, భావప్రకటన లోని సంకల్పమే నిష్ప్రయోజనమైపోతుంది.

ఈ ఉపోద్ఘాతం ఇంత విస్తృతంగా ఎందుకు చెప్పవలసివచ్చిందంటే, మనదేశ ఆధునిక శిల్ప కళ అలవర్చుకొంటున్న కొత్తపద్ధతులలోని కొన్ని ఆయువుపట్లను ఇక్కడ సేకరించి చెప్పదలుచుకొంటున్నాను కాబట్టి. ఈ పద్ధతులు శిల్పకళలో ఒక కొత్త భాషను నిర్మించుకున్నాయి. ఈ భాష నిలుస్తుంది. "కొత్తభాష" అని ఎందు కంటున్నానంటే, ఇది మన పౌరాణికపద్ధతులకూ, పాశ్చాత్య సంప్రదాయ పద్ధతులకూ కూడ విభిన్నము.

శిల్పభాష, ఏ పద్ధతికి చెందినదైనా, సందేశంలో అస్పష్టత ఏమాత్రం రానీయకుండా చాలా జాగ్రత్తపడేదై ఉంటుంది. కారణం ఈ భాష పరిమితి నిర్దిష్టము. సునిశిత రేఖాసుస్పష్టమైన, విగ్రహాన్నావరించుకొన్న ఛాయాస్వరూపమాత్రమునకే ఈ భాష పరిమితము. సందేశానికై వాతావరణంమీద ఆధారపడేందుకు, ఇక్కడ శిల్పస్వామ్యమైన భూమిక లేదు. సాహిత్యంలోవలె వర్ణనలలో విశదీకరించుకొనే అవకాశం లేదు. అందువలన, వాస్తుగుణత్రయ (*Tri-dimensional*) పరిబద్ధమైన, శిల్పకళ కున్న భాషలో, ఊహావిస్తరణ కున్న పరిమితి అతిస్వల్పము. చిత్రలేఖనంలో పరిసరవాతావరణచిత్రణం కూడా చిత్రంలోనే భాగమై, ప్రధానభావానికి ఉద్దీపకమై, సందేశవ్యక్తీకరణకు బహుళంగా తోడ్పడుతుంది. ఇక్కడ ద్రష్ట, ఊహాగాన మొనర్చుకునేందుకు అనంతమైన అవకాశ ముంది. వాతావరణానికై చిత్రించిన పరిసరవస్తువులన్నీ సందేశార్థమై విధించబడ్డ ప్రధానవిషయానికి ప్రాముఖ్యమిస్తూజపంగా మూగగా వెన్నుదన్ని నిలచిఉంటాయి. సాహిత్యంలో కూడా, ఒక చిన్ని సూచనతో చదువరి ఊహాగానాన్ని అపారంగా పెంపొందించుకోగల సౌలభ్యం ఉంది. కాని శిల్పకళలో, ఈ స్ఫురణను ఇతర ఆశ్రయమునుంచి అవలంబింపచేసుకోటం, ఎక్కువ ప్రయోజనకరం కాదు. కాకుంటే, వంచనకూడా ప్రజ్ఞావిశేషంగానే భావించుకొంటే, ఉపయోగపడవచ్చును.

శిల్పకళ ఇల్లా ఉండటానికి కారణం ఉంది. శిల్పాన్ని సరిగ్గా ప్రదర్శించడానికి, శిల్పంపై పడే వెలుగు, శిల్పంఅంతటా ప్రతివంపు మహత, నీడ, రేఖలకు ఏ మెట్టు కా మెట్టున, యథాప్రాముఖ్య మిచ్చుకొంటూ సమంగా ప్రసరించటం చాలా అవసరం.

శిల్పంయొక్క ఋజుస్వభావం, సాంద్రతతో, 'ఘన' స్వభావంతో, మిళితమయి ఉంటుంది. అందులో తీవ్రత ఉంటుంది. గాంభీర్యం ఉంటుంది. అది భక్తిప్రపత్తులకు ఉపాధిగా నిలుస్తుంది. రంగులలో గీసేచిత్రలేఖనంలో, రంగు లొక్కొక్కప్పుడు అదృష్టవశాత్తూ కొత్త పాకాలను సృష్టించుకొని, చిత్రానికి

శోభ కూర్చే అవకాశం అపారంగా ఉంటుంది. శిల్పంలో ఈ అదృష్టం ఈషణ్మాత్రమూ ఉండదు.

శిల్పం, తనకు తను విడిగా విలుస్తా నంటుంది. సాహంకారంగా నిలచేందుకు తన వాతావరణాన్ని తనలోనే సృష్టించుకొంటా నంటుంది. కాబట్టే ఘన స్వరూపంలో భావప్రకటన, విగ్రహమాత్రానికే పరిమితమై స్వయంసంపూర్ణం కావలసివస్తుంది.

ఇల్లా తయారైన సౌందర్య ప్రతిమ దేవాలయ పావిత్ర్యాన్ని అంకిత మొనర్చుకొంటుంది. అందుచేత శిల్పకళలలోని భావప్రకటనకూ, చిత్రలేఖనంలో ఎదురుగా గీసిన గీతలతో, సందేశ మందిచ్చుకొనే భావప్రకటనకూ, ఎక్కడా సామ్యం లేదు.

మహా, గంభీరమైన ప్రమాణంలో, ఆవిగ్రహం ఉండటం శిల్పంలో అతిప్రముఖమైన గుణవిశేషం. చిన్న చిన్న గదులలో అలంకరణకు గానూ, విగ్రహ ప్రమాణాన్ని తగ్గించుకొంటూరావడంలో, శిల్పసందేశం, అపార్థాలకు ఎట్ల అన్నా గావలసివస్తుంది. లేదా తనకు లేని హోదా ఎరువుతెచ్చుకొని ప్రకాస్తి చెంపటమైనా జరుగుతుంది. అసలు విగ్రహంలో లేని ఒక శోభనుమాత్రమే కల్గించటంలో ఆ కృతక వాతావరణం సహాయం చేస్తుంది. ఒక దృక్కోణంనుంచి చూస్తున్నప్పుడు, ఆ సహాయం చాలా ప్రయోజనకరంగానే కనబడవచ్చును. కాని ఆ శిల్పసందేశంలోని, సంపూర్ణ సత్యరూపం మాత్రం దెబ్బతినిపోతుంది. ఇల్లా విగ్రహానికి కృతకశోభ తెప్పించటం, వంచన, దురుద్దేశపూరితము. ఇంటి కచేరీసావడుల అలంకరణలలో, ఈ కృతక వృత్తి అతి శీఘ్రగతిలో పెరిగిపోతోంది.

మన దేశంలోని శిల్పులు చాలామంది, శిల్పాన్ని కేవలం లాభసాటి వ్యాపారంగా చేసుకుని క్రమంగా దానిలో దిగబడిపోతున్నారు. కళాశీలి జీవించాలంటే తన శిల్పం అమ్ముకోవడంకంటే గత్యంతరం లేదు. అందుచేత వారినీ విషయంలో నిందిస్తే ప్రయోజనం ఏమీ లేదు. ఈమధ్యన శిల్పంలో కొన్ని వ్యామోహకరమైనపద్ధతులు బయలు దేరాయి. ఇవి అర్థకుసిగా జీవించుకొన్న పాశ్చాత్య దేశాలనుంచి దిగుమతి అయిన శిల్పాదర్శాలు. పైపై మెరుగులు చూచి భ్రమసిపోవడమే ఒక పద్ధతిగా పెట్టుకున్నప్పుడు. యుక్తాయుక్తవివేచనకు నీళ్లు వదులుకోవాలి. లోతుపాతులు చూసుకుని ఒక విషయం నిశ్చయించుకోవాలంటే, సరిఅయిన జీవన మూల్యాలతో సయుక్తికంగా ఆ విషయం అవగాహన చేసుకోవాలి. ఈ అవగాహన క్లిష్టమయినపుడు ఏదో విధంగా విదేశీయవిధానా లనుసరించడమే మనకు శరణ్యం అవుతుంది. పైన చెప్పిన అవగాహన చాలా కష్టసాధ్యమయినది. అందుచేత నేటికాలపు సరికొత్త పద్ధతులే అనాలోచితంగా అనుసరించడం జరుగుతుంది. ఆయా కాలాలలో అందరు బళాబళీ అని మెచ్చుకొనే పద్ధతులు అవలంబించేవారు, సరియైన నిర్ణయాలకు నీళ్లు వదులుకుని ఏదో అప్రత్యక్షమయిన కళాదర్శాలవైపు మొగ్గవలసి వస్తుంది. వీటికి సంబంధించిన సర్వవిషయాలు తాత్కాలికంగా ఆయా సమయాలకు ఉపయోగించేవిగా ఉండవచ్చును. అయితే వీటిలోని వ్యంజకసాధనాలు లోపభూయిష్టంగా ఉండడంవల్ల వీటివల్ల అనుకున్నంతగా కళాశీలి ఆదర్శం నెరవేరదు. కళలో సరియైన వ్యంజకసాధనాలు ఏర్పరుచుకోవడం అంత తేలికగా జరిగేపని కాదని చెప్పడం ఇక్కడ అసంగతం కాదనుకుంటున్నాను. చిరకాలానుగతమైన వ్యవహారంమీదనే ఈ వ్యంజకసాధనాల స్థయిర్యం ఆధారపడి ఉంటుంది. ప్రతీతరంలోను భాషానిర్మాణానికి కొంత పని జరుగుతూనే ఉంటుంది. అందుచేత మనకు గోచరమయిన పదార్థాలకు అభిప్రాయాలకు అనుకూలమయిన అర్థం ఇచ్చేదే భాషఅని చెప్పాలి. ఒకప్పుడు ఈ భాష ఆయా పదార్థాలకు, అభిప్రాయాలకు విభిన్నార్థాలుకూడా సూచిస్తూంటుంది. అయితే మన దేశంలో నేటి కాలంలో తయారవుతున్న శిల్పభాష ద్వ్యర్థిభావపూర్ణంగా ఉన్నది. అందుచేత చాలాకాలం గడిచినదాకా ఇది ఎంతవరకు ఉపయోగిస్తుందో చెప్పడం కష్టము.

"నేటికాలంలో అభ్యుదయపద్ధతి నొకదానిని సగుమతి చేస్తున్నారు. దీనిలో ఉదాత్త శిల్పలక్షణాలు కనబడడంలేదని చెప్పడానికి కించపడుతున్నాను. కళాశీలి తన శక్తులతో తాత్కాలికమయిన పైపై మెరుగులకు, పద్ధతులకు దాసోహం అనడం తప్పని నేను నొక్కి చెబుతున్నాను". కళాసృష్టి తరతరాలదాకా శాశ్వతంగా నిలిచి ఉండాలి. నేటికాలపుఅభ్యుదయశిల్పుల ఆదర్శాలు వారి శిల్పాలలో కనబడడంలేదు. వారిలో ఒక నిజాయితీతో కూడిన ఆదర్శం లేకపోవడమే దీనికి కారణము. కీర్తిదాహంతో పందారులు తొక్కుతున్న శిల్పులు, తమ తప్పు సవరించుకొని నిజాయితీతో కూడిన కళాసృష్టికై పాటుబడగలరని ఆశిస్తున్నాను. లేకపోతే, తొందరతొందరగా మారిపోయే తాత్కాలికమైన కళాపద్ధతులలో, వీరి శిల్పరచనలన్నీ ఎందుకూ కొరగాకుండా పోతాయి.

(ఎ. ఐ. ఆర్. సౌజన్యంతో)

కథానిక:

# "మనుష్యులం"

శ్రీ వేలూరి సహజానందం

"మనమెవరం?" కాపరానికి కొత్తగా వచ్చిన కోమలాంగి భర్తతన్ను ఆలింగనంలోకి ఆహ్వానించకుండా ఇలా ప్రశ్నించేటప్పటికి నివ్వెరపోయింది. నుంచున్నదల్లా అలాగే నిలబడి పోయింది. సమాధానంకోసం, ఈ పురాతన, నిత్య ప్రశ్నకు, తాత్త్వికచింతతో తాను వేసినవికైక ప్రశ్నకు ఆమె ఇచ్చే సమాధానం కోసంఅతను చూస్తున్నాడు. ఆమె పెదవులు కదిల్చింది' కాని మాట పెగలలేదు.

"మనం పశువులం కాము" అన్నాడతనే.

ఆమె మనస్సుకొంచెం కుదటపడ్డది - సమాధాన భారంకూడా అతనే నెత్తిన వేసుకున్నందుకు. ఆమెకు తెలుసు— అతను యం. ఏ. ప్యాసయాడని, విపరీతమైన విద్యాసక్తి కలవాడని. ఎందరెందరకో తెలియని మహావిషయాలను భర్త మథిస్తున్నాడని గర్వపడేది. కాని అతనికంత చదువుండగా, తను విద్యావిహీనురాలవటంవల్ల మళ్లీ విచారంగానూ ఉండేది. అయినా అతనిసాన్నిధ్యంలో ఆలోటు తీర్చుకోవచ్చు.

అతని కేసి చూసింది. అతనిముఖంలో బిగువు కొంచెం సడలింది. పెదవులపై మందహాసంకూడా గోచరిస్తోంది.

అతను మెల్లగా అన్నాడు.

"నేను మీ నాన్నగారికి వ్రాశాను. ఈ రభసంతా నాకిష్టం ఉండదని, ఊరికేవస్తున్నానని. ఈ మల్లెలవాసన మనకు మత్తెక్కించకూడదు. ఈఅత్తరుల సువాసనలకు మనం చలించకూడదు. ఒకళ్లనొకళ్లం చూసుకొని ఉద్రిక్తులం కాకూడదు. వాళ్ల శాసన, ముహూర్తప్రకారం మనం ముద్దులు పెట్టుకోటానికి, కౌగిలించుకోటానికి వీలులేదు."

మన్మథుని ఉద్యానవనపు మానాన్ని భంగం చెయ్యకతప్పదనే, అతను వరుసవరుసగా మన్మథునిపై ఉపన్యాసబాణాలు విసురుతున్నాడు. ఎక్కడదాగి ఉన్నాడో, ఆ మన్మథునికి పళ్లితగిలినయో లేదోగాని, ఆమెకుమటుకు గందరగోళంగా ఉంది.

మెల్లగా బల్లమీదనుంచి ఫలహారపు పళ్లెం తీసి, ఆమె అతన్ని సమీపించబోతోంది.

అతనందుకున్నాడు—ఉపన్యాసాన్ని.

"అమాయకురాలవునువ్వు! యజ్ఞపశువ్వి. నేర్పిన పాఠాలుబాగా అప్పజెప్పుతున్నావు. ఇంతకు మునుపే గొంతుకదాకాతిన్న నాకు క్షణంలోనే ఆకలిశోష రాలేదు, పెట్టు ఆ పళ్లెం... బల్లమీద."

ఆమె వెనుకడుగువేసి నుంచుంది. పళ్లెం చేతులోనే ఉంది. అతను నాలుగడుగులు ముందుకువేసి ఆమెకు దగ్గరగావచ్చి. ఆమె భుజంమీద చెయ్యివేయబోయి, వెనక్కితీశాడు. అదిగ్రహించిన ఆమె మనస్సు చివుక్కుమంది. తనదైవానికి తనపైన అలుక వచ్చిందా? లేకవిద్యావిహీనురాలని తనపైవిరక్తా? ఆమె గుండె బాధతోకొట్టుకుంది.

తన క్షణచాపల్యానికి అతను చిన్నపుచ్చుకున్నాడు. సంకెళ్లలోంచి తప్పించుకొని చెయ్యి, పాపిష్టిచెయ్యి, గభాలున స్త్రీభుజాన్ని తాకపోయింది. అతనిలా చింతిస్తుండగానే, కళ్లు ఆమె పొడుగాటిజడ కేసి తిరిగినయ్. పూలమధ్యజుట్టు కన్పించటం లేదు. వాటివాసనలు తనకి మత్తెక్కిస్తున్నయ్. తనంత పొడుగునాఉంది ఆమె. అయోమయంగా ఉన్న ఆమెకళ్లలోకి చూశాడు.

"ఏం అలాచూస్తున్నావు?" అని అడిగాడు.

"క్షమించండి" అంది ఆమె.

"ఎందుకు?"

"అలా చూసినందుకు?" అని పళ్లెం బల్లమీద పెట్టింది.

అతనికి ఆశ్చర్యమూ నవ్వూ కలిగినయ్. నిజానికి ఆమె కళ్లుబాగా ఉన్నయ్. చూసినకొద్దీ చూడబుద్ధి వేస్తోంది. అంతేకాదు, తన చేతులు మళ్లీ ఆమెను తాకాలని రెండుమూడుసార్లు ఆరాటపడ్డయ్. కాని అతను నిశ్శబ్దంగా, అదృశ్యంగా ఝుళిపించిన కొరడా దెబ్బకు అవి వీపువెనకాలే మెలికలు తిరిగినయ్.

"కూర్చో" అని అతను మెల్లగా ఆమెను మంచంవైపు సైగచేశాడు.

"మంచి అందకత్తెవునువ్వు. ఈ ఆరునెల్లలో నీ అందం మఱింత ఎక్కువైంది. కాని...కాని" అని అతను ఆగాడు.

ఆమె రెప్పలు వాల్చకుండా అతనికేసి చూస్తోంది. అందంగురించి ప్రశంసించాడు. విశేషమే. కాని ఇంతలో మళ్లీ 'కాని' ఏమిటి?

"కాని... అందంకాదు ముఖ్యం...జ్ఞానం" అన్నాడు.

ఆమెకు ఏమీ పాలుపోలేదు.

తొలిరేయి తుఫానులా ఉంటుందను కొంది. పరశరీర స్పర్శవల్లకలిగే సంభ్రమ, ఉద్రేకాలూహించుకునికంపిస్తున్న ఆమె, భర్తధోరణిని చూసి కొంతనిలదొక్కుకుంది. వంటినరాలన్నీ పట్లు సడలినయ్. బైట వసారాలో కుతూహలంతో నిద్రరాని పెద్దలకు ఈ ఎడతెగని గుసగుసఏమీ బోధపడలేదు.

నిశిరాత్రి దాటింది. అతనికి మెలకువవచ్చి లేచి చూశాడు. చాపపైపడుంది ఆమె. అతను చింతిల్లాడు. తను మెత్తనిపరుపుపై... ఆమె వట్టిచాపపై. తను కూడా కిందే పడుకోవాలి. కాని మరొక చాపలేదు. వెళ్లిమెల్లగా ఆమె భుజాన్ని తట్టాడు. ఈ తొలిస్పర్శ అతనికి చీకట్లో ఏదో తగిలినట్టుంది. ఆమె ఉలిక్కిపడి లేచింది.

"ఏం లేదు... కింద నేను పడుకుంటా... నువ్వుపక్కమీద పడుకో" అని అతను మెల్లగాచాప మీదకొరిగాడు.

నిద్రలేచి ఉషస్సు కళ్లుతెరిచేసరికి ఆమెపతి పాదాల దగ్గరకూర్చున దల్లా లేచి మెల్లగా తలుపులు తీసుకొని ఇంట్లోకి వెళ్లిపోయింది.

౨

పని, పాట ముగించుకొని ఆమె భర్త పుస్తకాల గదిలోకి వచ్చింది. అతను ఏదోచదువుకో బోతున్నాడు. వెళ్లి, కిటికీతీసి, "ఏమిటండీ... అంత వెన్నెల అవతల వర్షంలా కురుస్తుంటె, కిటికీలు వేసుకుని కూర్చున్నారు?" అని ఆమె అంది.

అతనునవ్వి, "ఎక్కడో ఆకాశంలోంచి వస్తోంది ఆ వెన్నెల... చూడు ఈ పుస్తకంలో అంతకన్న మనస్సుకు ఆహ్లాదం కలిగించే పండువెన్నెల.." అని పేజీతిరగేశాడు.

కాసేపుండి ఆమె అంది.

"మీ పండువెన్నెల... మీరూను. మీపూలూ, ఆకాశం... నక్షత్రాలూ... చివరికి నేనూ... అన్నీ అపుస్తకాలే! మీరెక్కడ". అని కిటికీ కానుకొని నిలబడింది. ముడిఊడి, తలంటి పోసుకున్న జుట్టు, పిఱుదులవరకూ పడ్డది. గాలికి జుట్టుఎగురుతోంది. అతనికళ్లు అప్రయత్నంగా అక్షరాల మధ్యనుంచి ఒక్కసారి ఆ జుట్టువైపుకు గంతువేసినయ్. వెన్నెల ఆమె ముఖంపైపడుతోంది. పల్చని తెల్లని చీరె వనకనించి ఆమెపచ్చని శరీరం దాగుడు మూతలాడుతోంది.

"నిద్రరావట్లేదూ?" అని అడిగింది— భర్తతనకేసే చూస్తూండటం చూసి కొంటెగా నవ్వుతూ.

దొంగలా పట్టుబడ్డ అతను, "ఊఁ! అప్పుడే... నీకువస్తుంటే వెళ్లిపడుకో... లేకకపోతే ఇదుగో... చదువుకో మంచినవల— అశరీరమైన ప్రేమనవల." అన్నాడు—

బలవంతంగా కళ్లను ఆమె మీదనుంచి పేజీవైపుకు మరలుస్తూ.

"అశరీరమైనప్రేమ... అశరీరంగా మనం జీవించి నప్పుడు, అశరీరప్రేమల గురించి చదువుదాం అయినా ఏమిటో ఈ పుస్తకాలు చదవటం. మనను గురించేకదా అందులో వ్రాసేది. మనంఎలా ఉంటున్నామో, మనకోపాలు, తాపాలు, ప్రేమలు, ద్వేషాలు... వీటినిగురించే, మన జీవితాల గురించే

కదా అక్కడ వ్రాసేది. జీవిస్తున్న మనకు అవి ఎందుకు? జీవించటం ఎరగని వారికి గాని" అని అంది ఆమె. ఆమె స్వరంలో చిలిపితనం, ఎత్తిపొడుపు అతను గ్రహించాడు.

"నువ్వొక్కడ... జీవితమంతా ఆయూలా గ్రం ఎగిరినదానివి...అయితే వెళ్లి పడుకో." అన్నాడు.

"నా ఒక్కత్తెకూ భయం" అంది ఆమె.

"చాలులే...ఇక... వెళ్లు" అని చదువులో పడ్డాడు మళ్లీ అతను.

ఆమె వెళ్లి పడుకుంది. ఇలా ఒంటరిగా వచ్చి పడుకోటం ఆమెకు అలవాటైంది. నిశిరాత్రిదాకా భర్త ఏదో ఒకటి చదువుతూనే ఉంటాడు. తర్వాత నిశ్శబ్దంగావచ్చి... విడిగావెళ్లి తనపక్కలో తాను పరుంటాడు. తనపై కోపమూలేదు. చికాకూ లేదు. ఆ తొలిరాత్రికూడా తన్ను పక్కలో పడుకోమని, తాను చాపమైపరుంటానని అన్నాడు. తనతో సరిగానే మాట్లాడుతాడు. కాని అంతే... అంతా ఎడంగానే.

అతని దగ్గరకు వెళ్లాలని తనకు అనుపించినట్లు, అతనికి తనదగ్గరకు రావాలనిపించదూ? ఇందాక కిటికీ వద్దనుంచొని తను వెన్నెలలోకి చూస్తుంటే అతను తన కేసి ఓరగా తదేకంగా చూడటం గమనించింది. కాని వెంటనే తనదగ్గరకు వచ్చాడా? పోనీ తనను దగ్గరకు రమ్మన్నాడా? లేకపోతే తను పిలవగానే అలాగే అని గదిలోకి వచ్చాడా? లేదు... ఇదే తనకు అర్థమూ కావట్లేదు. తృప్తిగానూ ఉండట్లేదు. పోనీ తనమీద ఇష్టంలేదా అంటె, కాలేజీనుంచి ఆపాఠాలు చెప్పి రాగానే ఎక్కడికీ వెళ్ళడు. ఎప్పుడూ ఇంట్లోనే ఉంటాడు. ఎవరూస్నేహితులు కూడా రారు. మరి ఇదేమిటి?

అతనికి చదువు సాగట్లేదు. గాలికూడా కొద్దిగా వేస్తోంది. వెళ్లి కిటికీలు మూశాడు. మళ్లీ చదువారంభించాడు. సాగట్లేదు. ఆ అక్షరాలు అలుక్కుపోతున్నయ్. లేచి, దీపంతీసి గదిలోకి వెళ్లాడు.

నిద్రపట్టలేదు. నడిజాము తిరిగింది. చిన్న దీపం వేశాడు. ఆమె జుట్టు దిండంతా కమ్మింది. గాఢ నిద్రలో ఉందామె. దీపంతీసి పడుకున్నాడు. అతని మనస్సు చివుక్కుమంది. ఒంటరిగా ఆమెనిందాక తిప్పిపంపించి నందుకు నొచ్చుకున్నాడు.

అతనిచెయ్యితగలగానే ఆమె ఉలిక్కిపడి లేచింది. "ఏంలేదు...పడుకో" అన్నాడు.

"ఇంతవఱకూ చదుతూనే ఉన్నారా?" అని అడిగింది ఆమె కళ్లు నులుపుకుంటూ.

"ఇందాకే వచ్చా... పడుకో" అని దీప మార్పాడు.

ఆమె కతనిశరీరం రాచుకొంది. అతని చేతులు మెల్లగా నడుమును చుట్టుతున్నయ్. ఆమెలో ఉద్రేకం హెచ్చింది.

"మన మెవరం?" అంది.

అతనేమీ మాట్లాడకుండా, ఆమెను దగ్గరగా హత్తుకుంటున్నాడు.

"పశువులం కాదు, మనకు ముఖ్యం జ్ఞానం" అని హఠాత్తుగా లేచికూర్చుంది. ఆమె స్వరంలో పరిహాసం లేదు.

అతను లేచి కింద నిలబడ్డాడు. ఆమె మాటల కతని ముఖమంతా ముడతలు పడుతున్నట్టుంది. తల తిరిగిపోతోంది. రోషావేశాలతో శరీరం కంపిస్తోంది. చీకట్లోతడుముకూ పుస్తకాల గదిలోకివెళ్లాడు.

తన పతనానికి తానుసిగ్గు చెందాడు. కిటికీ తలుపులు తీశాడు. జగత్తుఅంతా వెన్నెల్లో మునిగి ఉంది. తనే ఎడారి ఒడ్డునదిక్కులు చూస్తున్నాడు. ఇంటింట అంతామై మఱచిఉన్నారు. తనే కఠోరమైనా జాగరణతో పొద్దుపుచ్చుతున్నాడు. మళ్లీ కిటికీ వేసి, వచ్చి పుస్తకం తెఱచాడు. పేజీల మధ్య నలిగిన ఈగ ఒకటిజారి కిందపడ్డది.

## 3

"ఏమింటికా... ఆ వంటింట్లోనే"

"బాగుంది... ఇరవైనాలుగు గంటలూ, మీకెదురుగా కూర్చుంటె, ఇక్కడపని ఏ పెద్దమ్మ చేస్తుంది?" అంది ఆమె వంటింట్లోంచి.

"ఎప్పుడూ పని... పని... రాత్రి తొమ్మిది దాటినా ఆపనికి అంతు అంటూ ఉండదు. రేపు పొద్దున చేసుకోవచ్చులేద్దూ" అని బతిమాలాడతను.

ఆమె మాటాడకుండా పనిచేసుకుపోతోంది.

"నిన్నే... మళ్లీ ఏదో పనిలో పడ్డావు." అని పిలిచాడు."

"ఊఁ... అయితే ఉండండి... చేతిలో పని అవాలా? వస్తున్నా లెండి... పట్టించేపట్టు" అని ఆమె వంటింటి తలుపులు వేసి గదిలోఅడుగు పెట్టింది.

"పదవస్తోంది. ఇంక నిద్ర అక్కర్లేదు గావును. రా" అని పురమాయించాడతను — ఆమె కుర్చీలో కూర్చోబోతుంటె. ఆమె అతని దగ్గరకువెళ్లి "ఊఁ! ఏమిటి చెప్పండి?" అని అడిగింది కొంటెగా.

"ఏం లేదు గాని... మంచిదానివి... ఆ వెధవ దీపం తీసేద్దూ" అన్నాడు.

"ఇంకా పదన్నా కాలేదు. అప్పుడే లైట్లార్పటమా! బొత్తిగా చదువూ సంధ్య లేదు. ఇక నిశి రాత్రైనా నను నిద్రపోనీయరు గావును... అదిగో... చెప్తున్నా... మీ వేళ్లు అల్లరి ఆరంభించినయ్." అని జఘనివతల వైపుకు లాక్కుంది.

అతను పమిట సర్దబోయాడు.

"సరిగా ఉన్న పమిటను సర్దరావటం ఎందుకండీ" అని, ఆమె మెల్లగా ఆరంభించింది.

"అప్పుడే బాగుంది. ఆరోజులే బాగున్నయ్. హాయిగా నిద్రైనా పోయేదాన్ని... ఇప్పుడు పన్నెండైనా నిద్రపోనీయరయ్యె. మరిమీరూ ఆ కాలేజిలో ఆ సన్నాసులకేం చెప్తున్నారో! పుస్తకం పుచ్చుకొని ఎన్నాళ్లయింది మీకు? నిజం చెప్పండి.. నా ఊపిరితీయక, కొత్త మళ్లీ చదువారంభించండి... పుస్తకాలు తెచ్చిపెట్టుతాను." అని అంది.

"అదంతా అప్పుడు విద్యాశ్రమం... ఇప్పుడు గృహస్థాశ్రమం" అన్నాడతను.

"అలాగా.... చూద్దాం" అని ఆమె గబగబా పుస్తకాల గదిలోకి వెళ్లి రెండులావు పుస్తకాలను తెచ్చి, వాటి మీది దుమ్ము నూదింది ఉఫునఊది అతని ముందు పెట్టింది.

అతను అందుకున్నాడు.

"ఆ! మనను సుకించేగా వ్రాసేది ఆపుస్తకాల్లో జీవితాన్నెరుగని వాళ్లకు గాని మనకు ఎందుకు పుస్తకాలు?" అని అతను చటుక్కున దీపమార్పాడు.

"బాగానే ఉంది. ఇలా అయితే కాలేజీలో ఉద్యోగం సాగినట్లే!" అని ఆమె మెల్లగానడుం వాల్చింది.

ఇద్దరిమధ్య చీకటి కమ్ముకుంది.

అతనామెను గట్టిగా హత్తుకుంటూ, "మన మెవరం?" అని అడిగాడు.

"దేవతలం" అంది ఆమె.

"కాదు మనుష్యులం" అన్నాడతను.

'నిజం?...' ఇన్నాళ్లుపట్టింది అబ్బాయిగారికా విషయం తెలుసుకోటానికి... మళ్లీప్రొఫెసరుట ప్రొఫెసరు.' అని దగ్గరగా జరిగిందామె.

పక్కహాలు ఊయాల్లో పసిపిల్లడు కంగారుగా లేచి, కెవ్వున ఏడ్పు ఆరంభించాడు.

దీపం వేసి, కళ్లు నులుపుకుంటూ, బూజుపట్టిన పుస్తకపు పేజీలు మెల్లంగా తిరగేస్తున్నాడతను.



# ప్రబంధకవులు - ఆహారసూత్రాలు



శ్రీ గుమ్మలూరు సత్యనారాయణ

జనసామాన్యాని కనుకూలమైన ఒక ఉద్యమాన్ని నడిపినప్పుడు, భిన్న భిన్న తత్వాలు ఆశయాలు ఆదర్శాలు గల ప్రజల కందరకు నచ్చినట్లు దాని కార్యక్రమం బహుముఖంగా నడవగల దని వేరే చెప్ప బని లేదు. ఈనాడు మనల నందరిని కలత జేస్తున్నది—ఆహార సమస్య. గత ఆరేండ్లనుండి ప్రజాపాలకుల దృష్టి తీవ్రంగా తీవ్రతరంగా దీనిపై పనిజేస్తూనే ఉంది. కార్యక్రమంలోని విషయాల నంది పుచ్చుకొనడానికి తగిన రూపురేఖలు, వేషభాషలు, అనుపానాలు ఒక్కొక్క రొక్కొక్క విధంగా ఆశిస్తారు. అందులో నది ప్రయోగించబడినప్పుడే ఫట్టున వారి మనస్సున లగ్నమయి, కార్యరంగంలో సుముఖపాత్రను వహించగలదు.

ఈనాటికిని మన ప్రాచీన వాఙ్మయములో గల సూత్రాల నాధారం జేసుకొని ప్రతి కొత్త విషయాన్ని విమర్శించుకొంటూ ఆచరించే వా రెంతోమంది ఉన్నారు. వారిలో కూడ రకరకాలు. ఇప్పుడు మన చుట్టును గల పరిస్థితులకు సరిపడని సంగతులు వేద పురాణభాగాలలో నున్నప్పుడు, ‘ఏమో! అవి స్వప్న సౌధా’ లని ఊహించేవారు కొందరు. అటుతర్వాత వచ్చిన ప్రబంధాలలో ఆధునిక దృష్టికి సరిపోయే పోకడ లుండుటచేత, వాటిపై ఎక్కువగా గౌరవము గలవారు కొందరు. ఈ రెండింటిని త్రోసి రాజు చేసి నవ్యసాహిత్యములోనూ శాస్త్రములోనూ మన ఉద్యమానికి కావలసిన వస్తుసేకరణకై తాపత్రయ పడేవారు బహుసంఖ్యాకులు.

ఆహారవిషయంలో మనదేశాన్ని స్వయంపోషకంగా జేద్దామని కృషిజేస్తున్నాము. ఆహారోత్పత్తికి కావలసిన ప్రధాన హంశాలలో నొకటి నీరు—వస్తుతః గుణతః కూడా ఉత్కృష్టమై బహుళమై ఉండాలి. “వానచేత సస్యవర్గంబు వర్ధిల్లు, సస్యవృద్ధి సకల జన సమృద్ధి, కారణంబు దాన గావున ధర లోన, వాన వలయు నెల్లవారలకును.” అని దోనయ్య (క్రీ. శ. ౧౩౫౦) తన సస్యానందలో వ్రాశాడు. రెండుమూడు దశాబ్దాల వెనుక నొక ఇంగ్లీషు శాస్త్రవేత్త హిందూదేశ వ్యవసాయాన్ని విమర్శిస్తూ, ‘హిందూదేశ కర్షకునికి సమృద్ధిగా నీరుంటే చాలు’ నన్నాడు. ‘కావలసిన వాటిని పండించుకొనడం, పండించినవాటినే తినడం’ అనే సూత్రాన్ని ఎవరికి వారు పాటించవలసివస్తే మన తత్వాలలో కొన్ని సర్దుబాట్లుండాలి. పాత సన్న బియ్యానికే తాతకాలము నుండి అలవాటు పడియున్నామని ముతక బియ్యాన్ని జూడగానే మూగ్గేవా రెందరో మనలో ఉన్నారు. మన పంటలను ఫలసాయాన్ని బట్టి—ఒక్క వరి యన్నమే కాకుండా—జొన్నలు, చోళ్లు, గోధుమలు మొదలైన యితర ధాన్యాలను చిరుధాన్యాలను కూడా యుక్తంగా కలిపిసేవించాలని యీనాటి ఆహారోద్యమంలో ఒక విషయం. ఆహారంలో వచ్చేలోటుపాట్లను దీర్చి, మనకు ఆహార హితవుని ఆరోగ్యాన్నీ ఇచ్చేపాలు పండ్లు ఆకుకూరలును రక్షకాహారా లంటారు. ఇటువంటి రక్షకాహారాలు మనం తినబోయే మిశ్రితాహారంలో చేరి ఉంటే అన్నం హితమై బలకరంగా నుంటుంది.

ఇటువంటి విషయాల నొక విధంగా వ్యక్తపరచిన ప్రబంధాలు, ప్రాచీన వాఙ్మయంలో ఎన్నో ఉన్నాయి. ప్రత్యేక శాస్త్రభాగాలు వాటిలో కేటాయింపుగా లేకపోయినా, నానావిధ శాస్త్ర సమన్వయంగా మాత్రం ప్రబంధ కవులరచన లున్నాయని చూడగలము. వాటిని తరచి, తర్కించి, అధునాతన విజ్ఞానదృష్టిలో వ్యాఖ్యానించగలిగితే ప్రయోజన మెంతైనా ఉంది.

శ్రీనాథుడు (౧౪వ శతాబ్దము)
పూర్వమందు విషము పుచ్చుకొన్నానని,
గర్వపడెదవేల - కాలకంఠ ?

కొండవీటి సీమ పండు జొన్నల కూడు,
తిన్న నీదు బయసి బయట పడుర !

ఫుల్ల సరోజనేత్రి యల
పూతన చన్నుల చేదు ద్రావి నా
నల్ల దవాగ్ని మ్రింగితి న
టంచును నిక్కెదవేల? తింత్రిణీ
పల్లవయుక్తమై యుడుకు
బచ్చలి శాకము జొన్నకూటితో
మెల్లన యొక్క ముద్ద దిగ
మ్రింగుము నీపస కాననయ్యెడిన్

రసికుడు పోవడు పల్నా,
డెసగంగా, రంభయైన యేకులు వడకున్ |
వసుధేశుడైన దున్నును,
కుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్ ||

జొన్న కలి, జొన్న యంబలి,
జొన్నన్నము, జొన్నపిసరు, జొన్నలు తప్పన్
సన్నన్నము సున్న సుమీ,
పన్నుగ పల్నాటి సీమ ప్రజలందరకున్ ||

—అని జొన్నకూటి మహిమను, యోగ్యతను వర్ణించాడు. వేరొకచో తన పల్నాటివీర చరిత్రలో ఐతమ్మ సంతానమునకై నోచిన నోములను వర్ణిస్తూ, కొడుకు బాలచంద్రునితో "గజనిమ్మనోము" విషయాన్ని ఆమె ముచ్చటించడము శ్రీనాథుడు వ్రాశాడు. అందులో—

- మంజరి -

గజనిమ్మ నోమిన గలుగు సంతాన
మను వాక్యమున కప్పు డానంద మొంది
పెద్దలౌ విప్రుల బిల్వంగ బంపి
వారితో జెప్పితి వాక్యలక్షణము—
విని వారు సంతోష విశ్రాంత మతిని
శోధించి చెప్పిరి శుభ ముహూర్తమున
'శాస్త్రమందున్నది చాన! యీ వ్రతము
సంవత్సరము నిండ సల్పగావలయు.
చంద్రభాగానది సదృశ శైవలిని
కలుగదు పలనాటి గడ్డయందెల్ల
కృష్ణకుసమ మిది, కీర్తనీయంబ.
స్నాన మానదిజేసి... ...
... ... ... ... ....
చెన్నకేశవునకు జేసి జోహారు
... .... ... ... ...
వైకుంఠ శృంగార వనము లోపలను
చెన్నారు నా నిమ్మ చెట్టున కేగి
చుట్టు తెన్నుగ జేసి శుద్ధి జేయించి
వనదేవతను భక్తి వర్ణన జేసి,
... ... ... ... ...
పలకల బావిలోపల నీరు ముంచి
పాదులోపల గడు భక్తితో పోసి
... ... ... ... ...
ఎడపక దినముల నీలాగు జరుప
గొన్నాళ్ళ కా, నిమ్మ కొమ్మ చిగిర్చి
ఫల తతుల్గన్పించి పరిపక్వమౌను;
వర్షాంత మందని వార్యంపు భక్తి
జెట్టు ఫలంబుల జెన్నుని కిమ్మ
సంతాన మబ్బును సంశయ పడకు'
మనుచు భూసురులెల్ల నాడిరి...

ఇందు వనపోషణలోని అభిరుచి, శ్రమంతయైనా చేయగల కాయకష్టము ఒక విధంగా వ్యక్తమౌతూన్నది. ఆ ప్రాంతాల కనుకూలమైన ఫలాలలో గజనిమ్మ ఒకటి. ఏ ప్రాంతములో విరివిగా దొరకి విలువ గలదో ఆ జాతి వృక్షసంతతిని ఆరాధించడము గమనించ దగ్గది. 'స్వయంపోషణ సూత్రాలలో నిదొక ఆధారము. నిమ్మజాతి మొక్కకు చాలినంత నీటిని లోతైన బావినుండి చేది పోయడములో గల కాయకష్టం దురూహ్యం. వడ్లు, గోధుమలు, చోళ్లు (రాగులు) కంటె జొన్నలు ఎక్కువ ఇంధనశక్తి నివ్వగలవి. వర్షపాతము తక్కువగా గల ప్రాంతాలలో విరివిగా పండే చిరుధాన్యం జొన్నలు. వీటికి తోడుగా బచ్చలి. నీటియెద్దడి గల ప్రాంతాలకును అనువైన ఆకుకూరయని బచ్చలియాకు స్వభావంబట్టి తెలుసుకొనగలము.

అతివృష్టి అనావృష్టిదోషాలను సాధ్యమైనంత వరకు నివారించి ప్రజలను కాపాడడము రాజధర్మముగా వర్ణించిన భాగా లనేకం ప్రబంధాలలో కన్పడుతవి.

"కురియించు నొక వేళ శరసమే యనవృష్టి,
ధరణి కనావృష్టి బరిహరింప
గాయు నెండలు భానుకరణి విప్పిరి వేళ,

నీదుచేఁ బ్రజ నొప్పి నెనయనీక
విసరు జల్లని గాడ్పులసమాన పవమాన
శాబమై యుండు వేసవులయందు
పండించు సస్యసంపద లోషధీశుడై
తృణలతానంద దామృతమునించి"
చేరనీయడు రుజలందు జెనకనీడు,
మృత్యువును భూమి జనుల - ధార్మికుడతండు
యోగిబలమున దివిజాలయాగతములు,
సాగగానీయ డొక్కొక్క సమయములను. ||
(కట్టావరద రాజేంద్రుని శ్రీరంగమహాత్మ్యము.
ఆ. 7-17 వ శతాబ్దం.)

ఇక సస్య దోహదములో నీటికి గల ప్రాముఖ్యతను వర్ణిస్తూ, శ్రీ కృష్ణదేవరాయలు (16 వ శతాబ్ది) తన ఆముక్తమాల్యదలో—

"దేశ వైశాల్య మర్థసిద్ధికిని మూల,
మిల యొకింతైన గుంటకాల్వలు రచించి
నయము పేదకు సరిగోరునను నొసంగి
ప్రబలజేసిన నర్థధర్మములు పెరుగు"

—సాగునకు కావలసిన భూమిని హెచ్చు చేయాలనిన్నీ, అది తక్కువైనపుడు పంటలైనా హెచ్చుగా పండడానికి పంటకాల్వల నేర్పరిచి నీటి పారుదలను కల్గించాలని చేసిన హెచ్చరిక యీనాటి మన పరిస్థితుల కక్షరాలా సరిపోతుంది.

ఒక్క నీటి సదుపాయమే కాకుండా, పారే నీటిలోని గుణంకూడా, మంచిదై ఉండాలనే భావం వ్యక్తమౌతుంది—వసు చరిత్రలోని అధిష్ఠానపుర వర్ణన:—

"స్వారాజ్యంబును బోలె నింద్రున
కధిష్ఠానం బధిష్ఠానమై
యారాజన్యున కింపు
సొంపెసగు నిత్య శ్రీల కావాలమై
యారామ స్మయమాన సూన
మకరం దాసార శైవాలినీ
ధారా వర్ధిత మాధురీ గుణ
లసత్కాంతార కాంతారమై"

—అధిష్ఠాన పట్టణములోని తోటలయందలి పూదేనియల జాలుచేత చెరువునందలి సహజ మాధుర్యము వర్ధిల్లుచున్నదని, కవి—రామరాజ భూషణుడు (భట్టుమూర్తి) వర్ణించాడు. అంతేకాకుండా అక్కడి జలప్రవాహాలు సమస్త భూతములకు ముక్కారు పంటలు గలుగ జేయునట్లున్న వంటూ '...ప్రచారములెల్ల విశ్వధాత్రీ వలయ త్రికాల ఫలదేశికముల్' అని వివరించాడు.

18 - వ శతాబ్దినాటి అయ్యలరాజు నారాయణామాత్యుడు తన హంసవింశతిలో నాటి ప్రజల అనుభవములో నుండే రాజనాలు, ఏనుగుగొమ్ములు, వంటి రకాల వడ్లనెన్నింటినో వర్ణించినాడు. వారి భోజనక్రమములో నుండే కాయగూరలు, ఊరుగాయలు మన మీ నాడునూ గుర్తించదగ్గవి. ఏమంటే కాయగూరలలో దుంపలు, ఆకుజాతులు, కాయజాతులు కలిసిఉన్నప్పుడా ఆహారం హితవౌతుందని కదా శాస్త్రకారులు నిర్ణయిస్తున్నారు. వీటిని కొంతవరకు పాటిస్తూవున్నా, ఎన్నిజాతుల ఆకుకూరలకు గాని దుంపలకు గాని మనమలవాటు పడిఉన్నాము? కాలక్రమేణ ఒక గ్రామీణుల శాకశాకం అలవాటయి ఉండవచ్చును. పరిస్థితులు తారుమారైనపుడు కొత్త అలవాట్లను తీసుకొనవలసి వస్తుంది, మరొకస్థలంలో గాని సమయంలో గాని మనబోటి ప్రజలే తినిన కాయగూరలను, ఊరుగాయలను అవసరమైతే తగిన మార్పులను పాకక్రమంలో ప్రవేశపెట్టి, 'దొరికే శాకపాకాల సద్వినియోగాన్ని పొందగలముగదా!

దొండకాయ ములుకకాయ తొట్లకాయ
జంచికాయయు నెట్టిల సందకాయ
వెలయు నుస్తెకాయయు రామములుకకాయ
మేడికాయ కాచరకాయగూడ నింక.

రామగుమ్మడి యోంబరాజుగుమ్మడి చార
గుమ్మడి బూడిదెగుమ్మడులును
గిండిసొరయు దీఁగకిన్నరసొరయును,
బీఱ సముద్రపుబీఱ నేతి
బీఱ పిచ్చుకపొట్ల పెద్ద పొట్లేనుఁగు
దంతపుఁ బొట్లలు తంబలు నెలి
కాకర పొట్టికాకరలు మేకఁ జెవి చి
క్కుడుపాలగణపుల గోరుచిక్కు
డులు సుగంధాలు బొంత నంటలు [తరులు
సురళులు గంజిపందిటి కప్పురపొంకాయ

బూజుపచ్చ కురాసాని పుచ్చ చెద్రదోస
నక్కదోసలు వానితోటగలవు.

చేమకంద గెనుసు చిటిగోరు పెండ్లము,
పొసగు తెల్లగెనుసు భూత గెనుసు
లల్ల ముల్లిపసుపు ముల్లంగి నెల్లుల్లి
గాజరయును మొదలుగాగ గలవు.

గురుగెఱబొద్దు చెంచలియు
గుచ్చలి చిట్టితగిర్సి తుమ్మిదు
స్సరి బలుసూటి బొద్ది నెలి
చల్మిలి పల్లెరు రూకపాలెక్క వ
ల్వరిగిసె మున్గనెల్గ చెవి
పావిలి దుగ్గిలి పొన్నగంటి దే
దరి సరవంజి చేతరస
దాపయు గొంటలి కొంప పిండియుఁగా."

పాలవామింట తక్కలి బచ్చలి కొయి
గూర చక్రవర్తము చిల్కకూర గోళి
కూర దుంప బచ్చలి తోటకూర,
కొత్తిమిరాకు సోపు మెంతను చుక్కకు
ఆ. ౪. ప. ౧౨౮-౧౩౩ [గలదు.

మామిడికాయయు మారేడుగాయయు
గొండముక్కిడికాయ కొమ్మకాయ
గరుసుకాయయు వెల్గకాయు యండుగుకాయ
లుసిరికెక్కాయలు నుస్తెక్కాయ
లేకరక్కాయయు వాకుడు కాయయు
జిటినెల్లికాయయు జిల్లకాయ
కలబండ గజనిమ్మకాయ నార్దబకాయ
చిన నిమ్మకాయయు జీడికాయ
కొండనపుగొమ్మ మామెనకొమ్మ బుడమ
కాయయల్లము మిరియంపుకాయ బీఱ
కాయ కంచాలు కరివేపకాయ లాదియైన
యూరుగాయలు గలవతని యింట.
—ఆ. ౪. ప. ౧౩౫

ఈ రెండువందల యేండ్లలో తెలుగునాట ఎన్నో వస్తువులు వాడుకనుండి తప్పిపోవడమే కాకుండా, అర్థముకూడా కాని దురవస్థకు రావడము శోచనీయము.

హితాహారాన్ని వండించుకొని తినడమే కాకుండా, తినిన అన్నము సంపూర్ణంగా జీర్ణమయి శరీరారోగ్యాన్ని మనోవికాసాన్ని సంపాదించి నట్లు మనము భోజనము చేయాలి. భోజనసమయము, ఆసమయములోని మనశ్శౌచము, స్థలశౌచము కలిసి అన్నప్రహితవుని ఎగ్గుతగ్గులుగా మార్చగలవు. ఏమి తింటున్నామో తెలియకుండ మనసు వేరే ప్రసంగంలో కలతబడి ఉన్నపుడు, తినే వేళలో సదుపాయమైన దుస్తులలో కూడా ఉండనపుడు పరమాన్నమైనా బలవర్ధకం కాదని హెచ్చరిక లున్నాయి.

"తలఁజీర సుట్టియును జె
ప్పులు దొడిగియుఁ జేసినట్టి భోజనము ఫలం
బలఘు చరిత బద్మజుఁ
డసురల భాగంబని విధించెఁ బ్రకట ఫణితులన్.
—భారతము. అను ఆ. ౩. ప. ౧౪.

ద్విపద

ఫలపత్ర శాకాన్న పానాదులోలి
లలిమనః పూర్ణంతు నైవేద్యమనగ
భువి నయనానంద పూరితంబనఁగ
నవి మనంబార గన్నార శివార్థ
మతిని నాత్మీయార్థమతి నొక్కమాటు
రతి గూడ వర్ధించి ప్రాణ లింగార్ప
ణము జేసి సావధానమున బ్రసాద
మమలిన మతిఁ గొనుటాది మార్గంబు,
తడబడి యటుగాక, తత్ప్రసాదంబు
గుడుచుచో............
...రయమున గూలు నరకవార్థినుచు.

—పండితారాధ్యచరిత్రము (పాల్కురికి సోమనాథుడు ౧౫-వ శతాబ్ది.)

ఇంకా ఆ తినేదానినైనా,
"కడుపు నాలుగు పాళ్లనగా నెఱింగి,
రెండుపాళ్లన్నమునను బూరింపవలయు
బానమున నింపఁగా నొకపాలువలయు,
వాయుచలనకు నొకపాలు వలయు నెడము"

—చారుచర్య. (మంత్రియప్పన్న. ౧౩ శతాబ్ది)
తినేవిధానంలో కూడా— పద్యం. ౪౧.

మనుపు తియ్యఁ గూరలు రుచిగొనుట తెన్న,
నడుమ నొగరులు చేఁదులు నంజమేలు

పులుసు లాస్వాదనము సేయవలయుఁ బిదప
భోజనము సేయునప్పుడు - భూమిపతులు"

—చారుచర్య. పద్యం. ౩౭.

మునుపు మధురాన్నములు చవిగొనియె నేని
నడుమ లవణామ్ల తిక్తముల్ నంజె నేని
పిదప కటుకార్ద్ర భోజనం బొదవె నేని
బలము నారోగ్యమును జాల గలిగియుండు.

—విష్ణుపురాణం. ఆ. ౫ (వెన్నెలకంటిసూరన్న ౧౫ శతా).

ఈ విధంగా ఆహార సమృద్ధికీ, హితవుకీ, అనుకూలించే వ్యవహార కాండను ప్రబంధకవులు సూచించి వదలారు. కావలసినవాటిని పూర్తిగా పండించుకొనడము, పండినవాటిని సద్వినియోగపరచడము, భోజనవస్తువులు భోజనసమయాలు హితమైనట్లు చూచుకొనడమునూ— నాడు, నేడు, రేపునూ కూడ పాటించదగినవే. ఆ హితాహారాన్ని సేవించడానికి కావలసిన తతంగమంతా మనోవాక్కాయ కర్మల ద్వారా నడిపించవలసిన బాధ్యత ప్రతి వ్యక్తియందునా ఉన్నది. శాశ్వతమైన కొన్ని ఆహారసూత్రాలను వివరించి పోయిన ప్రబంధకవుల సామర్థ్యాన్ని వాఙ్మయాభిలాషులు గ్రహించగలరు. నిష్కళంకమైన కవిహృదయంలో ప్రతిబింబించే ప్రకృతి పాత్రాలు ఎన్నటికినీ సజీవమే. కవులు ప్రపంచము గుర్తించని అధినేతలని వెనుక షెల్లీకవి వ్రాశాడు. కాని నేటిపరిణామంలో రక్తపిపాసలను వదలుకొనమని చేసే శాంతి సందేశాలు ప్రపంచాని కేలాగున ఆదేశాత్మకలౌతున్నాయో, అలాగుననే కత్తి కాదు మనం కోరేది, కవన కళావేశమని, రానున్నదొక శాంతభావకళాయుగమనీ ప్రజాళి గుర్తించగలదు. దీనికి ప్రాతిపదికగా, కడుపునింపే కార్యక్రమాలు మనసు నింపే మంచిమాటలు వెనుక నెప్పుడో వ్రాసియుంచిన ప్రబంధకవుల ఆహారసూత్రాలునూ నేడాచరణయోగమనడములో సంశయం ఉండదు. అదే ఎన్నడైనా దేశానికి ఒక కవి చేయగలసేవ.



కథానిక:

# కాలపరశు

★

శ్రీ కవికొండల వెంకటరావు

కాటాకు మూడు కాళ్లలాగు ఆమె గుడిసెక్కూడా మూడు కాళ్లున్నాయి. కాని లోపల ఆమె దుఃఖభారాన్ని మూచే రాళ్లుగాని సిబ్బెలుగాని లేవు. ఆమెకు వున్నది వొక్కటే చీర అని లోకం అంతా అనుకొంటూ వున్నా, ప్రతీ సాయంకాలం సంధ్యారాగం ఆకాశంమీద వెలిసినట్టు ఆ గుడిసె కాళ్లమీదను ఒక చీర ఆరవేయబడి లోపల మనిషిని తేనెమంచునుండి, కొండగాలినుండి కాపాడుతూండే పరిపాటి. తెల్లవారేసరికి మళ్ళీ గుడిసె రూపం అస్థిపంజరం అంత అతినగ్నం! ఆమె మాత్రం వెచ్చవెచ్చని సూర్యరశ్మిలో నున్నగా దువ్వుకొన్న తల నిగారిస్తూ వుంటే, ఒకటి రెండు పేరు లేని పువ్వులేవో పెట్టుకొని, ఒక కడవ చంక నెట్టుకొని, అతివయ్యారంగా చీర ఎగకట్టుకుని, మేలుకొన్న కళ్ళతో, కొత్త మెలపు కొత్తతలపు ప్రతిరోజు కారోజే ఆమె కమరినట్టు దరహాసితవదనయై నడుస్తూ చూపఱకు వింత గొలుపుతూంది. వయస్సు ఇరవై దరిదాపు-రహస్సు అడుగడుక్కీ పమిటి సర్దుకోవలసిన అవసరంగల ఒడుదుడుకు ఏపు. కల కూడా ఆమెకు నిరాశాకల్పనమే అన్నంత కటిక దరిద్రురాలు. కాని కుండ చంక నెట్టి, దానిమూతిని చుట్టి ముచ్చటగా బాహువల్లరి కుండలీకరిస్తూ వుంటే, ఆమె కండరములు, నవనాళ్లు, పొంగి, ఉప్పొంగి, ఆమె కేవేవో ఆశగొలిపేవి కలవు అని అనిపిస్తుంది. దైనందినంగా ఆమెచర్య నుపలక్షిస్తే అవే ఆమె జీవనానికి పునాదుల్లా తోచితీరకమానవు కూడాను

ఒకటి, మొదటిసారి కడవ కాలవలో సుప్రభాతాన్నే ముంచేముందు నీళ్లల్లో తన నీడ చూచుకోవడంలా తోస్తుంది. రెండు, కడవ ముంచి నీళ్లు నిండా పట్టి బుజాన్నెత్తుకు రోడ్డుదాటేలోగా రోడ్డుమీద గునపంతో పొడిచే "కలకుర్రాపు" అనే యువకుణ్ణి పలుకరించడంలా తోస్తుంది. మూడు, ఆ నిండుకుండ నల్లా మోసుకెళ్లి, రోడ్డు రెండవపెడ నున్న తన గుడిసెమీది కొరిగి మొగ్గ ముమ్మరంగా తొడిగివున్న సర్కారువారి తియ్యమామిడిచెట్టు మొదట వొంచి దాని మొదలంతా తడిపి నీరు కట్టడంలా తోస్తుంది. ఈ మూడు పనులు క్రమంగా ఆమె ముం దొక ఆశాదృశ్యం, ఆమెయం దొక ఆశాకిరణం, ఆమె ఊపిరిసందు నొక ఆశాపవనాంకూరము, నిలిపి, గొలిపి, మలపి, ఆమె నొక రామణీయకమైన మహత్తర జగత్తులో పోతవిగ్రహంలా ప్రతిష్ఠించి చూపిస్తాయి. పిఅనిమిషమం దామె పడే కష్టపాటు తప్పనిసరిది. పై మూడుపనులూ మాత్రం ఒకరు చెప్పిచేయించుకునేవికావు. ఆమెకు అశిక్షితంగా అబ్బినవి. ఆమె నలరిస్తూ ఎదరవాని నలరించేవి.

ఆమెపేరు "కదుపుల కాత్యాయని". ఆ నాటున కాయేడే ఆమె వచ్చి "సిమెంటు"

రోడ్డుపోతలో ఆడకూలీగా కుదిరి రోడ్డు వారనే తక్కిన జట్టువాళ్లతోపాటు చర కుటీరపు బ్రతుకు పుచ్చుతూవుంది. జనాభా లెక్కల్లోకి ఆమెపేరెక్కిందో లేదో చెప్ప లేను గాని, కంట్రాక్టరు మస్తరు బుక్కులో మాత్రం వుంది "కరువుల కాత్యాయనమ్మ" అని. చరకుటీరాలవాళ్లకు ఇళ్ల నెంబ ర్లంటూ వుండవు. పనినిబట్టి మనుష్యుల యునికి! మనుష్యుల యునికినిబట్టి పని కాదు! రోడ్డున కోతట్టు బెజవాడ-బందరు కాలవ అవిచ్ఛిన్నంగా ప్రవహిస్తూతన ప్రక్కన పెద్ద పెద్ద మఱ్ఱిచెట్లను ఏనాటినుంచో పెంచి పెద్దవాటినిగా చేసి చిరంతనకీర్తి సంపాదించు కొన్నది వుంది. ఇక ఆవైపునకు రోడ్డు వెడల్పుగా బోదు. రెండవవైపే ఏ విస్తరింపు గన్నా ఏ మార్పు చెందినా!

చెట్టుగాథ మనిషి గాదు దాని కాలం దగ్గరపడే తుదికంటా అది ఎదుగుతూ ఎల్లకాలం వుండేటట్లే నిండుగా కనబడు తుంది. అటువంటి దృశ్యాల్లో ఒకానొక దృశ్యం పైని సూచించిన తియ్యమామిడి చెట్టుయొక్క రూపు. అది ఎప్పుడు మొలి చిన మొక్కో ఒకడు వేసింది కాదు. కాకి పడేసిన టెంకనుబట్టి లేచి ఆయేటి కాయేడు రెమ్మ కొమ్మబలిసి తుదకు నిరుడు పూత నిలబడి ఈయేడు ఆలాఆలా రెండవ పర్యా యం మొగ్గమీద వున్న మామిడిమొక్క! పి. డబ్లు డి. వారి లెక్కల్లోకి ఆయేడే యొక్క బెరడుకూస్త చెక్కబడి అంకె వేయబడి ఆదా రావచ్చుననే అంచనాగాంచి వుంది. కాని వేరు కారణాలచేతను మరో శాఖవారు ఆచెట్టునే తక్షణం నరికివేయ వలసినదిగా ఉత్తరువు జారీచేసియున్నారు. కారణం "హైవే"గానో "సైనికరస్తా"గానో రోడ్డు వెంటనే వెడల్పు కావడమే!

ఈ యుత్తరువు గాని ఆ లెక్కల్లో కెక్కించుకోవడంగాని చెట్టు కెంతమాత్రం తెలియదు. చెట్ల క్రింద గుడిసెలు వేసికొని రోడ్డు నిర్మాణమందు నిమగ్నులైయున్న పని వాళ్లకున్నూ తెలియదు. అందులో నూ కాత్యాయని గుడిసె పైచెట్టుక్రింద సరాసరి గుచ్చబడి వుంది. దానిమీద కా తియ్య మామిడిమొక్క కొమ్మలతో వొరిగి అను కోని ఆనందం కలిగించేది. ఆ ఆనందం కొద్దీ ఆమె దాన్ని నిత్యమూ తడుపుతూ తన చెట్టే అదన్నట్టు తలపోస్తూవుండేది.

సిమెంటురోడ్డు అన్నది ఒక్క రోజులో తయారైపోయేరోడ్డు కాదు. అది అధునా తనపురమహదారీ విస్తరింపుల్లో, పేరెన్నికగన్న మోస్తరున తయారయ్యేది. మనిషి నానా టికీ శాశ్వతతరంగా శాశ్వతతమంగా తన యొక్క కట్టడాల్ని, క్రంతల్ని ఏర్పాటు గావించుకోవడంలో "సిమెంటుకాంక్రీటు" విధానం వర్తమానమందు విశిష్టత దాల్చి వుంది. కానుకానులుగా చట్రాలమధ్య అం చీల మీద అది పెంచబడి మైళ్లకొద్దీ క్రమ క్రమాభివృద్ధి గాంచుతుంది. ఒక్కమాటుగా వ్యాప్తంగాదు. అందుచేత అది ఒకచోట రూపం దాలుస్తూ మఱెక్కడ ఆ రూపం ఎప్పుడు వహిస్తుందో ఎవ్వరికీ తెలియదు ఆ ప్లానులు చేత బట్టిన అధికార్లకు తక్క. అందాకా పని జరుగుతూన్న కాస్తమేర పెద్ద సందడి,—గునపం పోట్లు, కంకర టపటపు, నీటి తడుపు, రోలర్ యంత్రం ఈలల, గయిగయి, రయిరయి, అధికార్ల అదలకింపు, కంట్రా క్టర్ల ముదలకింపు! మిగతా ప్రదేశమందు

మామోలు పంథాయే, — చెట్లు, పశువులు, వ్యవసాయం, కొంపలు, నీళ్లు అన్నీ యథా ప్రకారంగా అనాదినుండీ ఏలాగు వుండివున్నాయో ఆలాగే వున్నట్లు పొడగడుతూ వుంటాయి.

ఆ యుదయం మన తియ్యమామిడి చెట్టుకు ఏవిధమైన ముప్పు వచ్చే జాడా ఎవ్వరూ కనిపెట్టలేదు. ఎటునుంచి దానికి కీడు? ముమ్మరంగా మొగ్గ తొడిగివుంది. దానిమీద వాలిన పక్షులేవీకూడా ఎవ్వరికీ ఆనడంలేదు. పైని మబ్బులేని ఆకాశం అతి పిసీలవంతంగా నిశ్చలంగా వుంది. తూర్పున పొడసూపిన ఉషోరేఖలు ఎఱ్ఱబారి ఎక్కడెక్కడి పొగమంచును పటాపంచలు గావించి, "అవిగో! విజయవాడ పర్వతాలు! ఇవిగో! యలమకుదురు కొండలు! అవిగో! పసుపుతోటలు! ఇవిగో! పొగతోటలు!" అన ఏర్పాటుగా నిరూపించాయి కూలీలపిల్లకాయలు మట్టిలోపిల్లిమొగ్గలు వేసికొంటూ ఆడుకుంటూ వున్నారు. వాళ్ల కుక్క ఒకటి ఉండుండి మొరుగుతూ వుంది. "బారన్"పాయిలోకి రాకుసింగు ఒకడు విసురుతూ, ధబీల్న తలుపు వేసేశాడు. ఉండీలబద్దలో ఎవడో ఒక మట్టి ఉండను అంతరాళంలోకి కొట్టేడు.

అదే నిమిషానికి పేరు చెప్పని పెద్దవాడొకడు గొడ్డలి లేసుకువచ్చి గుభేల్న తియ్యమామిడిచెట్టు మొదట ఒక్క నరుకు పెట్టాడు. నరుకులో నరద! నరదలో నరుకు! రెండోనరుక్కు గొడ్డలి లెత్తేలో — కరువుల కాత్యాయని చెంగుచెంగున వచ్చి మొదటి నరుకుమీద పడివుంది. ఆమెను చూడకుండానే కొట్టే అతడు, ఎత్తిన గొడ్డలి నల్లాబలం కొద్దీ రెండవతూరి గుభేలు మనిపించాడు,

"నన్ను చూసైనా చెట్టును కాపాడతావనుకున్నానురా అన్నా!" అని కరువుల కాత్యాయిని తాను ద్వేధా తుండెమ్మై పోతూ పెద్ద అఱపు అఱిచింది. మూడో నరుక్కి చెట్టుచెట్టు మొగ్గతోడిమతోసహా కాత్యాయినిమీదకు పెటపెట్లాడుతూ కూలిపోయి ఆమెను కప్పివేసింది! చూపఱకు ఆమె కాళ్లు చేతులు ఏవో చెట్టుయొక్క కొమ్మలూ వేళ్లూ ఏవోకూడా తెలియనంతటి కలిసిబిడి గోచరించింది.

అడిగినవాని కా స్థలం చెప్పే జవాబు "సర్కారుత్తరువునుబట్టి చెట్టు కొట్టబడింది; ఆమె నెవరు అడ్డపడమన్నారు?" అని.

అడగనివాని కా స్థలం చూపిన కరుణ, ఒక కోయిల ఆ చెట్టుమీదనుండి ఎగిరిపోతూ "కువకువ" మన్న గీతాలాపం పాంటూ, పేగే తడపడం అవసరం లేదన్నట్టు కఱకులాయడు తాను పొడిచే గునపం యొక్క పోటుపోటుకు ఉడుకుడుగ్గా విడిచే కన్నీటి విడుపు.

"పడతి మఱి కడవతో నీళ్లు మోసుకొచ్చి పొడిచేటి బాటపై పోయనక్కఱలేదు! అతగాని కనుదోయి పోటు పోటుకు చుక్కగార్చేని నేర్చేని కాలంపు పరశు!

# గ్రంథ విమర్శనము

## నాకబలి

నవల: వి. డి. ప్రసాదరావు. సాత్యవతేయ ప్రచురణలు. ౯, నాదమునిస్ట్రీటు త్యాగరాజనగరు మద్రాసు. వెల ౩—౦—౦.

ఇది మనస్తత్వాలు ప్రధానంగాగల నవల. ఇటువంటి రచనలో మనస్తత్వం ఆధారంగా పాత్రపోషణ జరగటమే కాక, మనః ప్రవృత్తివివరణల సహాయంతో పాత్రలకు జరిగే సంఘటనలు పఠితలకు అనుభవాలు కావటానికి ప్రయత్నం జరుగుతుంది. పఠితలూ, పాత్రలూ సమవర్గీయులైనప్పుడు సాహిత్యంలో ఇటువంటి ప్రయత్నం విధిగా ఉండాలి.

"నాకబలి" లో రాఘవరావు అనే కుర్రవాడు చదువునిమిత్తం కాశీ వెళ్లి అక్కడ ప్రభావతి అనే ఆమెను—తనకన్న పెద్దదాన్ని; మరొకరి భార్యను—కామించి ఆమెతో సంబంధం ఏర్పరచుకుంటాడు. తలవని తలంపుగా, ఈ ప్రభావతి రాఘవరావుజీవితాన్ని ఆక్రమించి అతని జీవితంలో అతని దగ్గరవాళ్లకుకూడా స్థలం మిగల్చని పరిణామంపొందుతుంది. అటువంటి పరిస్థితిలో ప్రభావతి తనకుతానై అతని జీవితంలోనుంచి నిష్క్రమిస్తుంది. ఇదే ఈ నవలలోని ప్రధానసంఘటన. ఇటువంటి సంఘటనకు రచయిత, ఇంద్రధనుస్సులోని ఏరంగు వేసినా వెయ్యవచ్చు. ఈసంఘటననే అత్యంత జుగుప్సాకరంగా చెయ్యవచ్చు. పఠితల హృదయాలలో గాటంగా నాటుకునే టట్టూ చేయవచ్చు. ఈ నవలలో రెండవదే జరిగింది.

మనస్తత్వాన్ని చిత్రించటంలో ఉన్న ప్రధాన విశేషమేమంటే, తనను తాను పరిశీలించుకునే మనసు తనను తాను మార్చుకుంటుంది. మానవులలో దేవత్వమూ, మానవత్వమూ, పశుత్వమూ, అన్నవి కరుడుగట్టి ఉండటమనేది ఆత్మపరిశీలన లేనివారిల్లోమాత్రమే సాధ్యమవుతుంది. ఆత్మపరిశీలనగల వ్యక్తి సహజంగా, స్వభావసిద్ధంగా, ఏలోకానికి చెందినప్పటికీ ఆత్మపరిశీలనతో మూడులోకాలూ నారదుని లాగా సంచారం చెయ్యగలడు. అందుకీనవలలో రెండుప్రబల ఉదాహరణలున్నాయి రాఘవరావు సహజంగా దేవతాంశ కలవాడు. లోకప్రకృతిమనసులో ఉంచుకుని, ఇతరులదృష్టిలో తానూ తన ప్రవర్తనా ఎట్లా ఉన్నదీ అంచనా కట్టేటప్పుడతను పఠితను చిరాకుపెడతాడు; వెంట్రుకలకు పాయలు తీస్తూ కూచున్నట్టుంటాడు. కాశీనగరంలో పికెటింగ్ చేసేవాలంటీర్లపై పోలీసులు లాఠీచార్జీలు చేస్తున్నప్పుడుకూడా ఇతరుల సాహస సహన స్వార్థత్యాగాన్ని పరిశీలించటంలో తాను ప్రేక్షకమాత్రుడుగా ఉండి, వారిలాగా ప్రవర్తించే సాహసం తనకు లేకపోయిందని కించపడతాడు. ఈ రాఘవరావే, ప్రభావతి విషమపరిస్థితిలో ఉన్నట్టు తోచగానే, అతి సహజంగానూ అప్రయత్నంగానూ తన లేత జీవితాన్ని ఆమెకోసం, ముందూ వెనకా చూడకుండా బలి ఇవ్వటానికి సిద్ధపడతాడు. ఈ పని చెయ్యటంలో అతనికి, లాఠీదెబ్బలుతినే వాలంటీర్లకున్న ఘనత లేదు; అతని త్యాగం తాత్కాలికమూ కాదు.

ప్రభావతి రాఘవరావుకు వ్యతిరేకం. ఆమె సహజంగా స్వార్థపరురాలు. భర్తపట్ల ఆమె సహజప్రవర్తన పాఠకుడికి చిరాకెత్తిస్తుంది. ఆమెలోఉన్న "సామాన్యత్వం" రాఘవరావుకూడా చూడగలుగుతాడు. ఆఖరుకు ఆమె తన అమ్మమ్మ విషయంలోకూడా ఉదారంగా ప్రవర్తించే అవకాశం కథకుడామెకివ్వలేదు. ఆమె అమ్మమ్మదగ్గిరికి రావటానికి కారణం అమ్మమ్మ వ్యాధి కాదు. అమ్మమ్మముందుగా చెప్పినప్పటికీ ప్రభావతి ఆ ముసలిప్రాణాన్ని అవసానదశలో కూడా ఆదరించక తన ప్రియుడిదగ్గిర వెళ్లిపడుకుంది. కాని ఈ ప్రభావతే ఆత్మపరిశీలన చేసుకోవటంలో దేవత్వాన్ని అందుకుంది. దానికామె కడసారి వ్రాసిన లేఖే సాక్షి.

ఈ రచయితకు వాతావరణం నిర్మించుకోవటం, బాగా తెలుసును; దేనిని వివరించాలో, ఏది పఠితల ఊహాకు వదలాలో, ఏయే సంఘటనలు ఆకస్మికంగా పఠిత కళ్లముందు మెరిపించాలో, ఎక్కడ త్వరగా తెర దించేయ్యాలో తెలుసును. అందుచేతనే రచనలో మజిలీలూ, విసుగెత్తటమూ ఉండదు. చదువుతున్న దానికన్న ఎక్కువ స్ఫురిస్తూ ఉంటుంది.

కొ. కు.

## ఆంధ్రులు - చరిత్ర

డాక్టర్ నేలటూరి వెంకటరమణయ్య
ఎమ్. ఏ. పి. హెచ్. డి.
ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు
వెల : ఒక రూపాయి.

ఈ గ్రంథంలో శ్రీ డాక్టర్ నేలటూరి వెంకట రమణయ్యగారు హైదరాబాద్ ఆంధ్ర సారస్వత పరిషత్తు తరఫున ఆంధ్రులచరిత్రనుగూర్చి ఇచ్చిన రెండు ఉపన్యాసాలు ఉన్నాయి.

మొదటి ఉపన్యాసంలో శ్రీ వెంకటరమణయ్యగారు భారతదేశచరిత్రకు ఆంధ్రులచరిత్రకు గల పరస్పర సంబంధం సాకల్యంగా చర్చించారు.

రెండవది ఆంధ్రుల సంస్కృతినిగూర్చి ఉపన్యాసము.

ఈ రెండు ఉపన్యాసాలలోను వీరు ఆంధ్ర చరిత్ర సంస్కృతులకు సంబంధించిన అనేక చిక్కు సమస్యలు విడదీయడానికి ప్రయత్నించారు. వీటిలో మొదటిది ఆంధ్ర, తెలుగుజాతుల ఐక్యసమస్య. రెండవది ప్రాచీనాంధ్రుల ఆదిమనివాస సమస్య. మూడవది ఆంధ్రులు ఆర్యులా? ద్రావిడులా అన్న సమస్య.

ఇప్పటివరకు దొరికిన ఆధారాలను బట్టి ఆంధ్రుల ఆదిమనివాసస్థానము ఇప్పటి అఫ్ఘనిస్థానానికి ఉత్తరంగా ఉన్న మధ్యాసియా అనీ, క్రమంగా దక్షిణాపథానికి వచ్చి వీరిక్కడ స్థిరనివాసం ఏర్పరచుకొన్నారనీ శ్రీ వెంకటరమణయ్యగారు భావిస్తున్నారు. ఇల్లాగే ఆంధ్రులు స్థిరనివాసం ఏర్పరచుకొన్న దేశానికి ఆంధ్రదేశమనే పేరు కలిగిందని వెంకటరమణయ్యగారి అభిప్రాయము.

ఆంధ్రులు ద్రావిడులా? ఆర్యులా అన్న సమస్యపై మాట్లాడుతూ వీరు ఆంధ్రులు ఆర్యులే అన్నారు.

ఈ విషయాలన్నీ ఆంధ్రచరిత్రకు సంబంధించిన గడ్డు సమస్యలు. వీటిని గట్టిగా నిర్ణయించడానికి గల చారిత్రికాధారాలు చాలా తక్కువ. ఇప్పటికే వీటిని గూర్చి వాదోపవాదాలు, పరిశోధనలు జరుగుతూనే ఉన్నాయి. అందుచేత వీటిని మనం ఒక ప్రసిద్ధ పరిశోధకుని అభిప్రాయాలుగానే స్వీకరించాలని అనుకుంటాను. ఉపన్యాసాలలో తమ వాదాలకుగల ఆయా ఉపపత్తులు కూడా వీరు సంగ్రహంగానే పేర్కొన్నారు.

అయితే ఆంధ్రసారస్వతాన్నిగూర్చి వీరిచ్చిన అభిప్రాయంతో సాహిత్యవిమర్శకు లంగీకరించడం కష్టము. ఈ గ్రంథంలో 64వ పుటలో ఇలా అంటున్నారు. "ఆంధ్రవాఙ్మయ మనుకరణ వాఙ్మయము. నన్నయ యే లగ్నమున సంస్కృతమహాభారతము నాంధ్రీకరింపదొడగెనో కాని దాని బలమున నాంధ్రవాఙ్మయమంతయు ననువాదముల మయమైపోయినది. సంస్కృతవాఙ్మయము నాంధ్రులవలె భారతీయులలో మరి యెవ్వరును మూరగొని యుండలేదు. సంస్కృత పురాణేతిహాస మహాకావ్య నాటక ధర్మశాస్త్రాది సకలవిధ గ్రంథములకు తెనుగున డూప్లికేటులను తయారుచేయుటయే తమ జీవితపరమావధియని యాంధ్రకవులు తలచినట్లున్నది. స్వతంత్ర మిశ్రకావ్యముల రచింతుమని ప్రగల్భములు పల్కిన ప్రబంధకవులు గూడ సంస్కృతకవుల గ్రంథముల నుండి లూటి చేయుట మానలేకపోయిరి."

అని ఇలాగ వ్రాసుకుపోతూ వారు పెద్దనవంటి అద్భుత ప్రతిభాశాలిఅయిన కవికూడా ఒక సంస్కృత శ్లోకచ్ఛాయ మనుచరిత్రలో ప్రవేశపెట్టుకొన్నాడని అన్నారు. వీరి అభిప్రాయంప్రకారం మన భారతకవులందరూ కేవలం సంస్కృతానువాదకులని తేలింది.

ఇది చాలా సాహసోపేతమయిన సిద్ధాంతము. కాళిదాసకవి వ్యాసభారతంలోనుంచి శాకుంతలోపాఖ్యానం తీసుకుని నాటకం రచించాడు. అంతమాత్రంచేత కాళిదాసకవి కేవలం అనువాదకుడయిపోయాడా? అల్లాగే భాసభవభూతులు రామాయణగాథలు తీసుకొని నాటకాలు రచించారు. అందుచేత వీరిద్దరు స్వతంత్రకవులు కారని ఏ విమర్శకులైనా అన్నారా?

నన్ను ఇంకొక దృక్పథంలోనించి పరిశీలిద్దాము. ఒక రచయిత లోకవృత్తం పరిశీలించి ఒక నవల వ్రాశాడనుకుందాము. ఆ నవల లోకవృత్తంలాగే ఉన్నదన్న కారణంచేత ఆ రచయితకు స్వతంత్రశక్తి లేదనీ కేవలం లోకవృత్తం అనువదించాడనీ అంటున్నామా?

శ్రీ వెంకటరమణయ్యగారు కేవలానువాదానికీ, సృజనాత్మకమైన (*Creative*) సాహిత్యానికీ గల భేదం గమనించనట్టు కనిపిస్తుంది. ఒక కవి ప్రాచీన కథ స్వీకరించి ఉండవచ్చును. భావాలు కూడా ప్రాచీనంగా ఉన్నవాటినే స్వీకరించి ఉండవచ్చును. వీటి నన్నింటినీ కలిపి తిరిగి రచించడంలో కవి కనబరచిన సృజనశక్తినిబట్టే అతని రచనకు కావ్యత్వం ఏర్పడుతుంది. ఎవరైనా ఒక కవి రామాయణం అంతా పద్యాల్లో వ్రాసి ఉండవచ్చును. కాని అతడు కవి కాకుండా కేవలం అనువాదకుడే అయి ఉండవచ్చును. మరి ఒక కవి ఆ రామాయణమే తెలుగులో ఒక మహాకావ్యంగా వ్రాసి ఉండవచ్చును. కావ్యంలో ఉపజ్ఞ (*Originality*) సృజనశక్తిమీదే ఆధారపడి ఉంటుంది గాని ఇతర విషయాలమీద ఆధారపడి ఉండదు. ఈ విషయం గుర్తించకుండా వీరు భారతకవులవంటి ఉత్తమకవులను తేలికగా కొట్టివెయ్యడం సముచితంగా లేదు. దీనినిబట్టి ప్రబంధకవులనుగురించి వీరు వ్రాసినదికూడా అనాలోచితమే అవుతుంది.

౬౬ పేజీలో వీరు కన్యాశుల్క ప్రతాపరుద్రీయాలు సంస్కృత సాంప్రదాయానుసారంగా రచింపబడినవన్నారు. నిజానికి ఈ రెండు సంస్కృతరూపక సంప్రదాయానుసారంగా రచించిన రూపకాలు కానేకావు. అందులోను కన్యాశుల్కం బొత్తిగా సంస్కృత సంప్రదాయం తిరస్కరించిన రూపకము.

ఇల్లాంటి వాఙ్మయ విమర్శనాత్మకమైన ఘట్టాలలో వీరు విమర్శింపదగిన అభిప్రాయాలు వెలిబుచ్చినా, ఆంధ్రచరిత్రలోని సమస్యలు అవగాహన చేసుకోదలచినవారికి గ్రంథం చాలా సహకరిస్తుంది. ఆంధ్ర చరిత్రాభిమానులందరు ఇది తప్పక చదవవలసిన గ్రంథం.

శాస్త్రి.

## ప్రేమ సీమ

శ్రీ వల్లంపాటి ప్రభాకర రావు.
సాహిత్య నికేతనము, మల్లేపల్లి - హైదరాబాదు.
వెల : రెండు రూపాయలు.

ఇది కీట్సు కవి వ్రాసిన (*Eve of st Agnes*) ఈవ్ ఆఫ్ సెంట్ ఏగ్నెస్‌ను అనుసరించి, అందులో కొన్ని భావాలు తీసుకుని, రచించిన కావ్యమనీ, అయితే ఇది అనువాదంమాత్రం కాదనీ గ్రంథకర్త పీఠికలో వ్రాశారు.

ఆంగ్లంలో నించి తెలుగులోకి వ్రాసేటప్పుడు మూలం యథాతథంగా అనుసరించడంవల్ల ఇంగ్లీషు రాని తెలుగు పాఠకులకు ఆంగ్ల కవితా స్వభావమైనా తెలుసుకునే అవకాశం కలుగుతుంది. అక్కడక్కడి భావాలు మాత్రమే స్వీకరించి వ్రాయడంవల్ల తెలుగులో దీనిని మూలానువాదంగా తీసుకోడానికి వీలు లేదు.

ఆంగ్ల జీవిత పరిస్థితులు వేరు. ఆంధ్ర దేశీయ జీవిత పరిస్థితులు వేరు. అందుచేత ఆ కథ ఆ పరిస్థితులు తెలుగు రచనలకు అంతగా నప్పవు. గ్రంథకర్త మూలంలోని నాయికానాయకుల పేర్లు మార్చి కథ నవరాత్రులలో జరిగినట్టు వ్రాశారు. అయినా ఇది తృప్తికరంగా తెనుగు జీవిత పరిసరాలకు సమన్వయించలేదు. రచయిత యథాతథంగా వ్రాసి ఉంటే ఇంకా బాగుండేదేమో. రచయిత పద్యాల్లో చాలాచోట్ల ప్రాథమిక వ్యాకరణ సూత్రాలుగూడా పాటించలేదు. ఈ రచయితకు వృత్తరచనలోకూడా బాగా చెయ్యి తిరిగినట్లు కనబడదు. పై విషయాలన్నిటికీ 'ప్రేమసీమ'లోని ఈ క్రిందిపద్యం ఉదాహరణగా ఇవ్వవచ్చును.

"పాపము సంభవించు యెడ
బాటొనరించిన పూర్వజన్మలో
నే పతిపత్నుల న్నొకట
నీ యెడబాటొనరించినాను నిన్
నీ పతి వీడిపోయె నిది
నిశ్చయ మానదిగానె నమ్ము; యే
పాపము సంభవింపదు కృ
పామతి! మము గూర్పు శీఘ్రమే.

శాస్త్రి.

# గ్రంథ స్వీకారం

### పండ్లు

నాలుగవ భాగము, వెల : 5 రూపాయలు.

అయిదవ భాగము, వెల : 4 రూపాయలు.
గోటేటి జోగిరాజు.

ప్రకాశకులు : ఆంధ్రగ్రంథాలయ ట్రస్టు—పటమట లంక.

### ఎచ్చటికోయ్

వెల : నాలుగణాలు.

### జీవనగమన ప్రసూనము

వెల : ఒక రూపాయి.
రచన. చదలవాడ పిచ్చయ్య
సెంట్రల్ బుక్ షాపు; మెయిన్ రోడ్, విజయవాడ.

### వేణీ సంహారము

బులుసు వెంకటేశ్వర్లు, బి. ఏ. రామారావుపేట : కాకినాడ., వెల : మూడు రూపాయలు.

### తుఫాన్

చెబియ్యం శ్రీరామమూర్తి, ఎం. ఏ. ప్రకాశకులు : అజంతా ప్రచురణాలయం, పోర్టుగేట్, రాజమహేంద్రవరం. వెల : 12 అణాలు.

### విప్లవ సందేశము

కె. వి. రావు. ప్రకాశకులు : జాకోబిన్ పబ్లిషింగ్ కంపెనీ, తెనాలి. వెల : రెండు రూపాయలు.

### తైత్తిరేయ వార్తికమ్

రాయప్రోలు లింగన సోమయాజి, బి. ఏ. బి. ఎల్. లలితాపురం, గుంటూరు.
వెల : 5 రూపాయలు.

### ప్రకృతి సౌభాగ్యము, లేక చీకటి వెలుగులు

కర్రా సుందరరామశాస్త్రి. బోర్డు హైస్కూలు, పెరూరు, తూర్పుగోదావరి జిల్లా. వెల: 1 రూపాయి.

### సంకీర్తనమీమాంస

శ్రీ కుందుర్తి వెంకట నరసయ్య. సాధన గ్రంథ మండలి, తెనాలి. వెల : 1 రూపాయి.

### శ్రీశైల పండితారాధ్య మూలపీఠము

గు. తి. అక్కులయ్య దీక్షితులు. ప్రకాశకులు: శ్రీపత్రిక కార్యాలయము, మదనపల్లి. వెల: 8అణాలు.

### అవధాన రత్నావళి

సోమపల్లి సంపత్ కృష్ణమూర్తి. కదిరి, అనంతపురం జిల్లా. వెల : 8 అణాలు.

### శ్రీలక్ష్మీ చెన్నకేశవస్థలమార్కాపురమాహాత్మ్యము

వారణాసి వెంకటకృష్ణమూర్తి. ప్రకాశకులు : శ్రీలక్ష్మీ చెన్నకేశవ పబ్లిషర్స్, మార్కాపురం (శ్రీశైలభూమి). వెల : 1 రూపాయి.



Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad